ఆంధ్రసాహిత్యపరిషత్ప్రచురణము-సంఖ్యా-౩౮.

శ్రీరస్తు.

# సింహాసనద్వాత్రింశిక

ప్రథమభాగము.

కొఱవి గోపరాజకవిప్రణీతము



కాకినాడ:

ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచేఁ బ్రకటింపఁబడినది.

1960.

వెల రు 1-50 న.పై.

టింగు వర్క్సు, కాకినాడ.

# ఆంధ్రసాహిత్యపరిషత్ప్రచురణములు.



| | | |
|---|---|---|
| 1. | ఆకారాద్యముద్రితగ్రంథసూచిక | 0- 8-0 |
| 2. | అమరుకము-జయంతి రామయ్యపంతులుగారు | 1- 0-0 |
| 3. | అఱవదేశమునందలి ఆంధ్రవాఙ్మయము-అ. ఉమాకాంతముగారు | 0- 4-0 |
| 4. | ఆర్యభాషావిభాగము | 0- 8-0 |
| 5. | ఆంధ్రసాహిత్యపరిషద్వృత్తాంతము | 0- 8-0 |
| 6. | ఆంధ్రకౌముది-గణపవరపు వేంకటపతికవి | 0-12-0 |
| 7. | ఆధునికాంధ్రవాఙ్మయవికాసవైఖరి-జ. రా. పంతులు | 1- 8-0 |
| 8. | ఉత్తరరామచరిత్రము-జ. రా. పంతులు | 1- 0-0 |
| 9. | ఉన్మాదసహస్రము (వెఱ్ఱి వేయివిధములు) కొత్తపల్లి సూర్యారావు | 0-12-0 |
| 10. | కవిజనోజ్జీవని—సమస్యలు-శ్రీకోటి రఘునాథ తొండమాన్ | 0- 4-0 |
| 11. | కవిజనాశ్రయము | 1- 8-0 |
| 12. | కావ్యాలంకారచూడామణి—పాఠభేదములు | 0- 8-0 |
| 13. | కాళిందీ కన్యాపరిణయము-అహోబలపతి (ప్రథమభాగము) | 1- 0-0 |
| 14. | డిటో (ద్వితీయభాగము) | 0- 8-0 |
| 15. | చంద్రభానుచరిత్రము—తరిగొప్పుల మల్లనకవి | 1- 0-0 |
| 16. | చంపూరామాయణము (ఆంధ్రము) జ. రా. పంతులు | 1- 0-0 |
| 17. | చాటుధారాచమత్కారసారః-(సంస్కృతము) | 0- 8-0 |
| 18. | జ్ఞానప్రసూనాంబికా శతకము | 0- 4-0 |
| 19. | జైమినిభారతము-సముఖము వేంకటకృష్ణప్పనాయకుఁడు | 1- 8-0 |
| 20. | జ్యోతిశ్శాస్త్రసారము-కపిస్థలం కృష్ణమాచార్యులుగారు | 0- 8-0 |
| 21. | నమస్కారములు-కొత్తపల్లి సూర్యారావు | 0- 4-0 |
| 22. | పరిషత్పుస్తకభాండాగారము 2వ భాగము | 1- 0-0 |
| 23. | ,, 3వ భాగము | 1- 0-0 |
| 24. | ప్రాకృతభాషోత్పత్తి-శ్రీమాన్ మే. వెం. రమణాచార్యులుగారు | 0-12-0 |
| 25. | బాలభారతము-(అగస్త్యకృతమునకుఁ దెలుఁగు) | 1- 8-0 |
| 26. | మన్నారు దాసవిలాస నాటకము-రంగాజమ్మ | 0-12-0 |
| 27. | యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము | 1- 0-0 |

సింహాసనద్వాత్రింశిక యనునీకావ్యము ద్వాత్రింశత్సాలభంజికలు భోజరాజునకుం జెప్పిన విక్రమార్కునికథలు, అయ్యవిముప్పదిరెండు. ఆకథలసముచ్చయమే యీకావ్యము. దీనికిమూలము కథాసరిత్సాగరము* ఆసాగరమునుండి యీరత్నమునెత్తి చక్కగా సానఁబట్టి యాంధ్రసరస్వతిని బూజయొనరించిన మహాకవి కొఱవిగోపరాజు. ఇట్టిమహారత్న మింతకాలముదాఁకను మఱుఁగుపడి యుండుట యత్యద్భుత మనకతీఱదు. కవికాలమునుబట్టి చూడఁ బురాణయుగమునకుఁ గడపటను బుట్టిన మొదటిప్రబంధ మయ్యును దీనినిఁ దరువాతఁ బ్రబంధకవు లెవ్వరును స్మరియింపకుండుట యేకారణముననో యూహింపఁ జాలకున్నారము. ఇట్టికావ్యరత్నమును దిరుగ సముద్ధరించిన శ్రీ యాంధ్రసాహిత్య పరిషత్తువారికి నాంధ్రదేశ మెంతయుఁ గృతజ్ఞమై యుండకతప్పదు. చిన్నచిన్నమాటలతోఁ జేనెలు గురియునట్లు, లేకాకారముగా నుండి విపుల మయ్యు విసువు పుట్టనట్లు తత్తదుచితస్థలములందే వర్ణనలతో నింపి పాండితీశక్తి యటుండఁ గవితాశక్తికే ప్రాధాన్య మీయఁబడిన యిట్టికావ్యము లాంధ్రమునం దరుదు. ఇట్టి కథాసముచ్చయరూపము లగు కావ్యములు బేతాళపంచవింశతి, హంసవింశతి, శుకసప్తతి మున్నగునవి యున్నను నివ్వి సర్వావయవ పరిపోషణము గాంచిన వన వీలులేదు. కడపటి దగు శుకసప్తతి జీవకళ గల కావ్యములలో మిన్నయే కాని కథావస్తువు ననుసరించి విలువ తగ్గక

* అచ్చుపడిన సంస్కృతమూల మొక్కటి విక్రమార్కచరిత్రము (గద్యపద్యాత్మకము) కలదుగాని యందుఁగల కథలవరుస యిందుఁ గానరాదు. విషయములును భేదముగానున్నవి.

## సద్వాత్రింశికపీఠిక.

మానస హంసవింశతి యొక నిఘంటు వనినను దప్ప కానేరదు. బేతాళ పంచవింశతికవిత యించుమించుగా నంతయు సంస్కారాపేక్ష గలది యనవచ్చును. ఇట్టికావ్యముల దృష్టినే కాక కేవలకల్పనాకథలు, నాద్యసత్కథలు, సత్కవికల్పనా విభూషావహపూర్వవృత్తములు నను మూఁడువిధము లగు కావ్యములదృష్టియందును నీకావ్య ముత్తమము గాకపోవదు.

ఇయ్యది స్వతంత్రకావ్యము కా దనియు, నాంధ్రీకరణమే యని యు, నాంధ్రీకరణమే మహాకష్ట మనియు నీకవియే యవతారికయందు సుకుమారమగుఫణితిని వివరించి తనభావనాశక్తిని వెల్లడించినాఁడు.

ఉ. ఈసరసోక్తికావ్య మొకఁ డిమ్ముల సంస్కృతభాష నచ్చగాఁ
జేసిన నట్ల వీఁడు మఱిచేయుట యేటిది యంచుఁ జెప్పఁగాఁ
జేసి యనాదరం బురక చేయకుఁడీ విలుకాఁడు తూఁటుగా
నేసిన నందె పాఱ మఱి యేసినవా నిద సూటి గావునన్. ౧-౩౪

ఈపద్య మెంత యు స్వానుభవమునఁ జెప్పిన దనుటకు సంశ యము లేదు. కాని యారీతి 'మక్కికి మక్కి'గాఁ జెప్పినవాఁడు కాకు న్నను నాంధ్రీకరణమునఁ గల ప్రయాసము వెల్లడించెను. ఇఁక నిట్టి భాష నుపయోగింపఁబూనె ననువిషయమున-

చ. తెనుఁగునఁ దేటగాఁ గథలు దెల్పినఁ గావ్యము పొందు లేదు మె
త్తన పస చాల దంద్రు విశదంబుగ సంస్కృతశబ్ద మూఁదఁ జె
ప్పిన నవి దర్పముం డ్లనుచుఁ బెట్టరు వీనులఁ గావునన్ మచుల్
దనరఁ దెనుంగు దేశియును దద్భవముం గలయంగఁ జెప్పెదన్.
౧-౩౨

అని చెప్పి యనువగుతావులం దెల్ల లలితము లగుజాతీయము లతో నింపినాఁడు. ఈతనికవితను గూర్చి యేదియు విశేషించి వ్రాయం బనిలేకుండ నవతారికయందుఁ దానే యద్దమువలె నిలిపి యున్నాఁడు.

కావ్యమునకుఁ బదునెనిమిదివర్ణనము లుండవలె ననునియమము పాటింపఁ దలఁచియు వాని నుచితస్థలములయందుఁ జూపెద నని చెప్పి యుండుటయే కాక యాయాయి ప్రసంగములం దాయావిద్యల సంపూర్ణస్వభావమును బ్రదర్శింపనినాఁడు సర్వజ్ఞతకు భంగ మనియు కానికేని యుచితజ్ఞత ముఖ్య మనియు

క. ఎప్పటి కేయది ప్రస్తుత
మప్పటి కా విద్యమహిమ మచ్చుపడంగాఁ
జెప్పక సర్వజ్ఞత్వము
చొప్పడునే కావ్య మంతసులభమె ధాత్రిన్. ౧-౨౨

అని చెప్పుటమాత్రమే కాక యట్లే చూపియున్నాఁడు

ప్రథమాశ్వాసమునఁ బద్మిన్యాది స్త్రీలక్షణములు, ద్వితీయాశ్వాసమునఁ జతుర్విధప్రాకృతములతోను చిత్రరీతులతోను గవితాకౌశలమును, తృతీయాశ్వాసమునఁ బౌరోహిత్యదారిద్ర్యాదిదూషణములను, నాల్గవయాశ్వాసమున నాంధ్రచ్ఛందశ్శాస్త్రమున విశేషించి యున్న యతులవిచారమును, బంచమాశ్వాసమున జీమూతవాహనచరిత్రమును, మఱొకతావున మల్లవిద్యయు, మఱొకసందర్భమునఁ జోరవిద్యయు, నింకొక ప్రసంగమున నఱువదినాలుగువిద్యల నామములును, స్వప్నములు, శకునములు మున్నగువానిని విశేషముగానో సామాన్యముగానో ప్రదర్శించెనే కాని విడిచిపెట్టిన యంశ మొక్కటియుఁ గానరాదు. ఈకావ్యమున నచ్చటచ్చట సందర్భములననుసరించి సార్వకాలికములును సార్వజనీనములు నగునట్లు చెప్పఁబడినవని యున్ననీతిపద్యము లన్నియు నేర్చి కూర్చినయెడ నొక చిన్న నీతిశాస్త్ర మగును. గ్రంథవిస్తరభీతిచే మానవలసివచ్చినది. కాని యొత్తిచూపవలసిన యెన్నో విచిత్రకల్పనము లింపుఁ గలవు. వివాహాగ్ర

స్థమైయున్న యొంటిమిట్ట వారంగలువాడము నీకవి మున్నే తీర్చియున్నాఁడు. ధర్మపురి, భువనగిరి, శ్రీశైలము మున్నగు వానిం దెల్పుచు–

త్రిలోకమాత మహాపాతక సంఘాతవిఘాతానుయాతఁగనియెన్ గంగన్.

క. ఆనదికిఁ బెక్కు ముఖ్య
స్నానం బొనరింప డిగ్గి చని యుదకం బా
లోనం దెకతెక నుడుకం
గా నద్భుతమైన మడుఁగుఁ గని వెరఁగందెన్.

అని గంగయే గోదావరి యని తెల్పుట కష్ణగుండమును వర్ణించినాఁడు.

ఉ. ఆకడ నీతిశాస్త్రవిదుఁ డైగురు పీఠ్విని యేఁగె వేడ్కతోఁ
గాకితమూలశక్తి గనిగా నొనరించిన పైఁడిచట్టునా
నేకశిలాభిధానమున నెన్నిక కెక్కి ధరిత్రిలోన నే
పోకలఁబోని యట్టి సిరిపుట్టినయింటికి నోరుగంటికిన్. ౧-ఆ.౧౫౬

అని యేకశిలానగర మోరుగల్లే గాని యొంటిమిట్ట కాదన్నట్లు తెలియఁజేసినాఁడు.

ప్రత్యేకత:— ప్రతికవికిని గల్పనాపాటవముననో, యలంకారముననో, వ్యాకరణముననో, ఛందస్సుననో, భావమందో కొంత ప్రత్యేకత యుండక మానదు. కల్పనాదులమాట యటుండ భావమం దీతఁడు చూపినప్రత్యేకత యనుపమానము. తరువాతికవులయందుఁ గాని పూర్వులయందుఁ గాని లేని యెన్నియో నూత్నశబ్దముల నీకవి వాడియున్నాఁడు. బొనగిలు=బలాత్కృతమగు; కాసించు = కాసె వోయు; ముక్తాశేషలు=ముత్యాలసేసలు, వెంచ=మడుఁగు; పాఁగు= (తమిళపదము) రహస్యము, వృత్తాంతము; భజనకేళ్ళు ;=స్తుతికేళ్ళు ;

పరిణయించి=పెండ్లాడి; నెలగ=ధనము; వెట్టము=విరోధి; వితండము=విరోధము; పరిమాళించుట; (పరిఘూళించుట అని బ్రౌనుపాఠము)=మల్లవిద్యాక్రియావిశేషము; పయ్యంది=కొలిమి; ఇట్టియపూర్వపదప్రయోగమున నీకవియొక్క ప్రత్యేకత స్పష్టపడుచున్నది.

వ్యాకరణము:— వ్యాకరణము విషయమయి యారయఁ గ్త్వార్థకమునకు వికల్పసంధియును, నావుడు, మున్నగు నానంతర్యార్థకములసంధియు, నచ్చటచ్చటఁ గలవు. క్త్వార్థకేకారసంధివిషయమున నీతనితోపాటు పెక్కండ్రు కవులుగలరు. కాని యానంతర్యార్థక మగు-డుక్ (౬.౬౩;౫.౧౧౫)తోఁ (ప్రాచీనకవితయందు 'డు' వర్ణకము భావార్థకము. సముచ్చయసహితమయి యానంతర్యార్థము నిచ్చును. అనుటయున్ వంటిది). పరపదాచ్చునకు సంధిచేసిన కవులుకానరారు. ఈవిషయమున నితఁడు యథేచ్ఛముగా వర్తించెను. ఇట్టి నెఱసులు వెదకుట రసాస్వాదనమున కడ్డమేకాని వాస్తవము తెల్పవలసివచ్చినప్పుడు మఱుఁగుపెట్టుట ధర్మము కాదు. ఇట్టిస్వల్పప్రమాదము లున్నమాత్రమున నీతని కవితకు నాలేశములు కళంకదాయులు కానేరవు.

ఇఁక నీకవి సంస్కృతశబ్దములయెడ జాగరూకతతో మెలంగినవాఁడే కాని ప్రమత్తుఁడు కాఁడు. ఎచ్చటనేని యొకటిరెం డున్నను బ్రమాద మనుకొన నగునే కాని మఱొండు కానేరదు. "ఏకోనవింశతిమ" ౫-౨. "షడ్వింశతితమ"౧౦-౩౧. ఇట్టి వొకటిరెండున్నను నవి పొరపాటులు కాని యజ్ఞానమునఁ బ్రయోగించిన వనుట యన్యాయము. సంస్కృతపాండితీస్ఫోరకము లగుప్రయోగము లనేకము లిందుఁ గలవు. కాని గ్రంథవిస్తరభీతి నుదాహరింపఁబడ లేదు.

కవి, కాలనిర్ణయము:— గోపరాజను నీతఁడు నియోగిబ్రాహ్మణుఁ డనియును, ఇంటిపేరు కొనెలవారనియును బదునేడవశతాబ్ద

ములోనివాఁ డనియుఁ గవులచరిత్రమున నున్నది. ఈతని కేడవపురుషుఁడు పెన్నయామాత్యుఁడు. పెన్నయామాత్యుఁ డనియు నందుఁ గలదు, కాని, పెన్నయామాత్యుఁ డనుట ప్రమాదము. వెలనాఁటి చోడుల దాక్షారామశాసనములందును పెన్నయామాత్యుఁ డనియే యున్నది. ఇంకఁ గోవెలవా రనుటయు నట్టిదే. ఈకవి తాతతండ్రులు నాఁడు పల్లెకొండను బరిపాలించుచున్న 'రాణామల్లనృపాలుని' 'రాణన్' అని పదచ్ఛేదముచేసి యెవరో మల్లనృపాలుఁ డని స్థానముగాఁ గవులచరిత్రము వ్రాసినది.

'కొఱవియన్నామాత్యకుంజరుండు'

కొఱవియన్నయయెప్రభుఁడు!'

మున్నగు ముప్పదియిద్దఱమంత్రుల చరిత్రమునందలి ప్రయోగముల వలనను, చెన్నపురిప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునందలి తాళపత్ర ప్రతియందలి యాశ్వాసాంతగద్యమువలనను, 'కొఱవి'వారే కాని కోవెలవారు కారని తెలియుచున్నది. (శబ్దరత్నాకరకారుఁడు కొంచె మీఁదివా రనియెను) ఏదియేని లేఖకప్రమాదమున, కోవెలవా రని యున్న తాళపత్రప్రతి యాధారమునఁ గవులచరిత్రమున న[illegible]-యుండును. ఈగోపరాజున కేడవపురుషుఁ డగు పెన్నామాత్యుఁడు వెలనాఁటిపృథ్వీశ్వరుని రాజ్యభారధురంధరుఁ డనియు, నవ్రక విక్రమశాలి యనియు ననదవోలు (చందవోలు) నెలవుగాఁ గలవాఁ డనియుఁ బ్రథమాశ్వాసమున ౪౧ వ పద్యమున వర్ణింపఁబడినది. "కలుషమండలిక"..... ఇత్యాది.

ఇందలి బిరుదములు వెలనాఁటిపృథివీశ్వరునివి కావు. వెలనాఁటి పృథివీశ్వర రాజ్యభారధుర్యుఁ డనునది యీ బిరుదావళిలో నొకటి యని యాశ్వాసాంత గద్యమునందలి 'వెలనాఁటిపృథివీశ్వర రాజ్యా

ముద్ధరణ' అనునది చెప్పుచున్నది. కావున నీ వెలనాటి పృథ్వీశ్వరుని కాలమునుబట్టి పెన్నయ కాలము నిర్ణయింపనగును.

శైవమతాచార్యుఁ డగుపండితారాధ్యుని కాలనిర్ణయమునకై శివతత్త్వ సారపీఠికయందుఁ గొమర్రాజు వేంకటలక్ష్మణరావుగారు పై వెలనాటిపృథివీశ్వరునికాలము నిట్లు నిర్ణయించినారు. పండితుఁడు, చందవోలు వెళ్లినప్పటికి వెలనాటిచోడుఁడు పాలించుచున్నాఁ డనియును, నాతనికి మనుమఁడు పృథివీశ్వరుఁ డనియుఁ, జోడునికాలము క్రీ. శ. ౧౧౧౩సం. మొదలు ౧౧౪౦సం. వఱకు ననియు వివరించిరి. 'పృథ్వీశ్వరుఁడు ౧౧౮౦కి వఱకే రాజ్యమునకు వచ్చినట్లు తోఁచుచున్నది' అని మఱొకవాక్యము. ౧౧౮౦కి నాఁటికే యని యర్థము కావలయును. పన్నామాత్యుఁడు పృథ్వీశ్వరునితండ్రి యగు గొంకరాజు నాఁడే మంత్రి యయ్యెను. గొంకరాజు బహుస్వల్పకాలముననే మరణింప బాలుఁ డగుపృథ్వీశ్వరునిఁ బెంచి పెద్దవానిని జేసి రాజ్య మభివృద్ధిలోనికిఁ దెచ్చియుండవలెను. అప్పుడే పృథ్వీశ్వరరాజ్యసముద్ధరణ విషయము సార్థకము కాఁగలదు.

పన్నామాత్యుఁడు గొంకనృపాలునిమంత్రిగా నున్న ట్లీక్రింది చోడరాజుల ద్రాక్షారామశాసనములవలనఁ దెలియవగును.

Vol. IV No. 1204- "(స్వస్తి) శ్రీ వెలనాంటిచోడమంత్రిసత్తే సద్గుణాన్వితమండలేశ (శ్రీగొం)కమహీపతి..." No. 1205... స్తం(శ్రీ)శిఖామణి భక్తిక ధీః శ్రీ పెన్న(నామాత్యు)ధీః"...అని యుండుటవలన నాగొంకనృపాలుని కాలముననే మంత్రిత్వము వహించి, యాతనినిమ్మటఁ బృథ్వీశ్వరుని రాజ్యమును సంరక్షించియుండును. గొంకనృపాలునినాఁటికి పెన్నయ్యయును యువకుండై యుండును. పృథ్వీశ్వరుని కాలమునందును బాలభాగ ముండి యుండును. కాన

౧౨౪౦ దాఁక వెన్నామాత్యునికాలము; అధమపక్షము ౧౨౨౦ దాఁక నేనియు నై యుండును. ఈవెన్నయ్యకుఁ బౌత్రుఁడు, అమరేశ్వరుఁ డని యే గాని పుత్రుఁడెవ్వఁడో యీగ్రంథమునఁ గవి చెప్పలేదు. ఆతఁడు శైశవమున మరణించెనో లేక యప్రసిద్ధుఁడై యుండెనో కారణ మూహింపఁజాలము. మనుమఁ డగునమరేశ్వరునకు, అన్నయ, సింగయ యనునిద్దఱు కుమారులు. ఇందలియన్నయ ముప్పదియిద్దఱమంత్రుల చరిత్రమున వర్ణింపఁబడియున్నాఁడు.

సీ. ఘనదానకర్ణుఁడై గండపెండెము దాల్చెఁ
గొఱవియన్నామాత్యకుంజరుండు

క. హరి సిరిని వలచు సిరియును
వరుసఁగ హరిఁగోరుఁ గొఱవియన్నయయెపుడున్
వరకీర్తిసతినివలచును
వరుసన్ వరకీర్తి యతని వలచు సతతమున్.

మున్నుగుపద్యములం బట్టి యీయన్నయమంత్రి మహాదాతయైన ట్లున్నది. అట్లున్నను గవి తననాఁటికి దూర మగుట యుఁదాను, అన్నయ్యతమ్ముఁ డగుసింగయశాఖలోనివాఁ డగుటయుఁ గాఁబోలు నాతనిని గూర్చి, యీకావ్యమున విశేషముగాఁ బ్రశంసింపలేదు. కాని యాతనిపుత్రుఁ డగు పెద్దిరాజునుగూర్చి పల్లెకొండ జనపాలుఁ డగు మల్లనదేవరాజుచేఁ గుంచెలు, నందలములు. నెల్లియుఁ గైకొన్నవాఁ డని ప్రశంసించెను. గోపరాజున కీతఁడు పెద్దముత్తాత.

ఇఁకఁ దనముత్తాత యగుసింగయను గూర్చి విశేషించి చెప్పలేదు. ఈసింగనకు అబ్బయ, గోపయ, సత్తెనారన, యనుముగ్గురు కొడుకులు గల రనియుఁ, దనతాత యగుగోపరాజునకు నన్న యగు అబ్బయకొమాళ్లు రామరాజు, కేసన, బాచిరాజు – అనువారలు

ముగ్గురును – అనపోతకుమారసింగయకు మంత్రులుగా నుండిరనియుఁ జెప్పెను. (చూ. ౧–౪౮) వెన్నామాత్యునికి నాఁజవతరములోనివా రగుటచే వీరు ముగ్గురును నించుమించుగా ౧౪౦౦ దాఁక నుండి యుందురు.

వెన్నయ... ... ... ...౧౨౨౦ దాఁకను

ఆపై ౨౦ ఏండ్లే యతనిపుత్రునికాలము చూచుకొన్నను ౧౨౫౦ దాఁకను,

తరువాతఁ బౌత్రుఁ డగు నమ శేశ్వరునికాలము– ౧౨౭౦ దాఁకను,

నాల్గవతరములోని యన్నయసింగయలకాలము– ౧౩౨౦ దాఁకను,

అయిదవ తరమగు పెద్దిరాజు, అబ్బయ, గోపనార్యుఁడు, సత్యనారనయు– ౧౩౬౦ దాఁకను,

ఉండియుందురు. ఇందలిపెద్దిరాజు కొడుకు లగు రామరాజు, కేసన, బాచిరాజులు ౧౩౬౦ మొదలు ౧౪౦౦ దాఁక నుందు రనుటకు సందియము లేదుగదా! ఏకశిలానగరాధిపతి యగు రేచర్ల సింగమ నాయని పుత్రుఁడు 'అనపోతనాయఁ డనియు, నతనిపుత్రుఁడు రెండవసింగమ నాయఁడు (౧౩౭౦–౧౪౦౦) దాఁక నున్నాఁడనియు నాంధ్రవాఙ్మయ సంగ్రహకారునిసిద్ధాంతము! ఈయనపోతసింగయకే రామరాజాదులు మంత్రులైయుందు రని సమకాలికత్వమును బట్టి నిశ్చయించుట సుసాధము.

ఆకాసురాజాపింగను సమాసతినములోనివాఁడగుకేసువరాజును నించు మించుగా ౧౪౨౦ సంవత్సరముల ప్రాంతములోనివాఁడు కావలసివచ్చును. (ఈకేసువరాజు మనకవికేందు్రడియనియు 'రాజామన్నన కేంద్రమనకుంబరమగురుడై శైవాచారప్రథమసింహాసనాసీనుడై నబ్రహ్మదేవరయొషయుల కూఁతుఁ గామాంబికయను కామినీరత్నంబుఁ బరిగ్రహించి వేగుగల్లునివాసియై యుండె ననియు నిందుఁజెప్పఁబడియె).

కావున నీకవి ౧౪౬౦ దాఁటియే జీవించియున్నాఁ డనవచ్చును. ఏమనఁ బూర్వకవిస్తుతియందు, 'అనఘు హుళక్కిభాస్కరు మహామతిఁ బిల్లలమఱ్ఱి వీరరా'జును......అనుటవలనఁ బిల్లలమఱ్ఱి వీరభద్రునికిఁ దరువాతివాఁ డని యనుమానము కల్గవచ్చును. కాని సమకాలికుఁ డనినను సరిపడును. క్రీ. శ. ౧౪౮౦ లోని వెన్నెలకంటి మాత్యుని కేడవతరమువాఁ డగునీగోపరాజు ౧౪౬౦ ప్రాంతమువాఁ డగు నుండ వచ్చును గదా! ఒకతరమున హెచ్చినను, నొకతరమునఁ దగ్గి నను దరమునకు ౪౦ సంవత్సరముల చొప్పునఁ గదా చరిత్రకారులు కాలనిర్ణయముచేయుచున్నారు. కావునఁ బిల్లలమఱ్ఱి వీరనకు సమకాలికుఁడు కావుట నిశ్చయ మనవచ్చును. ఇఁకఁ, గవులచరిత్రములోని పదియేడవశతాబ్ది మనుసిద్ధాంతము స్థూలదృష్టితోఁ జేసినదేమో యని పించుచున్నది. రామామల్లనగూర్చియును, వెన్నెలమాత్యుని గూర్చియు, వ్రాసినట్లే యీకాలనిర్ణయమును, నట్లే యంబఁ జేయంబడినది.

ఈతఁడు ప్రసంగవశమున నాల్గవయాశ్వాసములోఁ జెప్పిన ఛందస్సందర్భమునఁ బదుమూఁడువళ్లు తెల్పినాఁడు. భీమునకాలము నాఁటికిఁ బదియే కలవు; అనంతునినాఁటి కిరువదియైనవి. ఈతఁడు భీమనపద్యభాగములనే వాఁడినాఁడు. ఇదియు నాలోచింపవలసినదే.

నవమాశ్వాసమున 69 వ పుటలో ౧౦౫ వ పద్యముతరువాత రెండు పద్యము లర్థముకానివి కలవు. ఈరెండుపద్యములకు రెండువిధము లగుపాఠములు దొరకినవి. వాని నీక్రింద వ్రాయుచున్నాఁడను. ఎచ్చట నైన సరియైన పాఠముదొరకినయెడఁ బ్రచురించి యీకొఱంత దీర్తురుగాక యని విద్వల్లోకమును గోరుచున్నాఁడను.

ఆ. తొలుపుతెరములు మెయిపులు వంకమోళ్లు
తిలలు జివ్వడీలు తీపివేళ్లు
లెక్కములుచమనుచు లిక్కొట్టిపుడుకుచు
గొందినిడక తెంపు లెందుఁగలవు.

క. పుడమిగులలోఁ బుట్టముగా
నడవలు గ్రామములు తన్పులు నాదంబులు సం
గడపుగ నెరయఁగఁ బాలే
ర్పడ...అయ్యె లిట్టి వడనివి నిలిపెన్.

అనికొన్ని ప్రతులు. వీని కేపాఠాంతరము లిట్లు గలవు.

ఆ. తెలుపు విరము మేరుపులు వంకమోగలు
తొలలు జప్పటీలు తీసివేళ్లు
లెక్క మలుచమునుచు దిక్కోటి యుగసుచు
గొంది నిడక కేంపు లెంకగన్నె.

క. పుడమిపులలోఁ జిట్టముగా
నసవలుగామములు నాతంబులు నం
గడుపు నెఱుంగం బా
లేన్నస నస్ని గంవద్యో వృష్ని సాషనివిస్నే.

వేఱొకప్రాఁతప్రతిలో—

ఆ. తెలుపుపుతిసమునుపంక మోగలుపరపులు
తెళ్లలును చప్పటాలును తీసివేళ్లు
లెక్కమలుచ స్సునుమను దాపెన్నపుణుగు
గొందపువిసువక వేగెంపు లెంకనుగొన్న.

క. పుడమిగులలో బుట్టముగా
నడవలు గామములు దన్పులు నాంతంబులుసం
గడము నెరయంగ బాకీ
గ్పడ సిద్ధికయయ్యె విద్య వడసివినిలిపెన్.

ఈపద్యము లెవ్వరును నేనిఘంటువునను వాడినయు నుండ లేదు.

కృతిసమర్పణము:— ఈకవిశిఖామణి తనకావ్యమునకు శివకేశవుల నుభయులను గృతిపతులనొనర్చినాఁడు. తిక్కనసోమయాజి నాచనసోమనలవలె హరిహరులనుభయులను సమానభక్తితో సేవించినయద్వైతి. అందునను 'తథాపిభక్తి స్తరుణేందుశేఖరే' అనినట్లు కొంతశివస్తుతితో నారంభించినాఁడు. మఱియు నాశ్వాసాంతపద్యములం దొకపద్యము హరసంబోధనములతోను, నొకటి హరిసంబోధనములతోను, వేఱొకటి హరిహరసంబోధనములతోను ముగించుచు వచ్చెను.

భోజుఁడు సింహాసన మెక్కుటకై ముప్పదిరెండుమాఱులువచ్చినప్పుడును హరినో హరునో ధ్యానించుచు వచ్చినట్లు ప్రతికథమొదటను ద్వితీయాంతములతో లలితమగునచ్చ తెలుఁగుపదములతో నొక్కొక్క పద్యము నెలకొల్పెను.

హరిహరులను సమానముగా ధ్యానించుట తిక్కన కవీంద్రుని మార్గమేయయ్యెను, భిన్నభిన్నముగా వర్ణించి హరిహరుల నైక్యమొనర్చి ముగించుచు వచ్చురీతి నాచనసోమనార్యుని యుత్తరహరివంశద్వితీయాశ్వాసమునందలి హరిహరస్తవమును స్మరణమునకుఁ దేకమానదు. కథలయందు సందర్భానుసారముగా అంబికను, సూర్యునిగూడ సరసముగా స్తుతించియున్నాఁడు. కేవలము భక్తితత్పరుఁడై శివకేశవాత్మక మగుభగవంతునే కృతిపతి నొనర్చి యీకవి తాను ధన్యుఁడగుటయే కాక లోకమునుగూడ ధన్య మొనర్చిన మహానుభావుఁడు. మఱియు నాశివకేశవుల వర్ణించుపట్ల మృదువైన వ్యంగ్యముతో భావనాపటిష్ఠత వెల్లడించెను. అదియే కదా కావ్యమునకు జీవము! చూడుఁడు.

చ. పులుఁగుల పెద్దవారువము పోటరిబిడ్డఁడు ఱాఁగకాఁడు పా
ములగమికాఁడు సెజ్జ నలుమోముల వాఁ డిలుదీపు ప్పట్టి వే
ల్పులు బలుబంటు లౌకమలపొల్తుక తెల్లనితల్లి పెద్దకో
డలనుచు నెల్లవారుఁ బొగడం దగునల్లని వేల్పుఁ గొల్చెదన్. ౧.

క. వెలిపట్టును బలితోలును
మలయజమును బూదిపూఁత మణులుఁ ఫణులుఁ
దిలకము నెఱిగన్నుంగల
వెలఁదియు మగవాఁడు నైన వేల్పుం దలఁతున్. ౭.౧౧౫

ఇఁక విక్రమార్కచరిత్రమును రచించినజక్కనకవి యీతనిని గాని యీగోపరాజు జక్కనను గాని స్మరియింపకపోవుటవలన నొకరి గ్రంథము లొకరెఱుఁగరని యనుకొనవలసి యున్నది. జక్కన ౧౪౧౦-౨౦ సం. లలో విక్రమార్కచరిత్రము రచియించినాఁ డని కవులచరిత్రము తెల్పుచున్నది. జక్కన యీకవికంటెఁ గొలఁదిపాటి ముందు కాలమువాఁడే కావలెను. ఆతనికంటె మిన్నగాఁ జెప్పఁ దలంచినట్లును నింపఁ గానరాదు. కవిత్వతారతమ్యములు చూచిన యెడల నీకవి జక్కనకుఁ గొంచెపాటి వెనుకవాఁడే యగును. ఆతనివలె నిమిడికగఁ జెప్పఁగలకవి యరుదు. ఆకవిత్వమునుం దీకావ్యము కొంచెము వన్నె తగ్గి యిమిడిక లేనట్లుండకమానను. అంతమాత్రమున నియ్యది గౌరవపాత్రము కాకపోవదు—మలిచిన రత్నములహార మొకటి, విరిసిన మల్లెపూవులదండ యొకటి. దానితేజస్సు, దీనిపరిమళమును మనోహరములే! సహజమైన శైలితో లలితము లగు జాతీయములతో మనోహరము లగువర్ణనలతో నీకావ్యము ప్రాచీనకావ్యములలోఁ బ్రశస్తి గాంచి మించినదే. జక్కనగోపరాజుల కవితాశైలుల భేదము వివరింపఁ బూనినచో గ్రంథవిస్తర మగు నని విరమించుచున్నాను. అయ్యది ప్రత్యేక మొకవ్యాసముగా వ్రాసి ముందుప్రకటింతును.

వెంపరాల సూర్యనారాయణశాస్త్రి.

---

# విజ్ఞాపనము



పాఠకమహాశయులారా! [illegible] సింహాసనద్వాత్రింశిక ప్రథమభాగము (మొదటియైదాశ్వాసములు) పూర్తియైనది. ఇప్పటికిఁ బండ్రెండాశ్వాసములును సమగ్రముగాఁ బ్రకటింపఁగలిగితిమి. అనేకప్రతు లుపలబ్ధములైనను [illegible] సాధారణ్యమును వహించినవి. సందేహము లన్నిటిలో సందేహాస్పదము లైనవి. అనర్థకపాఠభేదములు మెండుగాఁ గలవు. అన్నిటిని జూచి యవసరమైన పాఠములను, భేదములను మూలమునను పుటలక్రిందనను జేర్చినారము. సందర్భశూన్యమైనవానిని బొత్తిగా విడిచిపెట్టితిమి. కొన్ని చెప్పవలసిన ముఖ్యవిషయములు రెండవభాగము మొదటఁ జెప్పియున్నాము. కావున విశేషించి యిచట మరలఁ జెప్పలేదు.

ఈగ్రంథమును మేము ప్రచురించుటలో సాయపడిన [illegible] పండితులకును దమవ్రాతప్రతి నెరవిచ్చిన మ.రా.శ్రీ పోతాప్రగడ బ్రహ్మానందరావుపంతులుగారికిని సమగ్ర గ్రంథమునకు యథామతిం టీకను రచియించి యొసంగిన బ్ర. వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారికిని నేమెంతయుం గృతజ్ఞులమై వందనశతంబు లర్పించుచున్నారము.

ఇట్లు,

ఆంధ్రసాహిత్యపరిషత్కార్యదర్శులు.

శ్రీరస్తు.

# సింహాసన ద్వాత్రింశిక.*

(ప్రథమభాగము)

## ప్రథమాశ్వాసము.

---

### కృత్యాది, దేవతాస్తోత్రాదికము

శా. శ్రీమత్పర్వతనందనా[1]తనులతాశ్లిష్టాంగ మై బాహుశా
ఖామధ్యంబున నున్న పన్నగఫణౌఘం బాకు లై యొప్ప ను
ద్దామం బౌ శశికాంతి పుష్పరుచి నొందంగా జటాపల్లవ
స్తోమం బౌ హరపారిజాతము నుతింతు[2] న్వాక్ఫలావాప్తికిన్. ౧

చ. పులుఁగులపెద్ద వాహనము, పోటరి బిడ్డఁడు, తాఁగరౌతు♦, పా
ములగమికాఁడు సెజ్జ, నలుమోములవాఁ డిలుతీర్చుపట్టి, వే
ల్పులు బలుబంటు, లోకమల[3] పొల్తుక, తెల్లనితల్లి పెద్దకో
డ లనుచు నెల్లవారుఁ బొగడం దగు నల్లనివేల్పుఁ గొల్చెదన్. ౨

ఉ. దక్షిణనేత్రకాంతి నుచితంబుగ నర్ధవికాస మొంది వా
మాక్షిరుచిప్రసారమున నర్ధము విప్పకయున్న పుండరీ
కాక్షుని నాభిపద్మనిలయంబునఁ దుమ్మెదభంగి లోలుఁడై
యక్షయవేదనాదమయుఁ డైన విరించిఁ దలంచి మ్రొక్కెదన్. ౩

ఉ. కట్టినపుట్టముం దనువు గద్దియ తమ్మియు నక్షమాలయుం
బట్టినచిల్కయు న్నగవుఁ బాపటజల్లియు నొక్కవన్నెగాఁ
బుట్టుచుఁ బుట్టువిద్యలకుఁ బట్టినయి ల్లనఁజెల్లి బ్రహ్మవా
కట్టొనరించి తన్ముఖవికాసినియౌ సతి మమ్ముఁ గావుతన్. ౪

---

* సింహాసనద్వాత్రింశతియనియుం గలదు 1. నందినీ. 2. భజింతున్. ♦ రాగెరౌతు, రాగకౌతు. 3. లక్కలిమిపొల్తుక.

ఉ. నిద్దము లైన భూషణమణిప్రకరద్యుతు లన్నిదిక్కులన్
దొడ్డలువుచ్చి తల్లిచనుదోయిసరిం[1] దలకట్టు మించఁగా
ముద్దులు సూపుచుం బసిఁడిముద్దగతిం దొడమీఁదనాడు నా
ముద్దుగణేశునిం దలఁచి మ్రొక్కెద నీకృతికార్యసిద్ధికిన్. ౫

క. రుణ్మదపరివృఢసురగణ
తృణ్మోచను సురశరణ్యు ధృతశక్తిఁ ఫణి
ద్విణ్మయవాహను, [2]హరినిభు
షణ్ముఖు నభిముఖునిగాఁ[3] బ్రశంసింతుమదిన్. ౬

క. ప్రవిమలుఁ డని గ్రహరా జని
కవితాప్రియుఁ డని జగత్ప్రకాశకుఁ డనియున్
భువి విక్రమార్కనృపసం
భవకారణుఁ డనియు[4] లోకబాంధవుఁ దలఁతున్. ౭

క. పులుఁగునకై యెవ్వనిమది
నొలికినశోకము లకారయుతమై కవితా
కలనకుఁ దెరు వయ్యెఁ దలం
పుల నాతని గొల్తుఁ బుట్టఁ బుట్టిన సుకవిన్. ౮

ఉ. శ్రీనిలయంబునాఁగ మురజిద్గుణరత్ననివాస మై యుపా
ఖ్యానతరంగిణీభరిత మై కడగానఁగరాని భారతా
ఖ్యానపయోధిలోనఁ గల మై నిజయుక్తి భజింపఁ గన్నధా
రానుకృతిం గృతార్థత మహాఘనుఁ డౌ మునిఁ బ్రస్తుతించెదన్. ౯

క. ఆభారతపర్వత్రయ
మీభారతవర్ష మెల్ల నెఱుఁగఁ దెనుఁగునన్
శ్రీభారతిగతిఁ జెప్పిన
నాభావుకమును[5] దలంతు నన్నయభట్టున్. ౧౦

1. నద్రిం. 2. హరిక్రియు, హరిప్రియు, హరిశిఖుఁడు. 3. నతిసుముఖుఁగా. 4. కారణ మనియు. 5. నా భరతుండని, నాభావకుఁడని.

క. లేముల వాడక శుచిమై
[1]లేములవాడం జరించు లేములవాడం
దా మెఱసిన భీముని నుత
భీముని బలభీము విమతభీమునిఁ దలఁతున్. ౧౧

చ. అనఘు పాల్కురికి భాస్కరు, మహామతిఁ బిల్లలమఱ్ఱి వీరరా
జును, ఘను నాగరాజుఁ, గవిసోమునిఁ దిక్కనసోమయాజిఁ, గే
తనకవి, రంగనాథు, నుచితజ్ఞుని నెఱ్ఱన, నాచిరాజుసో
మన; నమరేశ్వరుం, దలఁతు మత్కులచంద్రుల సత్కవీంద్రులన్. ౧౨

వ. అని యిట్లు సకలవరప్రదానకారణదేవతలను జతురహృద్యానవద్యగద్య పద్యవిద్యావిద్యోతితు లయిన కవీశ్వరులనుం బ్రశంసించి తత్ప్రసాదాసాదితసహజసాహిత్యతరంగితాంతరంగుండనై సకలజనసాధారణం బగు నట్టిట్లని విన్నవించెద.[2] ౧౩

ఉ. ఆదరణంబు లేక చెడనాడిన బాణమయూరకాళిదా
సాదులకైనఁ దప్పు గల దన్యుల కేమని చెప్పవీనితో
నేదియుఁ గాదు పొమ్మనక యిందులచంద మెఱింగి తప్పినం
గా దని తీర్చి యొప్పు గని కైకొని మెత్తురు గాక సత్కవుల్. ౧౪

ఉ. [3]మానుగఁ దప్పులున్న ననుమానము సేయక మోదమానస
న్మానసులైనవారు పలుమాఱు పరీక్ష [4]లొనర్చి తీర్చినన్
హీనకవిత్వమైన మెఱుఁ గెక్కదె నేర్పరులైనవారిచే[5]
సానలఁబట్టి తీర్చినను సన్నపురత్నము వన్నెకెక్కదే. ౧౫

ఉ. భావరసానుకూలమృదుపాకపదార్థసమృద్ధి లోకసం
భావన నొప్పుకావ్యముల మర్మము[6] గానఁగ లేక మర్మతుల్
కా వనఁ గాని యెట్టికడఁ గట్టడిఁ జెప్పఁగనేర, రెల్లెడం
ద్రోవన కాక కుక్కలకు దొంతులు వేర్వఁగ నేర్పు గల్గునే. ౧౬

1. వే, లే, యని రెండుప్రతుల రెండురీతులు (వేమలవాడ, లేములవాడ). 2. వితర్కించెద, వినిపించెద. 3. మానము దప్పులేక. 4. లొనర్చిరేనియున్. 5. నేర్పరులైనవోజులై. 6. పద్ధతి.

చ. చులుకని పద్యమైనఁ గడుఁ జోద్యము చేయుచుఁ జిన్నవానిఁ బె
ద్దలు గొనియాడఁగాను విని తప్పులుపట్టఁదలంతు రక్షముల్
బిలిబిలి మాటలాడఁ దనుఁ బెంచినవానికి ముద్దుగాక యా
పలికెడు చిల్కపిల్లఁ గని బావురుఁబిల్లులు[1] సంతసిల్లునే. ౧౭

ఉ. భీమనపద్య మన్నఁ గడుఁబ్రీతి వహించుచు మేలుమేలు నా
నే మిది చెప్పినార మన నిక్కమె ప్రాసము గూర్చినాఁడ వా
నే మిది కాదు దీనివడి కిక్కడి కర్థ మిదెట్టి దీగణం
బే మని పెట్టినాఁడ వని యొగ్గులువట్టుఁ గుబుద్ధి పెన్గలన్. ౧౮

క. వివరికి వివరించిన కృతి
చవిపాలం బంచదార సరి గూర్చుట[2] యా
యవివేకికి వినిపించిన
కవిత వఱుతఁ జింతపండు గలుపుట చుమ్మీ. ౧౯

ఉ. పూనినరీతి వానితలఁపు ల్వాడిఁ బ్రాసములుం జలంబునం
బానగిలంగ నీడ్చి యొకపద్యముఁ గూర్పఁగవచ్చుఁగాక యా
ఖ్యానకథానుకూలముగఁ గావ్యము జెప్ప వశంబె సన్నమై
కానఁగ జల్లి నేయునది కట్టెడుపుట్టము నేయనేర్చునే. ౨౦

క. ఉర్విఁ గలశబ్దజాలము
నిర్వచనస్థితుల నెఱిఁగి నేర్పున విద్యా
నిర్వాహకుఁ డనజెల్లెడు
సర్వజ్ఞుఁడు గానివాఁడు సత్కవి యగునే. ౨౧

క. ఎప్పటి కేయది ప్రస్తుత
మప్పటి కావిద్య మహిమ[3] మచ్చుపడంగాఁ
జెప్పక సర్వజ్ఞత్వము
చొప్పడునే కావ్య మంత సులభమె ధాత్రిన్. ౨౨

1. బావురుఁబిల్లులు. 2. గూర్చుమనా. 3. మర్మమచ్చు.... జెప్పెడు.

క. దుర్వాదము గాకుండ న
పూర్వపుఁగృతిఁ జెప్పుసుకవిపుంగవునకుఁ దా
సర్వజ్ఞుఁడ నని మాటల
గర్వింపఁగనేల తొడవు గానంబడఁగన్. ౨౩

క. చనుఁ "గవివైభవవిద్యా"
యని చదువుటఁ గావ్య మధిక మదియును నల్లి
ల్లును గుడియుఁ జెఱువు నిధియును
వనము సుతుఁడు సంతతులుభవస్థితిగతికిన్. ౨౪

క. ఎవ్వరు కృతు లొనరింపుదు
రెవ్వరు కృతిలోన వినుతి కెక్కుదు రారుచే
నవ్విమల[1] కీర్తి సంతతు
లివ్వసుమతిఁ జెడక నిలుచు నినకల్పముగన్. ౨౫

క. సుగుణులు "బాణోచ్ఛిష్టం
జగత్రయ"మ్మనఁగఁ గొంత చదువఁగఁ బ్రియమే
తగఁ దోడంటిన[2] పాలిం
పుగఁ బెరుఁ గయియున్న నది యభోజ్యంబగునే. ౨౬

క. సంబంధము లగురసభా
వంబులు మునుకంటె నభినవంబులు గాఁ వే
యంబుధిని కాక బహు ర
త్నంబులు వర్తకుల కేమి తాఁ బండినవే. ౨౭

క. తల్లి యగు వాణికరుణం
దొల్లిటికవు లధికు లనఁగఁ దోఁచిరి పిదపన్
బల్లిదు లిప్పటిసుకవులు
తల్లికిఁ గడగొట్టు[3] కొడుకు దాఁ బ్రియమగుటన్. ౨౮

1. నవ్విభుల. 2. తోడంటునఁటా. 3. గడపుట్టు.

క. ఏజనులకైన సద్గుణ
యోజితులై భావ మెఱిఁగి యుచితార్థకళా
రాజితు లగు కవిరాజుల
రాజులు చేపట్టరేని రాజ్యము గాదే. ౨౯

క. సరసులు చేపట్టినచో
విరసం బగుకావ్య మైన వినిపించిన నా
దరణీయం బయి వెలయదె
ధరఁ బువ్వులఁ దాల్చి తుంగ[1]తలకెక్కు గతిన్. 30

క. అప్పరమేశ్వరు కరుణం
గుప్పలు గొను విక్రమార్కు గుణముల కొఱకై
చెప్పెద రసభావంబులు
ముప్పిరిగొనునట్లు కథలు ముప్పదిరెండున్. 3౧

చ. తెనుఁగున దేటగాఁ గథలు దెల్పినఁ గావ్యము పొందు లేదు మె
త్తన పస చాల దండ్రు విశదంబుగ సంస్కృతశబ్ద మూఁదఁ జె
ప్పిన నవి దర్భముండ్లనుచుఁ బెట్టరు వీనులఁ గావునన్ రుచుల్
దనరఁ దెనుంగు దేశియును దద్భవముం గలయంగఁ జెప్పెదన్. 3౨

క. పదిలముగ మృదులవచనా
స్పదపదసంపదల రసము పదనిడక మహా
పదముల నైనను జల్లులఁ
బొదుపెట్టిన దుడుకుఁగవిత[2]పొదలునె సభలన్. 33

గీ. తనవచోవిశేష మెనయక పూర్వక
థామితోక్తిఁ జెప్పు టేమికడిది
యొకఁడు గోలపట్టి యొయ్యనఁ గొనిపోవ,
నంధుఁ డెచటికైన నరుగుటరిదె. 3౪

1. వంకఁదుంగ. 2. దుండుకవిత.

ఉ. ఈసరసోక్తికావ్య మొకఁ డిమ్ముల సంస్కృతభాష నచ్చుగాఁ
జేసిన నట్లు వీఁడు మఱి చేయుట యేటిది యంచుఁ జెప్పఁగాఁ
జేసి యనాదరం బురక చేయకుఁడీ విలుకాఁడు తూఁటుగా
నేసిన నందె పాఱు మఱి యేసినవానిద సూటిగావునన్. 3౫

చ. తెలుఁగున కెల్లఁ దల్లి యగుఁ దెల్లము సంస్కృతభాష యందులోఁ
బలుకు లెఱుంగుచోఁ బదవిభాగము నన్వయ మర్థమంచు నీ
మలకలకంటె నందుల సమర్మము దేట తెనుంగ యొప్పు నా
కొలఁది ప్రియంబు గాదె చెఱకు ల్దినుకంటె రసంబు గ్రోలినన్. 3౬

క. పురమథుజలలీలాంబుధి
పరిణయనయనిప్రలంభపతిగుణసుతభా
స్కరచంద్రోదయరణగతి
గిరివనదూతర్తురతులఁ గృతి చెప్పదఁగున్. 3౭

క. కావునఁ బదునెనిమిది యగు
నీవర్ణన లచటనచట నించుక బెరయం
గావించెద నిటఁ బని కిని
రావనకుఁడు లక్షణాభిరామము లగుటన్[1]. 3౮

వ. అని విన్నవించి కృతకృత్యుండ నై సింహాసనద్వాత్రింశతి కథా
కథనమూలకారణం బైన యంబికారమణుండు ను [2]మత్కవితా
సంపత్తి సంధాయకుండగు లక్ష్మీనాయకుండును గావ్యనాయకు
లుగా నియమించుడం జేసి. 3౯

సీ. పాఁపపెండెముగాక పసిడియందియయును
నడుగుఁదామరలపై నమరువాఁడు
పెద్దమెకముతోలు నిద్దంపుఁబట్టును
మొలదిండుగాఁ గట్టి మురియువాఁడు

1. మొరయన్. మెరయన్. 2. ముక్తివితానసంపద్విధాయకుండు.

ఎముకపూసలును ముత్యములుఁ జేరులు గాఁగ
నక్కునఁ దాల్చి పెంపెక్కువాఁడు
పునుకయుం బెనుగుల్లయును గేలుదమ్ముల
నంచలమాడ్కిఁ బాటించువాఁడు
సగముపొడవునఁ దెల్పు నాసగము నల్పు
నయ్యు మెడ నొక్కవన్నియ యగుచు మేను
తెనయ ముక్కంటియును వెన్నుఁడును ననంగఁ
బొల్చు నావేల్పు కబ్బంబుఁ బ్రోచుఁగాత. ౪౦

## కవివంశావతారవర్ణనము

క. తత్పదపద్మారాధన
తత్పరులను రాజమంత్రిధర్మజ్ఞుల మా
సత్పురుషుల వినిపించెద
మత్పారంపర్య మొకక్రమంబునఁ దెలియన్. ౪౧

సీ. కలుషమండలికభేకఫణీంద్రుఁ డన రాయ
గజగంధవారణఖ్యాతి మెఱసి
వీరఘోట్టవిభాళుఁ డారూఢబిరుదవి
రోధి కళింగనిరోధి యనఁగ
వెలసి నానాఁటికి వెలనాఁటి పృథివీశ్వ
రుని రాజ్యభారధుర్యుం డనంగ
నారెలు గన్నిడీ లఱవలుఁ దెలుఁగులుఁ
దనబిరుదందియఁ దగిలికొలువ
నెగడి ననదప్రోలు[1] నెలవుగా భూసుర
వంశసాగరామృతాంశుమూర్తి
చక్రవర్తిమాన్యసౌజన్యధన్యుండు
విక్రమార్కవిభుఁడు వెన్నవిభుఁడు. ౪౨

1. నందప్రోలు.

ఉ. సాంద్రజవంబున,[1] స్మృతి, నిజస్థితి, నేర్పునఁ, బేర్మి, సత్యవృ
త్తిం, ద్రుతబాణ[2]పాతనిరతిం, గళల, న్సరివత్తు రెట్లు ప
క్షీంద్రుఁడుఁబన్నగేంద్రుఁడునగేంద్రుఁడుపేంద్రుఁడునింద్రుఁడున్ హరి
శ్చంద్రుఁడురామచంద్రుఁడునుజంద్రుఁడువెన్నయమంత్రిచంద్రుతోన్[3]

క. అమరఁగ వెన్నయమంత్రికి
సమితకళాకీర్తిపాత్రుఁ డగుపౌత్రుం డై
యమరేశ్వరమంత్రినిభుం
డమరేశ్వరమంత్రి వెలసె నార్యులు వొగడన్. ౪౪

క. [4]సంగతి నమరేశ్వరునకు
గంగాంబకుఁ బుట్టి రట్టి ఘను లన్నయయున్
సింగయమంత్రియుఁ దమలో
నంగీకృతరామలక్ష్మణాకారములన్. ౪౫

ఉ. అన్నయనామధేయసచివాగ్రణి పుత్త్రుఁడు పెద్దిరాజు సం
పన్నిధి [5]పల్లికొండజనపాలుఁడు మల్లనదేవరాజుచే
నెన్నఁగఁ గుంచె లందలము నెల్లియుఁ గైకొని మంత్రియై ప్రతా
పోన్నతి కెక్కె ధర్మముల నొప్పడు బ్రహ్మవనప్రతిష్ఠలన్. ౪౬

చ. అనఘులు సింగనార్యునకు నబ్బయ గోపయమంత్రి సత్తినా
రన యనఁ గల్గి రాత్మజులు రాములు మువ్వురు దోఁచినట్లు పెం
పున వెలయంగ నబ్బయకుఁ బుత్త్రులు పుట్టిరి రామరాజుఁ గే
సనయును బాచిరాజు గుణసాంద్రుఁడు సింగనయుం గ్రమంబునన్.

1. సాంద్రబలంబున. 2. దృఢబాణ. 3. చంద్రుకున్. 4. గంగాంబకుఁ బుట్టిరి భువి, సంగజసన్నిభులు ఘనులు అన్నయయు సింగయమంత్రియు. 5. వల్లకొండ గుణసంగుఁడు సింగనయుం బ్రియంబునన్.

క. ఘను లగ్రజులకు నీడై
వనములఁ గ్రతువులును గృతులు వడి నిల్పిరి బా
చనయును సింగనయును దగి
రనపోతకుమారసింగయకు మంత్రులనన్. ౪౮

క. రామాయణకృతికృతియై[1]
తా మెఱయుచు నంధ్రకవిపితామహుఁ డనఁగా
భూమిని మించినభీమన
నామంబునఁ బరఁగె సత్యనారన ఘనుఁడై.[2] ౪౯

ఉ. నారన కగ్రజుండు సుగుణజ్ఞుఁడు గంగమసింగమంత్రికిం
గూరిమిపట్టి నాఁ బరఁగు గోపయమంత్రి నిజానువృత్తిఁ జెం
పారెడు నెల్లమాంబిక కులాంగనగా నుతికెక్కెఁ దారతా
రాకుచికీర్తి యాకసపరాజుతనూజుఁడు దాఁబ్రసిద్ధుఁడై. ౫౦

వ. ఇట్లు గోపరాజతనూజుండైన కసవరాజు దానగుణ రాధేయుం డగు రాణామల్లనరేంద్రునకుఁ బరమగురుండై శైవాచారప్రథమసింహాసనాధీశ్వరులైన [3]బ్రహ్మదేవయొడయల కూఁతు, కామాంబిక యను కామినీరత్నంబుఁ బరిగ్రహించి సుగుణగణగణ్యుం డై నెగడె.

ఉ. స్థేయుఁడు మంత్రిలక్షణవిధేయుఁడు లాలితదానకేళి రా
ధేయుఁడు సర్వసజ్జనవిధేయుఁడు సంతతసత్యవాక్యకౌం
తేయుఁడు నిత్యకీర్తి సుదతీపరిణేయుఁడు భావశుద్ధి గాం
గేయుఁడు గాయకప్రకరగేయుఁ డమేయుఁ డజేయుఁ డున్నతిన్.

సీ. ప్రకటిత సరసవాక్పతి యనఁగాఁ జెల్లి
చతురాస్యుఁడై పద్మజన్ముఁ డనఁగ
నార్యానుకూలమహా కార్యంబు దీర్చుచు
సర్వజ్ఞుఁడై మహేశ్వరుఁ డనంగఁ

1. రామాయణకృతిపతియై. 2. కవియై. 3. బ్రహ్మదేవవడియలు.

గామాంబఁ దనపత్నిగా గారవించుచుఁ
బురుషోత్తముండయి హరియనంగ
గోపకుమారుండు కొడుకుగా నక్రూర
దృఢమిత్రుఁడై వాసుదేవుఁ డనఁగ
వేముగల్లు జన్మభూమిగాఁ బెరిఁగియు
[1]దీవులెల్ల మాటఁ దేటపఱిచి
హరిపదైకబుద్ధి హరితగోత్రాంబుధి
రా జనంగఁ గసవరాజు మించె. ౫౩

క. తంత్రముచేఁ గార్యను పర
తంత్రము గాకుండఁ బలిసితమొ చేయుమహా
మంత్రులలోపలఁ గసవయ
మంత్రి విచారమున దివిజమంత్రియుఁ బోలెన్. ౫౪

వ. ఇట్టి మంత్రిశిరోమణికి నునికిప ట్టగునట్టి పట్టనం బెట్టిదనిన. ౫౫

శా. రాణామల్లన కీర్తిచంద్రికలు పర్వం బొంగి మధ్యాశ్రిత
క్షోణీభృద్వనదుర్గమై గుణమణిస్తోమంబుల న్నిండి య[2]
క్షీణశ్రీపురుషోత్తమాశ్రయము నై చెల్వారి దానామృత
శ్రేణిం ద్యాగసముద్రనామము వహించె న్వేముగల్లిమహిన్. ౫౬

వ. అట్టి పురంబునందు. ౫౭

క. పూజితు లగుకవులకృపన్
భ్రాజిష్ణుఁడఁ గొంత [3]యాంధ్రభాషావిదుఁడన్
రాజనుతుఁ డైన కసవయ
రాజతనూభవుఁడ గోపరా జనువాఁడన్. ౫౮

శా. చిత్రఖ్యాతి [4]వితీర్ణివిక్రమనిధి శ్రీవిక్రమాదిత్య చా
రిత్రఖ్యాపనశాసనంబులకు భూరిస్తంభసంభారనై

1. మేటినృపులమాటగిటుపఱచి. 2. యీ క్షోణిన్ శ్రీపుర....శోభిల్లి. 3. యష్ట
భాషావిదుఁడన్. 4. వితీర్ణవిక్రమ.

ధాత్రీపాలురుఁ గావ్యవేదులును మోదం బంద సింహాసన
ద్వాత్రింశత్కథల స్గుణంబులుగఁ గావ్యం బొప్పఁగాఁ జెప్పెదన్.

వ. అది యెట్టిదనిన. ౬౦

—♦ కథాప్రారంభము ♦—

ఉ. సారబలప్రసార పరిశంసితవింశతి బాహుబాహు కే
యూరచిరత్నరత్న నికషోపలమా రజతాద్రిపై మనో
హారవిహారము ల్సలిపి యచ్చట నచ్చట విశ్రమించుచుం
జారువిచారుఁ గింకరవశంకరు శంకరు గౌరి యి ట్లనున్. ౬౧

క. చిత్తజహర మీవలనం
గ్రొత్తకథ ల్గలిగెనేని గోరి వినంగాఁ
జిత్తం బుత్తలపడియెడి
నిత్తఱినిం బ్రొద్దుపుత్త మొఱఁగింపఁగదే. ౬౨

క. నావుడు దేవుం డిట్లను
దేవీ కల వెల్ల నీకుఁ దెలిపితి మొదలన్
దేవాసురమానుషముల
నీవెఱుఁగని యట్టికథలు నేఁ డిఁక నేవీ! ౬౩

క. ఇప్పటికి భోజునకుఁ గడు
నొప్పిద మగు మణిమయాసనోపాంతములన్
ముప్పదియురెండుబొమ్మలు
చెప్పిన యాకథలు గలవు చెప్పెద వినుమా. ౬౪

క. అనవుడు నామణిసింహా
సన మెవ్వరిసొమ్ము భోజజనపతి కేలా
గునఁ జేరె నేమికారణ
మున నతనికి నిన్నికథలు బొమ్మలు సెప్పెన్. ౬౫

గీ. మధుర కంచి కాశి మాయాపురము ద్వార
వతి యయోధ్య యావవంతిపురము
నాఁగ నెగడు ముక్తినగరంబులం దున్న
నరులు పుణ్యభాజనములు గారె. 23

శా. ఏణీలోచనలుం గవీశ్వరులుఁ బ్రత్యేకాఢ్యులున్ జాణలు
న్వీణావేణుకళాప్రవీణమతులు న్విద్వాంసులు న్వీరులున్
క్షోణీదేవతలు న్మహోత్సవముల న్శోభిల్లఁగా నిత్యక
ళ్యాణం బై చెలువొందు నాపురము దివ్యం బైన సంపత్తితోన్. 24

సీ. దానప్రశస్త హస్తప్రభావము గల్గు
భూవల్లభులును దంతావళములు
వివిధపదక్రమ విహితవర్తన గల్గు
కుంభినీసురులును ఘోటకములు
బహుళసంఖ్యాత నిర్వహణచాతురిగల్గు
నుత్తమగణకులు యోధవరులు
నక్షపాటవసంభృతార్థభావము గల్గు
నాదిజూదరులును నరదములును
బదడు పసిఁడిగాఁగ భాండసంపద గల్గు
గ్రొత్తవర్తకులును గుమ్మరులును
జొప్పు దప్పకునికి నెప్పుడు నొప్పుల
కుప్ప యనఁగఁ బరఁగు నప్పురంబు. 25

గీ. అందుఁ జంద్రగుప్తు నాత్మజుం డగుభర్తృ
హరియు రాజు విక్రమార్కుఁ డతని
సవతితల్లికొడుకు యువరాజు తన్మంత్రి
భట్టి నాఁగ నీతిపరుఁడు గలఁడు. 26

చ. అలక లలిత్రజంబు, వదనాబ్జము చంద్రుఁడు, సుస్వరంబు కో
కిలములు, మంజువాక్యములు కీరగణంబుల సొంపు, చల్లనూ
ర్పులు మలయానిలం, బయిన రూపము దాల్చి యనంగసేననాఁ
జెలఁగె ననంగసేన యనుచేడియ భర్తృహరీష్టభార్యయై. ౭౭

క. తరుణులలో మిక్కిలి నీ
తరుణికడం జిక్కి పీతధరణీవరుఁడై
యొఱపునఁ దదీయచేతో
హారుఁడై హరివోలె భర్తృహరి విహరించెన్. ౭౮

ఉ. అత్యనురక్తి భర్తృహరి యంతిపురంబునఁ గేలిలోలుఁడై
నిత్యరతిప్రసంగముల నిల్వఁగ నాతనిదర్శనంబు సాం
గత్యము లేకయుం బ్రజలు కార్యముపట్లను భట్టి విక్రమా
దిత్యులనేర్పునం దగవు దీఱఁగ నుండిరి నైజవృత్తులన్. ౭౯

క. ఆదినముల నప్పురిలో
వేదవిదుం డైన యొక్కవిప్రుఁడు మిగులం
బేదఱిమి నొగిలి ధనసం
పాదనమతి భద్రకాళిపాలికిఁ జనియెన్. ౮౦

క. చని యాగుడిముందట ను
గ్రనియతిఁ దప మాచరింపఁగా నాదిమయో
గిని మెచ్చి దివ్యరూపం
బున నిలిచె న్విప్రుతలఁపుసొం పొనగూర్పన్. ౮౧

ఉ. అత్తఱిఁ జాగి మ్రొక్కుచు ధనాఢ్యత వేఁడుట దప్పి యాత్మలోఁ
దత్తఱ మంది బ్రాహ్మణుఁడు తా నమరత్వము వేఁడినం గృపా
యత్తమనస్కయైన జగదంబిక యేకజనోపభోగ్యసూ
క్ష్మోత్తఫలంబు దెచ్చి యిది గొమ్మని యిచ్చిన వచ్చి నాతఁడున్.

క. వచ్చుట విని తన కెదురుగ
వచ్చినసతిఁ జూచి విన్నవారలసేమం
బచ్చుపడ నడిగి యాపం
డిచ్చి యమర్త్యత్వ మిచ్చు నిది యని చెప్పెన్. ౧౩

క. అనవుడు విని యతనికుటుం
బినియును దారిద్ర్యదుఃఖపీడిత యగుటం
దనపతిఁ గడు దూఱుచు ని
ట్లనియె మనస్తాపమున నిరాకరణముగాన్. ౧౪

ఉ. అచ్చట మెచ్చుగాంచి యిట కర్థము దెచ్చెద వంచు నమ్మి ము
చ్చిచ్చున వెచ్చి పొట్ట కొక చేరెఁడు గంజియు లేక యాఁకటం
జచ్చియుఁ జావ మించుట విషంబయినం గొని రాక దేవిచేఁ
దెచ్చితి విట్టిపండు విధి ద్రిప్పఁగ ఛాందసబుద్ధి దప్పనే. ౧౫

క. కడుపునకుఁ గూడు గానక
పడి మిడిమిడి మిడుకునట్టి బడుగున కియ్యా
ఒడి యమరత్వంబేటికిఁ
గడు పిటఁ గాలంగఁ గంటఁ గాటుక యేలా. ౧౬

క. గతి దప్పిన పని కేమని
పతి దూఱఁగవచ్చు నిట్టి ఫలమున నొక సం
గతి ధనము వడయవచ్చును
మతిలో స్త్రీ బుద్ధి యనక మన్నింపఁదగున్. ౧౭

మ. ధరణీకాంతునకైన నొప్పు నమరత్వం బింక నీ వేఁగి యా
నరనాథుం గని దీని నిచ్చి బహురత్నస్వర్ణనిష్కోజ్జ్వలాం
బరభూషాది సువస్తువు ల్వడసి రమ్మా యంచుఁ బొమ్మన్న భూ
సురుఁ డేగెన్ ఫలహస్తుఁ డయ్యును *విహస్తుం డై నృపాస్థానికిన్.

* విహస్తుఁడు = చేయలేనివాఁడు, వ్యాకులుఁడు.

శా. ఆవేళన్ రమణీమణు ల్గొలువఁగా నాస్థానభూమి న్సమ్ముఖ
శ్రీ వెంపారఁగ నున్న భర్తృహరిధాత్రీనాయకుం గాంచి భూ
దేవుం డుత్సవ మంది యాదరముతో దీవించి యాపండు స
ద్భావంబొప్పగ నిచ్చి చెప్పె వరుసం దత్ప్రాప్తి సత్త్వంబులన్.

చ. బహుజనరక్షకుండ వగుపార్థివ నీక తగు న్ఫలం బను
గ్రహమునఁ బుచ్చుకొ మ్మనినఁ గైకొని భూపతి వేడ్కతో యశో
మహిమకుఁ బేరుగాఁ బసిఁడిమాడలుఁ బేర్చినపట్టుచీరలు
న్మహితములైన రత్నములు మన్నన నాతని కిచ్చి పుచ్చెతాన్.

క. నే నుండఁగ నిది సచ్చిన
నే నుండుట గడిఁది యిట్టి నెలఁతుక గలుగ
న్నే నన్ను నొప్ప నని తన
చేనున్న ఫలం బనంగ సేనకు నిచ్చెన్. ౫౧

సీ. ఆపాలఁతియు దాఁచి యాపండుఁ దనతోడ
నూని కూడెడు మందఁడీని కిచ్చె
వాఁడును దనుఁ గోరి వచ్చి యాపాలలోఁ
గసవూడ్చునట్టి బానిసకు నిచ్చె
నదియును దనకోర్కి పదిలంబుగామున్ను
తనకూర్చు పసులగోపునకు నిచ్చె
వాఁడును దనకుఁ దావలచి కొట్టములోని
పెండ యెత్తెడునట్టి ముండ కిచ్చె
నదియు దానిరాక మొద లెఱుంగమిఁ జేసి
పెండబుట్టిలోనఁ బండు వెట్టి
కొంచు నింటి కేగుదెంచుచోఁ దెరువున
నరుగుచుండి భూమివరుఁడు గనియె. ౫౨

క. కని దాని౯ బిలిచి యిదియే
యనువున నినుఁజేరెఁ జెప్పు మనవుఁడు నాత
మ్మునిమఱఁది పసులఁ గావం
జని యడవిం దెచ్చె ననఁగ జనవిభుఁ డలుకన్. ౧౩

గీ. తొంటివిప్రుని బిలిపించి ధూర్త నీవు
తెచ్చియిచ్చిన ఫల మని తెల్పి ధనము
గొంచు నేగితి విదియెట్లు క్రొత్త యోరి
దీని కబ్బినదనుడు నాద్విజవరుండు. ౧౪

క. నే నిచ్చినదియె యిది మఱి
కానేరదు నన్నుఁ గల్లగాఁ జేయకుమీ
యేనెపమున నిటుచేరెనొ
దీనిని శోధింపు వసుమతీవర యనినన్. ౧౫

క. ఉల్లమునఁ గనలి ధరణీ
వల్లభుఁడుం దానిఁ బిల్చి వనితా యిది నీ
యిల్లే నెరవునఁ జేరెను
గల్లాడక చెప్పు*నన్నుఁ గాచితి ననియెన్. ౧౬

మ. అనినం జెప్పకతీఱ దంచు నది నెయ్యం బొప్ప నాగోపుఁ జె
ప్పినఁ దన్మూలమునం గ్రమక్రమమునం బృథ్వీశ్వరుం డంతయు
న్విని దండింపక యాత్మ నోసి పలికె న్వేయింపుల నొంపులం
దనియంజేసిన నిల్చునే వనితచిత్తం బంచు నిందించుచున్. ౧౭

గీ. కప్పురంపుఁగుదుటఁ గస్తూరి యొరువుతో
నుల్లి నాటి చందనోదకములఁ
బెంపి రేని దానికంపుమాయని భంగి
నెంతయైన నిలువ దింతిమనము. ౧౮

* తప్పుగాచితి.

క. వనిత యొరుఁజూచి లోనగు
వన నిక్కము పతియు దోడియతివలుఁ బరులుం
గని విని యెగ్గొనరించెద
రని మానిన మానుఁగాక యడ్డము గలదే. ౯౯

సీ. మద మెక్కుచన్నులు మాంసపుముద్దలు
హేమకుంభములకు నెక్కు డనుచు
దూషితమూత్రపురీషదుర్గంధ మా
జఘనంబు కరిశిరస్సదృశ మనుచు
జిలిబిలికిం బుసులకుఁ జీమిడికిని బుట్ట
యైన మొగంబు సుధాంశుఁ డనుచుఁ
గండలుఁ దోలు*బొక్కలుగూడఁ బొదివిన
యాకృతి పసిఁడిసలాక యనుచుఁ
† దేగడైన పెదవి త్రేగు డమృతమని
కవులు వాగడఁ బేరు గలిగెఁ గాక
తత్త్వ మెఱిఁగి యిట్లు తలపోసి చూచిన
నింతి గోఁత కెల్ల నిల్లుగాదె. ౧౦౦

చ. అనుచు బహుప్రకారముల నంగనల న్మది రోసి యాత్మకా
మినులఁ బరిత్యజించి యిఁక మీమతి కింపగువారిఁ జేసికొం
డని సెలవిచ్చి రాజ్యసుఖమంతయు మాని విరక్తచిత్తుఁ డై
యనుజుని విక్రమార్కునిఁ బ్రియంబుగఁ బిల్వఁగఁ బంచి యిట్లనున్.

క. మనతండ్రి సౌరమంత్రం
బునఁ దప మొనరింప మెచ్చి మున్నర్కుఁడు దాఁ
దనయుఁడ నై పుట్టెద బొ
మ్మని నీవై పుట్టె విక్రమార్కుం డనఁగన్. ౧౦౧

* దొక్కలు. † ఉమియు పెదవి త్రేగుడమృతం బటంచును— నేగడైన పెదవి—

గీ. సర్వలక్షణముల సంపూర్ణుఁడవు నీవు
భట్టి మంత్రి గాఁగఁ బ్రజలనెల్ల
నేలు మంచు ముద్ర యిచ్చి దేశాంతరం
బరిగెఁ బరమయోగి చరితమునను. ౧౦౩

క. అన్నరనాథుఁడు విడిచిన
మున్నులు మున్నూఱు నతని యనుమతి *గలుగన్
మున్నూఱుఁ జేసికొని ధర
మున్నూఱుకులం బనంగ మొనసిరి సిరులన్. ౧౦౪

శా. రాజ్యం బేలుచు విక్రమార్కుఁ డిట సంరంభోచితోజ్జృంభణ
ప్రాజ్యప్రాభవసంభృతద్విపహయప్రారంభసైన్యంబుతో
సజ్యం బైనధనుర్బలంబు కలిమిన్ సామంతులన్ గెల్చి త
త్పూజ్యం బై ధనధాన్యలక్ష్మిఁ బరఁగెం బుణ్యం బగణ్యంబుగన్.

క. అతఁడు మహాకాళునకా
తత మగుతప మాచరించి తన కమరత్వ
స్థితి వేఁడిననరులకు †నీ
గతిపడ దొండడుగు మనినఁ గడిఁదిగ మఱియున్.

క. ఒకదివసం బెక్కుడుగా
నొక యేఁ డగుపిన్నపాప కుదయించిన బా
లకుచేతఁ గాని తాఁ జా
వక యుండను వేఁడికొనిన వర మతఁ డిచ్చెన్. ౧౦౭

వ. ఇట్లిచ్చి. ౧౦౮

క. వెయ్యేఁడులు రాజ్యసుఖం
బయ్యెడుఁ బొమ్మనిన దేవునానతి నారా
జియ్యకొని వచ్చి భట్టికి
నయ్యానతి క్రమముఁ జెప్ప నతఁడును మఱియున్. ౧౦౯

* మిగులన్. † విదిగతిపడదు.

క. నే మఱియును నొకవేయేం
డ్లీమహి యేలంగ నీకు నిచ్చెద నని భి
క్షామార్గి వగుచు రాజ్య
♦ వ్యామోహం బర్ధవర్ష మడఁచుము చాలున్. ౧౧౦

గీ. ఆఱు నెలలు నగరియందు నిల్వుము మీఁది
యాఱు నెలలు యోగివై చరింపు
పురిసహస్రవర్షములు చెల్లుఁ బొమ్మన్నిల్లి
నున్న వేయుఁ జెల్లుచుండు ననియె. ౧౧౧

క. తద్వచనము నిజహితముగ
హృద్వనజములోఁ దలంచి యిల యెల్ల నుపా
యద్వయమున నరయుచు భూ
భృద్వల్లభుఁ డేలెఁ బ్రజలు ప్రియమందంగన్. ౧౧౨

వ. అంత నొక్కనాఁడు. ౧౧౩

సీ. ఒకజోగి యతనిఁ గాటికి దోడుకొనిచని
బేతాళు రప్పించి ప్రీతి నునిచి
వేలిమిచేసి తా విపరీతగతిఁ బొందె
బేతాళుఁ డారాజుపెంపు మెచ్చి
యెడరైనఁ దలఁపుమీ యే వచ్చి పనులెల్లఁ
జేసెద మఱి యష్టసిద్ధు లొందు
నని పోయె బ్రహ్మాదులును మీఁద విద్యాధ
రాధిపత్యం బగు ననుచుఁ జనిరి
భూవిభుండు మగుడఁ బురమున కేతెంచి
సప్తసంతతులను సత్రములను
సంతతాధ్వరములఁ గొంతేయుగతి శక
కర్తయై ధరిత్రిఁ గీర్తి నెఱపె.* ౧౧౪

• వ్యామోహం బదియు నర్ధవర్షము చాలున్. * గీర్తినిలిపె.

ఉ. సజ్జితదానధర్మగుణచారుని చారుఁడు వైరిదారదృ
క్కజ్జలమార్జన ప్రథమ కారణచారు కృపాణపాణి వి
ద్వజ్జనబృందవందిజనతా జలజార్కుఁడు విక్రమార్కుఁ డా
యుజ్జయినీపురంబున నయోన్నతి రాజ్యము సేయుచుండఁగన్.

వ. తొల్లింటికాలంబున. ౧౧౫

క. విశ్వామిత్రుఁడు తప మతి
శాశ్వతముగఁ జేయు టెఱిఁగి శంకించి యమ ౧౧౬
రైశ్వర్యుఁడు కొలువులోఁ దన
విశ్వాసము*గలుగునట్టి వెలఁదుల కనియెన్. ౧౧౭

క. ఓయూర్వశి యోరంభా
మీా యిద్దఱిలోన నొక్క మెలఁతుక నటనో
పాయంబునఁ జిక్కిడి ముని
సేయుతపంబునకుఁ గీడు సేయఁగవలయున్. ౧౧౮

చ. అన విని పాత్ర నీయెదుర నాడిన నిద్దఱిలోన దీనిచేఁ
బని యగు నంచు నీ వెఱిఁగి పంపుము నావుడు నట్లకాక లెం
డనవుడు నాఁడు రంభ తగ నాడినఁ జూచి ప్రహృష్టచిత్తుఁ డై
యొనర ననుక్రమంబునను నూర్వశి యాడిన నట్ల మెచ్చుచున్.

క. వారల యెక్కువతక్కువ
లేరీతుల నెఱుఁగ లేక యింద్రుం డిఁక నె
వ్వా రెఱుఁగుదురో యని బృం
దారకమునివరుల నడుగఁ దత్సభలోనన్. ౧౨౦

క. సారదయామృతమతి యగు
శారదకృప వడసి యతివిశారదుఁ డగునా♦
నారదుఁ డుపమితశారద
నీరదుఁ డావిక్రమార్కనృపతిం జెప్పెన్. ౧౨౧

* విశ్వసనము. ♦ డయ్యున్.

ఉ. అర్కనిమూర్తి సర్వకళలందుఁ బ్రవీణుఁడు సంగరస్థలిం
గర్కశరాజలోకలయకాలుఁడు దానవినోది పాపసం
పర్కవిదూరుఁ డార్తపరిపాలనశీలనశాలి విక్రమో
దర్కుఁడు విక్రమార్కుఁ డిట కాతనిఁ బిల్వఁగఁ బంపు నావుడున్.

మ. మునివాక్యంబున నింద్రుఁ డిట్టిగుణధాము న్విక్రమాదిత్యుఁ దో
డ్కొని రమ్మా యని పంపె మాతలి నతండుం దేరునం బాగప*
చ్చనిగుఱ్ఱంబులఁ బూన్చికొంచు నధికోత్సాహంబుతో మింటిపైఁ
జని యుజ్జేనికి డిగ్గి యచ్చట నృపాస్థానంబు వీక్షించుచున్. ౧౨౩

మహాస్రగ్ధర—

సభలోనం గాంచె వర్ణాశ్రమజనపరిరక్షాసమారంభలీలా
శుభనిత్యాచారు లోకశ్రుతవిశదనిజస్ఫూర్తి సత్కీర్తి లక్ష్మీ
విభవాకృష్టార్థిజాతాభినుతవితరణాన్విత హస్తప్రభావ
ప్రభవశ్రీరమ్యు ఖడ్గప్రకటితజయసంపత్కు నవ్విక్రమార్కున్.

మ. కని యింద్రుం డిదె నిన్నుఁ బిల్వఁబనిచెన్ క్ష్మాపాల విచ్చేయుమా
యనిన న్గొబ్బున లేచి మాతలికి నాహ్లాదంబుగా నాదరం
బొనరం జేసి మహోత్సుకత్వమున నాయుర్వీశుఁడుం గాముఁడో
యన వచ్చెన్ హరితాశ్వరత్నయుత దివ్యస్యందనారూఢుఁ డై.

వ. వచ్చి కామధేను కల్పతరు చింతామణీ సంతతనివాసం బై యమరు నమరావతీపురంబు సొచ్చి తేరు డిగ్గి మాతలియునుం దోడరా నమరకిన్నరవిద్యాధర యక్షర క్షోనికర పరివారుండును దిక్పాల ముకుట తటఘటిత మణిగణకిరణారుణిత చరణకమలుండును నప్సరోహస్తచామీకరదండచారుచామరవ్యజ నవీజ్యమానుండును నై సుధర్మాసభామధ్యంబునం దారకితతారాపథ మధ్యభాగంబుఁ

* వేయుపచ్చని.

దారాగణపరివృతుండై వెలుంగు చంద్రునిచందంబున నందం బగు బృందారకేంద్రునిం గని ప్రణమిల్లిన నతనిం గౌఁగిలించు కొని గారవించి దీవించి యాసన్నమణిమయసింహాసనంబుపై సుఖాసీనుంజేసి కుశలం బడిగి సురపతి నరపతి కిట్లనియె. ౧౨౬

గీ. ఊర్వశియును రంభయును నాడఁగా మాకు
దారతమ్య మెఱుఁగఁ దరముగాదు
సర్వకళలయందు జాణవు నీ వంద్రు
దీని నిర్ణయింపు మానవేంద్ర. ౧౨౭

గీ. అనుచుఁ బలికి-మఱియు సాంగసంగీత వా
ద్యాదికృత్యములకు ననువు మెఱయఁ
గడఁగి నిలువుఁ డనుచు గంధర్వులకుఁ జెప్పి
మున్ను రంభనాడుమన్న నంత. ౧౨౮

శా. గంధర్వ ల్పదునాల్గుదోషములు దక్కం దాళమానంబులన్
గాంధర్వంబు ధ్రువాప్రబంధసరణిం*గావింపఁగా వాద్యముల్
ధింధింధిక్కధిమిక్కతక్క ధికతోంధిక్కత్తకోఝం కిణిం
ధింధాఝుంకకు ఝుక్కధిగ్ధిగుడధాధీయంచు మ్రోసె న్వెసన్.

క. జంభారియెదుర నాట్యా
రంభమ్మున నూర్వశీపరాజయకృత సం
రంభయు నూరుద్వయజిత
రంభయునై రంభ నిలిచె రంగస్థలిపై. ౧౩౦

క. సురపతిపంపునఁ గూడిన
మురజధ్వను లభ్రశబ్దములుగా శృంగా
రరసము గురియఁగ నాడెను
దిరుపులమురిపముల మెఱుఁపుదీగయుఁబోలెన్. ౧౩౧

వ. ఇట్లు రంభ యాడినం జూచి యానాకలోక భూలోకనాయకులు మఱునాఁ డూర్వశి కవసరం బిచ్చిన నదియును సంగీతశాస్త్రానుసారంబుగా* నిలిచి విలక్షించుచు— ౧౩౨

క. తనువున గీతాలంబన
మును జేతులనర్థవ్యాపితమును నేత్రయుగం
బునభావముఁ బదములఁ దా
ళ నిర్ణయమ్మును మెఱయఁగ లాస్యము నెఱపెన్. ౧౩౩

క. సురకామిని తననయనము
లరుదుగఁ దలచుట్టివచ్చు ననుట నిజముగాఁ
దిరుగుచుఁ బరిమండలితాం
బరపల్లవ యై నటించె మరుగొడుగుక్రియన్. ౧౩౪

క. ఈక్రియ నూర్వశి యాడిన
విక్రమఘనుఁ డిదియె మఱియు వెరవరియనినన్
శక్రుఁడు మర్మము దెలుపుమ
యేక్రమమున దీని నిర్ణయించితి వనినన్. ౧౩౫

ఉ. నావుడు నాతఁ డిద్దఱును నాట్యమున న్సరివత్తు రిందు శా
స్త్రావగతప్రసంగముల సాంగముగా నిది యాడె గాన ని
న్నే వివరించి యూర్వశియ యెక్కుడుగాఁ గయికొంటి నన్న న
ద్దేవుఁడు మెచ్చి యాతనికి దివ్యవిభూషణ మిచ్చి పెంపియున్.

సీ. ప్రభల నుప్పొంగుముప్పదిరెండుబొమ్మలు
నన్నివాకిళ్లఁ జెం పడుచున్న
నవరత్నఖచిత మై వివిధ సోపానమై
భాసురం బైనసింహాసనంబు

* సంగీతప్రసంగానుసారంబుగా

మెచ్చుగా నిచ్చిన మెయికొని ప్రణమిల్లి
దేవేంద్రు వీడ్కొని తేరిమీఁద
నిడికొని యుజ్జైని కేతెంచి వేడ్క సిం
హాసనం బెక్కి యాయవనివిభుఁడు†
సిద్ధు లెనిమిదియును జేకూరఁ బగతుర
పే రడంచి యాజ్ఞ పెంపుమీఱ
నేకవీరుఁడై యనేకవర్షంబులు
ధరణి యేలెఁ బుణ్యచరితుఁ డగుచు. ౧౩౭

శా. సత్పాత్రప్రతిపాదితార్థుఁ డయి రాజ్యం బుర్విలో సర్వసం
పత్పూర్ణంబుగఁ జేయుచుం బ్రజల భూపాలుండు పాలింపఁగాఁ
దత్పూర్వార్జితపుణ్యభోగముల కుత్సార్యత్వసంపాదులై
యుత్పాతంబులు పుట్టె నుజ్జయినిలో నుల్కాదిలక్ష్యంబులై.

క. అట్టివి గని జనపాలుఁడు
భట్టిం బిలిపించి నీవు భావజ్ఞుఁడ వీ
పట్టున నేతెఱఁ గగునో
యట్టి తెఱం గెఱుఁగు మనిన నతఁ డిట్లనియెన్. ౧౩౯

గీ. పడగ నేలఁ గూలె బట్టమేనుఁగు ప్రాలె
మేడఁ గాకికదుపు గూడి యఱచె
నిన్న వారువముల కన్నుల నీరొల్కె
దీన నీకుఁ గీడు తెల్ల మింక

క. ఇది నిజ మనవుడు నతఁ డే
కదినాధికవర్షమైనకన్యకు సుతుఁ డై
ట్లుదయించు నాకుఁ గీడై
ట్లొదవు న్మదిలోన బెగడకుండుమ*భట్టీ. ౧౪౧

† నిడికొని యుజ్జయినికిఁ దెచ్చి యొకవేళ నమ్మహాసనమెక్కి యవనివిభుఁడు.
* బెదరకుండుము.

క. జమునికి నెరగోసెదఁ* నా
క్రమ మెఱుఁగవె యనుఁడు నతఁడు కమలజఘటనా
సమయం బైన నసంభా
వ్యము లైనను సంభవించు నది యెట్లనినన్. ౧౪౨

క. ఇది మానిసి యిది సింగం
బిది దేవత యనువివేక మెడలఁగ బలసం
పద నుక్కఁగంబమున హరి
యుదయింపఁడె దైత్యవరుని నుక్కడఁగింపన్. ౧౪౩

క. ఏకద్విత్రిచతుఃపం
చాకృతికృతసంఖ్యముఖుల కవిజేయుండై
కైకొనిన తారకాసురుఁ
బోకార్పఁగ షణ్ముఖుండు పుట్టుట వినవే. ౧౪౪

మ. వరపుత్రుం డమరేంద్రవైరి పరిఖ ల్వారాశి యాలంక దా
గిరిదుర్గం బసురు ల్బలంబులు దశగ్రీవుండు రా జిట్లు బం
ధురమా రాజ్యము జాలు దేలగిల మిత్రు ల్మిత్రులం గూడఁగా
నరులు న్వానరులుం గొనం దలఁచి చన్నం జేటు వాటిల్లదే.

ఉ. కావున నిట్టి బాలకుఁడు గల్గుట తథ్యము నీకు నిష్ఠుగా
వేపులవారిచేతఁ బృథివీస్థలిలో నరయింపు మన్నఁ దా
నావచనంబు లియ్యకొని యాత్మహితుం దలపోసి విక్రమా
ర్కావనివల్లభుండు నెడ రంచుఁ దలంచెఁ బిశాచముఖ్యునిన్.

క. ఆతలఁపున వచ్చిన నతఁ
డా తెఱఁ గెఱిఁగించి యరయ ననిపినపిదపన్
బేతాళుఁడు పాతాళము
భూతములను నరసి వచ్చి భూపతితోడన్. ౧౪౭

* నారగోసెద.

సీ. జననాథ నీవు పంచిన నెల్ల చోటులుఁ
దిరిగి ప్రతిష్ఠానపురములోనఁ
గుమ్మరి యింట లేఁగొమ్మముందట మంటి
బలముతో నాడెడుబాలుఁ జూచి
యెవ్వరివాఁ డనునెడ నొక్కవిప్రుండు
తనకూఁతుకొడుకు తజ్జనని యిద్ది
యేఁటిపై నొకదినం బేగుచో *నాగేంద్రుఁ
డీపాపఁ గూడిన♦ నితఁడు పుట్టె
దానికారణంబు దేవరగాక యొం
డెవ్వఁ డెఱుఁగు ననుచు నిట్లు పలికె
నింకరాజ్యభోగ మింకకుండఁగ నీవు
సాహసంబు సేయు సాహసాంక. ౧౪౭

మ. అని చెప్ప న్విని యావలం దెలిసి సువ్యక్తంబుగా నాత్మనా
శనమూలం బని నిశ్చయించుకొని యాశ్చర్యంబుగాఁ దొల్లి చే
సినకార్యంబులఁ దోడు వేఁడక మదిం జేడ్పాటులం దోడువేఁ
డినఁ గష్టం బగు నంచు దాఁ జనియె భట్టి న్నిల్పి తా నొక్కఁడుఁ.

ఉ. ఆనరనాథుఁ డిట్లు చని యాయుధ మొక్కటి తోడుగాఁ బ్రతి
ష్ఠానపురంబు డగ్గఱునెడం జతురంగబలంబు లన్నియు
న్వానిపిఱుంద నేగి నలువంకల నిల్వఁగ నందుఁగొంద ఱా
లోనికిఁ జొచ్చి యావిజయలోలుని బాలునిఁ బోరఁ బిల్చినఁ.†

క. నాగేంద్రుఁడు జీవనవి
ద్యాగుణ మగుమంత్రశక్తిఁ దత్కృతములు నా
నాగాశ్వరథభటాదుల
కాగతిఁ బ్రాణంబు లిచ్చి యాత్మజుఁ బంపెఁ. ౧౪౯

* బేగిన. ♦ గోరిన. † బిల్వఁగఁ.

గీ. ఆకుమారుఁడు శాలివాహనుఁ డనంగ
నెగడి నగరంబు వెలువడి నిలుచునంత
శేషపంపున వచ్చి యాశీవిషములు
విక్రమార్కుని మూఁకలనాక్రమించె. ౧౫౨

ఉ. సర్పము లీక్రియ న్భటులఁ జంపిన నాతఁడు వారిప్రాణము
ల్గూర్పఁ దలంచి వాసుకికి ఘోరతపం బొనరించి యయ్యెడ
న్నేర్పొకయింతలేక యది నిష్ఫలమైనఁ గలంగియు న్భుజా
దర్పము తోడుగాఁగ నిది దైవవశం బని వచ్చెఁ బోరికి. ౧౫౩

క. అతఁ డిటు వచ్చినఁ దక్కిన
హితులును సైన్యములు గూడ నేతెంచినఁ ద
చ్చతురంగబలముపైఁబడ
గుతలము పదహతుల నతలకుతలంబయ్యెన్. ౧౫౪

వ. ఇట్లు తేజోవిక్రమార్కుం డగువిక్రమార్కునిసేనలు శేషప్రసాద విశేషశాలివాహనుం డగుశాలివాహను* బలంబులుం దలపడి పోరునవసరంబున. ౧౫౫

సీ. కాలుబలంబులు గ్రాహసంగతిఁ గ్రాలఁ
దురగము లురఁగలకరణిఁ జెలఁగఁ
దేరులు కలముల తెఱఁగునఁ దిరుగంగ
గరులు మైనాకాదిగిరులఁ బోల
నరిగబిళ్ళలు కమఠాకృతి మెఱయంగ
నడిదంబులును మీల ననుకరింపఁ
జామరంబులె సితచ్ఛత్రంబులును శంఖ
ఫేనసాదృశ్యంబు పేర్మి† నారయఁ

* శాలిభానుండగు శాలివాహను. † సాదృశ్యంబుబెరయ

బడగ లుత్పతత్ఫణికులభాతి వెలయ
రుధిరధారలు విద్రుమరుచిఁ దనర్పఁ
బటహరవములు జలఘోషభంగిఁ బొంగ
ముద్రమీఱిన రౌద్రసముద్ర మొప్పె. ౧౫౬

ఉ. అత్తఱి వీరు లేర్చుక్రియ నార్చుచు వత్తురు వచ్చి మూఁకలోఁ
జొత్తురు చొచ్చి శత్రువులచొప్పు లడంతురు వారిబీరము
లెత్తురు మెచ్చి మార్కొనుచు మెల్పున గెల్పున భిన్నభిన్నమై
చత్తురు చచ్చి యచ్చరల సన్నిధి నిల్తురు కల్తు రందఱన్*.

క. అయ్యెడఁ దెగియెడివీరుల
నెయ్యమున వరించు వేల్పునెలఁతలు దమలోఁ
గయ్యం బడువఁగ శూరుల
కయ్యము దివిఁ జూడ నాఁడుఁగయ్యంబయ్యెన్. ౧౫౭

సీ. ప్రొగ్గెడు గజఘటంబుల నుబ్బితెత్తెడు
రక్తంబు మద్యపూరంబు గాఁగ
వారక తెగినట్టి వీరులపునుకలు
కొమరారు పానపాత్రములు గాఁగ
నందందు వాచవికందువ లగుగుండె
కాయ లన్నియు నూరుఁగాయలుగను♦
గండలు తెక్కొన కజ్జాలుగాఁ గూర్చి
డాకినీగణము లనేకరుచులఁ

బొట్టకొలఁదిగఁ ద్రావుచు భూతములకుఁ
జవులు సూపుచు నేఁటియుత్సవముఁ బోల
నొండు లే దని పొగడుచు నుల్లసిల్లి
సోలి యాడంగఁజొచ్చె నచ్చోటఁ గలయ. ౧౫౮

* గెల్తురధ్భతిన్. ♦ గాయలనుచు.

క. ఆవేళఁ జిత్తముల వీ
రావేశము పొదలఁ బోటులాడఁగఁ దమకున్
దైవసహాయము లేమిని
భూవల్లభుసేన లెల్లఁ బొలియఁగఁ జొచ్చెన్. ౧౬౦

ఆ. రథము లంత విరథరధికసారథులయ్యె
గుఱ్ఱములును బాతి గొఱ్ఱెలయ్యెఁ
గాలుబలము లపుడు కాలుబలము లయ్యె
గజములెల్లఁ బోర నజము లయ్యె. ౧౬౧

క. కాలము చేరినవానికి
నేలయుఁ బగ యనఁగ మింట నిలిపినబలముల్
బాలునిఁ గూడుక యాభూ
పాలునిసైన్యముల నేలపాలుగఁ జేసెన్. ౧౬౨

శా. శుండాలాదిబలంబు లి ట్లరిగినన్ క్షోణీశ్వరుం డొక్కఁడుం
జండీశుండును గాలకర్మము నిజేచ్ఛం ద్రోవ లేఁ డంచు ను
ద్దండాస్త్రుండయి శాలివాహనునిచేతన్ దండకాష్ఠాహతిన్
ఖండీభూతశిరస్కుఁ డై యెగసి స్వర్గం జెల్లె నుత్ప్రీతిలోన్. ౧౬౩

క. ఆతనిదేహము వెలువడి
యాతత మగుదీప్తి నంబరాంతంబున ను
ద్యోతించుచు నెగసి మహా
జ్యోతీరూపంబు పోయి సూర్యునిఁ గలసెన్. ౧౬౪

గీ. ఇట్లు విక్రమార్కుఁ డీల్గిన విజయుఁ డై
శాలివాహనుండు లీలతోడఁ
బౌరులెల్లఁ బొగడఁ బైఠాణమున* మహా
రాజనంగఁ జేసె రాజ్య మచట. ౧౬౫

* పైఠాణమునన్ = ప్రతిష్ఠానపురములో.

సీ. అట నుజ్జయినిలోన నందఱు పౌరులు
నడలఁగా భూపాలు నగ్రమహిషి
యేఁపువకున్న కన్నెఱిఁగి మంత్రులు వచ్చి
నీవు గర్భిణి వౌటఁ జావఁ దగదు
వలదన్న నా ప్రభావతి మంత్రివరుల సం
బోధించి యీ రాజ్యమును భుజించు
నీతగవును జెల్లె నిత్తఱిఁ గడుపులో
పాపని బుచ్చి మీపాల నిడుదుఁ

గానుఁడనుచు వీరపత్ని గావునఁ గడంకఁ
బొట్ట వ్రచ్చియు శిశువును బుచ్చియిచ్చి
యగ్ని నివసించి దివి కేగి యమరసతులు
గొలువ నలరెడునిజనాథుఁ గూడుకొనియె. ౧౬౬

క. ఆపట్టనమున మంత్రులు
నాపాపను బెంచుకొనుచు నాతని రాజ్య
శ్రీపతిఁగా నొనరించిరి
భూపాలన మాత్మబుద్ధిఁ బురికొనుచుండన్*. ౧౬౭

క. ఇలలోఁ దండ్రిబలంబును
జలమును సొంపుఱ్ఱ్వించుకొని ప్రశాంతుఁ డనంగా
వెలయుచు నతఁ డొకకొలఁదిని
జెలువందెను మదుఁగుపట్టు చెలమయ్యుఁబోలెన్. ౧౬౮

చ. అనువుగ మంత్రు లాతని మహాసనసంస్థితుఁ జేయఁబూనినం
గని యశరీరి యీపడుచుఁగార్యము లేటికి వీఁడు దీని నె
క్కిన నగుఁబాటు గాదె తలఁగించి మహీస్థలిఁ బాఁతిపుచ్చుఁడా
యనిన నమాత్యు లెల్ల వెఱఁగందుచు నమ్మణిభద్రపీఠమున్.

* భూపాలుఁడు నాత్మబుద్ధిఁ బురికొనుచుండన్.

ఆ. పుణ్యభూమిఁ బాఁతి పుట్టగాఁ గట్టించి
కొంతకాల మున్న యంతలోన
దైవవశముకొలఁదిఁ దద్దేశ మెల్లను
హానిఁ బొందుచు ఖిలమయ్యె* మిగుల. ౧౨౦

సీ. అచ్చోట నొకవిప్రుఁ డగిసెలు లంకలు
గోదుమల్ జొన్నలుఁ గోరి పెట్టి†
పిట్టలనార్ప నాపుట్టపట్టున మంచె
గావించి యది యెక్కి త్రోవవారి
నాచేనుఁ జొచ్చి తిన్నన్నిజొన్నలు గోదు
మలు పిసికిళ్లుగ నలఁచి తినుఁడు[1]
అని పిల్వ నమ్మి వచ్చినవారి కవి పెట్టఁ
డా దిగి వచ్చి యందఱ నదల్చి
పరులసొమ్ముల కిట్లాసపడఁగఁ దగునె
యనుచు వారల నెడలంగనడిచి తిరుగ
మంచె యెక్కి రాజసమున మరలఁ బిలుచు
వచ్చెనేనియు దిగివచ్చి వారిఁద్రోలు. ౧౨౧

క. ఇవ్విధమునఁ జని మగుడుచు
నవ్విప్రుని వెఱ్ఱి యనుచు నందఱుఁ దమలో
[2]నవ్వుచుఁ గనుకనిఁ బోవఁగ
నవ్వార్త యెఱింగి భోజుఁ డట కరుదెంచెన్. ౧౨౨

క. వచ్చిననృపు భటులం గని
యచ్చటఁ దనమంచె నున్నయాతఁడు చేలో
మెచ్చయినవి భక్షింపుఁడు
విచ్చలవిడి విడియుఁ డనిన విడిసిరి వారల్. ౧౨౩

* లయమయ్యె. (హానిఁబొంది మయిలమయ్యె నని చిన్నయసూరిపాఠము) † వి త్తి.
1 తిన్ననిజొన్నగోదుమల్ పిసికిళ్ళు నుమలునం బిసికికొనుఁడు. 2 నవ్విధ మెఱుఁగక పోవఁగ.

ఉ. తొల్లిటియ ట్లతండు డిగి దాటుచు భోజునిఁ జేరి యక్కటా
యిల్లొక సర్పమై తినిన నిష్టుఁడు నైరికి సత్తు విచ్చినం
దల్లి విషంబు పెట్టినను దండ్రి తనూజుల నమ్మిన న్మహీ
వల్లభుఁ డొల్చుకొన్న మఱి వారల కెవ్వరు దిక్కు భూవరా!

క. బలహీనులకును నృపతియ
బల మనఁగాఁ బేదఁ జెఱుపఁ బాడియె యిది నీ
బలములచేఁ బాలించితి
వెలుగే తనచేను మేయువిధ మిట నయ్యెన్. ౧౭౬

క. గతి గానక యిది యొకసం
గతి బ్రదికెద మంచు నుండఁగా ధర్మముఁ ద
ప్పితి "బ్రహ్మస్వం విషము
చ్యతే" యనుచుఁ బెద్ద లెల్లఁ జదువుట వినవే.

క. బలవంతుల మని విప్రుల*
ఫలభోగంబులకు నాసపడుదురె మును వి
ప్రులకిచ్చిన భూములు దమ
చెలియండ్రని తలఁపవలదె క్షితిపాలురకున్. ౧౭౭

ఆ. అనుడు విభుఁడు చోద్య మంది తా నమ్మించె
యెక్కి తుష్టిపుష్టిఁ జొక్కి తలఁచె
దానధర్మగతులు దప్పక రాజనై
దీనజనుల సిరులఁ దేల్పఁ దగదె.♦ ౧౭౮

క. నెడఁగు లగుజనుల వృద్ధుల
బడుగులనుం బ్రోవలేనిబ్రదు కొక బ్రదు కే
యడిగెడు వారలు గలిగినఁ
బుడమంతయు నిచ్చి వారిఁ బుచ్చెద వేడ్కన్. ౧౭౯

* పైఁబడి. • దేల్పఁగంటి.

చ. అనుచు ముదంబునం బలికి యంతటఁ దానె యెఱింగి పల్లటి
ల్లినహృదయంబు నిల్పికొని లెస్స నిధానము గల్గఁబోలు వి
ప్రునిగుణ మిట్లుగా దిచట భూమిగుణం బని నిశ్చయించి యె
య్యన దిగివచ్చియెంతకొలుచయ్యెడు బ్రాహ్మణ* చెప్పనావుడున్.

శా. నాకుం జూడఁగ నాఱుపుట్లగు నరేంద్రా విష్ణురూపంబవౌ
నీకుం జూడఁగ నెన్నిపుట్లు లగునో నీవేకటాక్షింపన
స్తోకం బాసిరి గల్గదే యనిన సంతోషించి వేయిచ్చి మం[1]
చాకీర్ణం బగుపుట్టఁ గూల్చి యొకనిల్వ్యాక్రిందఁ ద్రవ్వించినన్.

క. భోజద్విగం భోజగ్రహా
రాజాకృతి నురగరాజరాజితచూడా
రాజితరత్నప్రభలను
దేజఃపుంజంబు దోఁచి దిక్కులు వెలుఁగన్. ౧౮౨

గీ. రత్నగర్భపేరు ప్రకటించునదియొకొ
రత్నసానుమూలరత్నచయమొ
గంటిలేని మానికంబులగనియొకొ
నాఁగ నవ్వెలుంగు వీఁగఁ బాత్ర.[2] ౧౮3

సీ. అందు నానారత్న సుందరప్రాంతమా
చంద్రకాంతాంచితస్థలము కలిమి
బెరయు ముప్పదిరెండు పిల్లగద్దియల శా
భరణంబులౌ హేమపాత్రములను
రత్నదీపమ్ములు రమణఁ జేతుల నున్న
పసిఁడిబొమ్మలును ముప్పదియు రెండు
నింపైననృపునివాళింపుసొంపొందఁగఁ ·
దత్సంఖ్యమణిమయద్వారములను

* య్యన దిగి చేన నెంత కొలు చయ్యెడు బాఁపఁడ. 1. గుల్మాకీర్ణంబగు. 2. ఠీఁగవాత.

*గలిగి నల్లడ నాల్గుచేతుల వెడల్పు
చాపమాత్రసమున్నతి నేపుమిగుల
విక్రమాదిత్యు లక్ష్మినివేశకాంతి
నంతఁ గనుపట్టె దివ్యసింహాసనంబు. ౧౮౪

క. తద్రూపముఁ గని నృపుఁడు ద
రిద్రుఁడు ధనరాశి గన్నరీతిం బ్రమదో•
న్నిద్రితుఁడై తివిరింపఁగ
భద్రాసన మద్రిభంగి బరువై తోఁచెన్. ౧౮౫

వ. తత్కారణం బెఱింగి మంత్రి యి ట్లనియె. ౧౮౬

క. అరుగరె యయాతిపృథుగయ
భరతసుహోత్రాంబరీషభార్గవ శిబిసా
గరరంతినంగరాఘవ
మరుద్దిలీపశశిబిందుమాంధాత లిలన్. ౧౮౭

గీ. వారిలోన నెట్టివారిసామ్మో యిది
పెద్దగాలమయ్యెఁ బృథివి నణఁగి
దీని వెడలఁ దివియఁ బూనినయప్పుడు
భూతతృప్తివలయు భూతలేంద్ర. ౧౮౮

క. అనవుడు విభుఁ డదిచేయుద
మని గోఱియలఁ జెరువువెట్టి† యనువగుబలిభో
జనములనసురులు సురలును
దనియంగా భూతతృప్తి తగ నొనరించెన్. ౧౮౯

గీ. దీనఁ బొంగి భటులు దివ్యసింహాసనం
బెగయనీడ్వఁ దాన యెగసి వచ్చె
మంత్రిఁ జూచి రాజు మంత్రీంద్ర నీబుద్ధి
లావుకలిమి నిట్టిలాభ మయ్యె. ౧౯౦

* కలిగి వలుదిక్కు అన్నిచేతులవెడల్పు. • నతిమోదద్రవుఁడై. † జెఱు (రు
వుపెట్టి-చెరవువెట్టి- చెరవు=బలి-అని చిన్నయసూరి)

ఉ. మంత్రము లేనిసంధ్యయును, మానము లేనితపంబు వేదవి
త్తంత్రము లేనియాగముఁ బదజ్ఞత[1] లేని కవిత్వము న్సదా
తంత్రులు లేని వీణయును దానకరాగము లేని గీతముం
మంత్రులు లేనిరాజ్యము సమానము లిన్నియు వ్యర్థకార్యముల్. ౧౯౨

వ. అని కొనియాడిన నిది మంత్రిప్రశంసావసరం బని యమ్మంత్రి
వరుండు స్వార్థంబును యథార్థంబునుగా ని ట్లనియె.

సీ. జూదరిసత్యంబుఁ జోరునిధర్మంబు
సరసునికోపంబు సవతిపొత్తుఁ
బాషండుమతమును బ్రాహ్మణుకలహంబుఁ
దులువసంగడమును ఖలునితపముఁ[2]
గులటలభక్తియుఁ గోమటినిజమును
బణ్యాంగనలప్రేమ పంద బిరుదుఁ
బగతురసైరణ యెగచు వైరాగ్యంబుఁ
బేదపెద్దఱికము వాదిధనము
నధమసంశ్రయంబు నైంద్రజాలికమును
బొమ్మసొమ్ము[3] మునుఁగకొమ్మపట్టు
మంత్రిలేని రాజ్యమహిమయు నావేళ
సుస్థిరములు పిదప నస్థిరములు. ౧౯౩

గీ. [4]మంత్రశక్తి నాత్మ మతి పెట్టెగా నుగ్ర
దండవిష మడంచి దండి గలిగి
యర్థ మొదవ భూపుఁ డనుపాముఁ బట్టి యా
డించు మంత్రి గారడీని కరణి. ౧౯౪

1. బుధజ్ఞత. 2. తగవు. 3. గొడ్డుపొంపు. 4. మంత్రశక్తిఁదమ్ము మఱవక పామును, మాంత్రికుండు త్రిప్పుమాడ్కి నెపుడు అనువెఱింగి భూపుఁడను పాముఁబట్టి.

క. కనియుం గానక యిచ్చలఁ
జనఁజూచినఁ బోవనీక జనపతిఁ గరిచా
డ్పునఁ బట్టి యంకుశముగా
ననువగు పనిఁ ద్రిప్పు మంత్రి యాధోరణుఁడై. ౧౯౫

గీ. కావఁ బ్రోవఁ గర్త గావునఁ దనమాట
త్రోవ నలవిగాదు త్రోవ యెఱిఁగి
యాఁడు మంత్రిమాట లాదరించెడివాఁడె
మేదినీశుఁ డంద్రు వేదవిదులు. ౧౯౬

మ. నరనాథుండు సమస్తమైనజనులన్ "రాజ్ఞాం ప్రజాపాలనం
పరమోధర్మ" యనంగ నీపలుకుల న్భావజ్ఞుఁడై యేలఁగా
నరులం దెవ్వరు నాజ్ఞమీఱఁ జన దన్యాయప్రవృత్తిక్రియా
పరుఁడై ధర్మముఁ దప్పఁ జేయుపనిఁ ద్రిప్పంజెల్లుఁ దన్మంత్రికిన్.

క. జననాథుఁ డనపరాధిం
దునుమఁగ సెలవిచ్చి హితుల దొరల మనవుల*
న్వినకుండినఁ దన్మంత్రికిఁ
దననేర్పున నతనికీడుఁ దప్పింపఁ దగున్. ౧౯౮

క. ఈచందనంబు మంత్రి మ
హాచతురుం డొకఁడు విభునియానతి మొదలం
ద్రోచియుఁ ద్రోవక విప్రుని
గాచె ననఁగఁ దొల్లి యొక్కకథ గల దధిపా. ౧౯౯

క. అనవుఁడు నాకథ నాకు
న్వినవలయును మంత్రివరుఁడు విప్రుని నేలా
గునఁ గాచెఁ బతిహితంబగు
పనిఁ జేసెం జెప్పు మనినఁ బతి కిట్లనియెన్. ౨౦౦

* తగవులన్.

క. *శాలిమయాన్న సదంబర
శాలిప్రియ సత్యసంగశాలీనవధూ
శాలావిశాలశీలవి
శాలాపుర మేలు నందజనపతి కడఁకన్. —౨౦౧

క. అతనికి సతిహితుఁడు బహు
శ్రుతుఁ డనఁగాఁ గలఁడు మంత్రి సురమంత్రిసముం
డతఁడు ఘననీతిఁ బరఁగెను
బతికార్యధురంధరుండు ప్రజలకు హితుఁడై. —౨౦౨

క. ఆ నందభూపతికి సతి
యానందము రూప మయ్యె ననఁ గలిగెఁ ద్రిలో
కీనయనచకోరములకు
భానుమతీదేవి యమృతభానుద్యుతి యై. —౨౦౩

సీ. దీపితకనకసందేహంబు దేహంబు
పచ్చకర్పూరంబుపలుకు పలుకు
పల్లవసంపదాస్పదములు పదములు
శోభితావర్తసనాభి నాభి
కుంఠితకలకంఠకంఠంబు కంఠంబు
ముకురవిడంబాభిముఖము ముఖము
సరసిజవైభవాకరములు కరములు
విజితనీలోరగవేణి వేణి

నడుము లేమికి నెప్పుడు నట్టనడుము
లోచనములు కర్ణాంతరాలోచనములు
ఇంతిపాలిండ్లు కంతుపాలిండ్లు పూఁడ
నట్టిరూపంబుఁ రూపింప నరుదుగాదె. —౨౦౪

* శాలిమయాన్న సదమల, శాలిప్రియసత్యసంగ.

గీ. అట్టిసతిని జెప్పవెట్టక చూచుచు
నిద్ర యాఁకలియును నీరు వట్టు
నడఁచి యధరసీమ* నమృతంబు గ్రోలుచు
దేవుఁ డనఁగ మనుజదేవుఁ డొప్పె. ౨౦౫

క. వనితలకు నురము నోరును
దను వర్ధము నిచ్చి రచ్యుతబ్రహ్మశివుల్
ఘనుఁ డాముువ్వుర మీఱుచు
జనపతి దనసతికి నిచ్చె సర్వాంగములున్. ౨౦౬

సీ. అవనీశుఁ డీక్రియ నంతఃపురంబున
విహరించుచును మంత్రి విన్నపమున
బలిమిమై నొకనాఁడు కొలువున కేతెంచి
యాసతితొడమీఁద నభిముఖముగ
నిడుకొని తన్ముఖం బీక్షించుచుండఁగా
దొరలును భటులును బరులు హితులు
లజ్జాభయములఁ దల ల్వంచికొనియుండఁ
గొంతతడవున కయ్యింతి చెయ్యి

పూని పట్టుకొనుచు లోనికిఁ బోయిన
మంత్రి కలఁగి యిట్టిమమత నేఁడు
మానిపింపకున్న హాని యౌనంచు మో
మోట మాని తోడ నొయ్య నేగి. ౨౦౭

గీ. దేవ యిచట నెట్టితెఱఁగైన నొప్పు నీ
యతివ నటకుఁ దెచ్చు టనుచితంబు
అనుడు నృపుఁడు నవ్వి యచ్చటి కే వచ్చి
యున్న నేమి రాకయున్న నేమి. ౨౦౮

* యధరరేఖ.

క. విశ్రుతనీతివివేక బ
హుశ్రుత నీయట్టి సచివుఁ* డుండఁగఁ బ్రమదో
న్మిశ్రముగ విశ్రమించెద
నాశ్రితసంరక్ష నీనయంబున జరుగున్. ౧౦౯

క. ఏణేక్షణ యీసతి నా
ప్రాణేశ్వరి నిమిష మైనఁ బాసిన విగత
ప్రాణమయి మేను నిల్వదు
ప్రాణము వెడఁబాయునట్టి రాజ్యం బేలా. ౧౧౦

చ. అనిన బహుశ్రుతుండు హృదయంబున నవ్వుచు నింత ప్రేమ గ
ల్గినఁ బటమధ్యమంబున లిఖించిన యీసతిరూపు నీమహా
సనము సమీప భాగమునఁ జక్కటి నిల్పిన నందు నీదు దృ
ష్టి నిలుపుకొంచుఁ గొల్వున వసింపుము నావుడు నియ్యకోలుచున్.

క. జనవరుఁ డొకచిత్రకుచే
వనితారత్నంబురూపు వ్రాయించి పటం
బనువందఁ జూపఁ బంపెను
తనకులగురుఁ డైనశారదానందునకున్. ౧౧౨

గీ. అతఁడు చూచి మెచ్చి యచ్చిత్రకారుని
జేరఁ బిలిచి తొల్లి చెప్పినట్లు
సతులలోన నాల్గుజాతులు గల విందు
జాతికొలఁది వ్రాఁత సహజమయ్యె.‡ ౧౧౩

చ. తొడలును జన్ను లోష్ఠములు దొడ్డలు కన్నులుఁ గాళ్లుఁ జేతులున్
వెడఁదలు మోముఁ గంఠమును వెండ్రుకలుం గుఱుచ ల్లలాటముం
బొడవు నొడ ల్వెడల్పుకడుపుం గుడుపున్నడపున్ ఘనం బగుం
జిడిముడిపాటులుం† దొగరుఁజీరలు హస్తిని కొప్పు నెప్పుడున్.

* మంత్రి. ‡ ఈగీతము క్రింద నొకప్రతిలో "నాల్గుజాతుల స్త్రీలకు బద్యములు" అని యున్నది. † పాటలుం.

చ. నడుము కృశంబు పిన్న జఘనంబు కుచంబులు గట్టి వెంద్రుక
ల్నిడుపులు గన్నులా మెఱుఁగు *నిగ్గులు కాంతకు వింతభోజనం
బడరుఁ బ్రియంబుఁ గోపము నయంబు సమంబులుదానఁగొండెమే
ర్పడ విను రక్తపుష్పపటరాగిణి శంఖినిఁగా నెఱుంగుమీ. ౨౧౫

ఉ. అన్నువ యైనకౌనుఁ గుటిలాలకపంక్తియుఁ జెన్నుమీఱఁగా
వన్నెలు గట్టుఁ బచ్చమసువంబులునుం మఱుమంగనేర్చు మా
ఱున్నెడఁ గన్నులార్చు సురతోద్ధతి నేర్పరి యల్పభుక్తితోఁ
దిన్ననిమాటలాడుఁ గడుఁ ద్రిమ్మరి చిత్తిని చిత్రవిక్రియన్. ౨౧౬

ఉ. తెల్లనిచీరలు ర్వ్రాలుఁ దియ్యఁదనంబును మెచ్చు వెంద్రుక
ల్నల్లన మోవి యెఱ్ఱన కనత్కనకద్యుతి మేను గన్నులు
త్ఫుల్లసరోజరోచులు మృదుధ్వని కంఠము పాణిపాదము
ల్పల్లవకాంతు లాననము పద్మము పద్మిని జాతి కిమ్మహిన్.

క. కలియుగమునఁ బద్మిని స
త్కులమున లే దిది తదీయగుణములు గలకో
మలి గాన నెడమలోఁదొడఁ
దిలప్రమాణంబు మచ్చ దిరమైయుండున్. ౨౧౮

గీ. అనుఁడు వెఱఁగుపడుచు నచ్చిత్రకుఁడు భీతి
తోడ నేగి పువ్వుఁదోఁటలోనఁ
జెలఁగునృపున కిట్లు చెప్పిన నతఁడు నో
వ్యస్థలంబు గనుట కాత్మఁ గలఁగి. ౨౧౯

ఉ. నందనరమ్యహర్మ్యగృహవనమ్మున మన్మథకేళివేళ నా
నందుఁడు భామవామజఘనంబున సన్నపు మచ్చఁ గాంచి యా
నందము డింది కందు మది నాటుకొనం దలయూఁచి శారదా
నందునిసద్గుణం బవగుణంబుగఁ గైకొని వచ్చి మంత్రితోన్.

---

* విగ్గులుగాదగు వర్తభోజనం బడరఁ బ్రియంబు కోపము భయం బొనరం దగదాన గుండె.

గీ. ధర్మమూర్తి యనుచు నిర్మలాత్ముఁ డని
నమ్మినార మిట్టి నాటకములఁ
జాల ద్రోహి యైన శారదానందునిఁ
జంపు మనిన మంత్రి సంచలించి. ౨౨౧

క. దేవా యిది మదిఁ దప్పుగ
భావింపకు భువి మహానుభావులు మదిలో
దైవికమానుషములయం
దేవియుఁ బొలివోవకుండ నెఱుఁగుట వినవే. ౨౨౨

క. జాడచెడి రాచలోఁగిలి
పాడుగఁ గన్నంబువెట్టి బలుమ్రుచ్చులతోఁ
గూడిన నొరుఁ జంపిన నం
కాడిన మఱి విప్రుఁ జంప నర్హం బగునే. ౨౨౩

వ. ఇంతియకాదు. ౨౨౪

క. భూపాల గురునిఁ జంపెడు
పాపము వల దనుచు మ్రొక్కి పలికినఁ "గామాం
ధోపి నతశ్యతి" యనియెడు
నాపలుకు నిజంబు చేసి యతఁ డుగ్రుం డై. ౨౨౫

గీ. చెడుగుబుద్ధు లింకఁ జెప్పక నామాట
ద్రోవనైతివేని ద్రోహిఁ జంపు
మనుడు మాఱుమాట లాడక శారదా
నందుఁ దెచ్చి బంధనం బొనర్చె. ౨౨౬

మ. ఇటు విప్రోత్తముఁ గట్టి కొంచుఁ జని మంత్రీంద్రుండు చింతించి య
క్కట చంపించిన బ్రహ్మహత్య నను బట్టం జేయు నారాజు ని
చ్చటఁ బాపంబున బ్రుంగుఁ గావునఁ దదాజ్ఞాలంఘనం బైన నొ
క్కటఁ గావించి జగత్త్రయంబు హితము గావింతునంచున్వెసన్.

ఉ. ఆతనికట్టు లూడిచి గృహంబున కంపి యమాత్యుఁ డేగి నే
నాతెఱఁ గట్లు చేసితిఁ బ్రియం బగునే యని చెప్పి వచ్చి త
ద్భీతియు నీతియుం గలుగ భీరునిఁ బాలుని నేలమాలెలోఁ
బ్రీతి వహించి దాఁచి తనపెంపునఁ బ్రోవఁగఁ గొన్ని యేండ్లకున్.

క. పాలసుఁడు కితవకేళీ
లాలసుఁ డస్థిరుఁడు దురభిలాషుఁడు మృగయా
లోలుఁడయి నందధరణీ
పాలతనూభవుఁడు విజయపాలుఁడు గడలెన్. ౨౨౯

వ. తదనంతరంబ. ౨౩౦

సీ. పిల్లులు పోరాడె బల్లి యూరక త్రుళ్లె
దమ్మళి పొడసూపెఁ దుమ్మి రెదురఁ
దొఱఁగునోయిన లేఁగ కొఱలుచు నొకకుక్క
పఱతెంచెఁ గ్రంపపైనఱచెఁ గాకి
యులుమఁ డొక్కఁడు నూనె తలతోడ నేతెంచె
నైలచీరలచాకి మ్రోల నదిరెఁ
[1]గాకియును గొరవంకయును తెక్కలపోతు
నేటిరింతయు దాఁటె నెడమదిశకు
[2]పైట వెరవుదప్పఁ బాలగుమ్మయుఁ బాఱె
నొంటిపాటఁ బైఁడికంటి పీచె
నెలుఁగుచేసెఁ బెద్దపులుఁగు పా మటు దోఁచె
దబ్బి బొబ్బలిడియె నుబ్బు లడర. ౨౩౧

గీ. వానిఁ గనుఁగొని పరివారమ్ము గలఁగుచు
శకునబలము లేదు చనకు మనిన
విజయపాలుఁ డివియు నిజములో కల్లలో
తెలిసికొంద మనుచుఁ దిరుగఁడయ్యె. ౨౩౨

---

1. కాకియునొకగొరవంకయును- అని చిన్నయసూరిగారు. కాకియు నొకపెరకయు నెరుకలపోతు_ 2. పైటవెరవుదప్పబారె చెమరుపోతు.

క. దుర్మతికి ధర్మబుద్ధియు
నిర్మలునకు దుర్గతియు గణికలకు దృఢ మౌ
కూర్మియుఁ గలిమికి నిలుపును
గర్మములకుఁ దప్పుటయును గలుగవు జగతిన్. ౧౩౩

శా. ఈరీతిం జను లెల్ల నుల్లముల నూహింపంగ శంపారుచి
స్ఫార[1]జ్యాయుతచాపగోపధరుఁడై సన్నద్ధసైన్యంబుతో
భేరీభైరవభాంకృతు ల్దిశల నిర్భేదింపఁగా నేగె ని
[2]ష్కారుణ్యుండు సమస్తదుర్గుణగణాగణ్యుండరణ్యానికిన్. ౧౩౪

గీ. అచటఁ జెమటకోక యమరించి కుడిచేతఁ
గడిఁదిడేగఁ బట్టి యెడమచేత
నెఱక లొయ్యఁజక్కఁ జెరివి మోమిక్కించి
కౌఁజుకక్కెరలను గదియనైచె. ౧౩౫

వ. ఇట్లొండొంటఁ బులుఁగుల నీల్గించి[3] యొక్కపిట్ట సాళువంబు నెగ
యించిన. ౧౩౬

క. తత్పక్షపాతరవము వి
యత్పథమున జలదనినద మన విహగము లా
త్యుత్పాతవృష్టి సమయప
తత్పాషాణములు వోలె ధరపైఁ గూలెన్. ౧౩౭

సీ. కేరిజంబులఁ గోరి కేరుట దీరించి
పూరేండ్లఁ బుడకల బూర్దెఁ గలిపి
పాలగుమ్మల నేలపాలుగా నొనరించి
వెలిచెల మెలఁకువ వెలితిచేసి

1. జ్యాలలితోదఁచాపధరుఁడై. 2. ష్కారుణ్యుండతఁ డుగ్రపాపజనతాగణ్యు. 3. ఇట్లు బొడ్డపులుఁగుల నీఁకించి.

బెగ్గురుకదుపుల బెగ్గిల మఱ్ఱిగించి
కొంగలపొగరెల్లఁ గ్రుంగఁ[1] ద్రొక్కి
కక్కెర నెత్తురు గఱ్ఱించి కొక్కెర
పిండు గుండియలెల్ల బెండుపఱిచి
కారుకోళ్ళ నెండ గారించి గోరవంక
బింక మింక వానిపొంక మణఁచి
చెమరుఁబోతుగముల జమరి కౌఁజులఁ జించి
సాళువంబు విజయపాలుఁ జేరె ౨౩౯

ఉ. అట్టిఖగంబు వేఁటకు నరాధిపనందనుఁ డిచ్చి మెచ్చుచుం
బిట్టల నెల్ల లోఁబఱిచి భృత్యుల కిచ్చుచుఁ బెక్కువేడుకల్
పుట్టఁగనొక్కచో మడుఁగు పొంతకుఁ బోయి జలంబుద్రావి యా
[2]పట్టున మీలఁ గాంచియొకబారువలం దివియించి యేపుగన్.

సీ. కొఱ్ఱమీలను దండ్రి కొలువులెంకల కిచ్చె
వాలుగలను సంగడీలకిచ్చెఁ
[3]బాఁపరలను బిన్నపడవాళ్ళకును నిచ్చె
మారువులఁ జనవువారి కిచ్చె
బేడిసంబుల నిచ్చె వేడుక కాండ్రకు
గెండెల బలుదుండగీల కిచ్చె
వెలిమొట్టలను దండువుల దలారుల కిచ్చెఁ
గొడిసెలఁ బరిహాసకులకు నిచ్చెఁ
బక్కెమొట్ట రొయ్య పరిగ యింగిలికము
చీరచింపుజెల్ల నారజెల్ల
కుంటముక్కు మొదలుకొని కల వన్నియుఁ
బంటువారికెల్ల నొంటియిచ్చె. ౨౪౦

---

1. గ్రుంగ. 2. చట్టునమీలఁ గాంచి యొక జాలిక్రియందివి పెంచి. 3. పాపెరలను బిస్తువడుచులకునునిచ్చె. పావమీనుల-చిన్నయసూరిగారు.

వ. ఇచ్చియచ్చోటు వాసి బాణాసనబాణపాణియై వాసురిక వాగు
రాకరాళంబగు వనాంత రాళంబుసొచ్చి. ౨౮౧

క. బాలుఁడు మెలఁగెను మృగకుల
కాలాకృతిఁ బవనజవన ఘనశునకాళీ
కోలాహలకాలాహిత
కోలాహల కాహళానుకూల క్రీడన్. ౨౮౨

క. తోలిఁదోలిఁ జింకల మనుఁ బో
తులఁ గడఁజుల లేళ్ళ[1]నిర్గ దుప్పుల మఱి యే
కలముల నెలుఁగులఁ బులులను
బలువిడిగాఁ[2]దునిమెఁ జలముబలము న్మెఱయన్. ౨౮౩

క. అయ్యెడఁ గోఱలు దీటుచు
దయ్యము క్రియ నొక్కపంది తాఁకుచుఁ దనువ్రల్
వ్రయ్యలుగఁ బొడిచెఁ దోలఁగం
జయ్యన నలుదెసలఁ బఱచి సైన్యములెల్లన్. ౨౮౪

వ. అప్పుడు కుమారుండు కృతవాహనారోహణుండై యావరాహం
బు నుం దోలి వెనువెంట నొంటిం జని చని కాఱడవి నీరంబు
లలో జాడదప్పి దప్పిఁగొని యొక్కమడుఁగుచేరి యచ్చోటఁ దురం
గంబు డిగ్గి చెట్టునం గట్టిసరసిలో జలంబులు గ్రోలి యభయుండై
యచట విశ్రాంతికై నిలుచునంత. ౨౮౫

శా. శీఘ్రాపాతనితాంతతాంత[3]తురగస్వేదంబుఁ దీర్పంగ వ్యా
ఘ్రాఘ్రాణంబున మోరమెత్తి తనమీఁస ల్నిక్కఁ దత్సౌరభం
బాఘ్రాణించి చరించి పొంచి కృతముఖ్యాయామభీమాకృతిన్
వ్యాఘ్రంబొక్కటివచ్చి యచ్చటనృపవ్యాఘ్రాత్మజుం జూచుచున్

1. గండలేళ్ళ. 2. బలమరిగాఁ దునిమెబలము బలమున్మెఱయన్ . 3. వితాంతవేగ

గీ. హాయము దానిరాక కదరికట్టినవాఁగెఁ[1]
ద్రెంచుకొనుచుఁ బొత్తె దిక్కు లద్రువఁ
బారిగొనం దలంచుపులిఁ జూచి బెగ్గిలి
విజయపాలుఁ డొక్కవృక్ష మెక్కె. ౨౪౮

ఉ. అమ్మొయి నెక్కెఁ గోపమున నాపులియుం బఱతెంచి తత్ప్రదే
శమ్మున నిల్చిన న్వెగడి శాఖలమీఁదికి డాఁగ నేగియుం
గొమ్మను నొక్కబొల్లిమొలుఁగుం గని తల్లడమంది దుర్నిమి
త్తమ్ముగ నాఫలంబు లిటుఁ దప్పక వచ్చెనె దైవమా యనున్.

క. క్రిందఁ బులి మీఁద నెలుఁగును
నందప్రియనందనుండు నడుమం గలుగ
న్ముందట నొకనుయ్యియు వెను
కందగ నొక గొయ్యిభంగిఁ గానఁగనయ్యెన్. ౨౪౯

వ. అప్పుడు. ౨౫౦

గీ. రెండునిలువు లెగయుఁ బుండరీకం బిది
నీకు నచట నుండ నేర్పుగాదు
నమ్మి[2] వేగ మిటకు రమ్ము బాలక యని
యెలుఁగు పిలిచెఁ గాఱుటెలుఁగు సెలఁగ. ౨౫౧

ఉ. అక్కొమరుండు దాఁప ? హృదయంబు యథావిధినిల్పి రెంటిలో
నిక్కడఁ గొంత యాస గల దిప్పటి కేగద నంచు మీఁదికిన్
స్రుక్కుచుఁ బోయెఁ గ్రిందఁ బులిచూచి చలంబున మీఱ లిద్దఱుం
జిక్కితి రంచు నాఁగి నిలిచెం దనకన్నుల నిప్పు లొల్కఁగన్.

గీ. పుండరీక మిట్టు లొండొండఁ జూపుల
మండఁ గోపవహ్ని మెండుకొనఁగ
నుండు టెఱిఁగి మాఱుమండుట మానె నా
నెండఱేఁడు గ్రుంకుఁగొండ నడఁగె. ౨౫౩

1. యప్పుడవాఁగె- (యెంతయువాఁగె) చిన్నయసూరి 2. నెమ్మి.

క. పులి యీఁగినఁ జిక్కినతమ
యెలుఁగును వెదకంగ వచ్చి యెల్లెడఁ గలయం
బాలయు నెలుఁగులో యన గుం
తల మిట్టలఁ జీఁకువాలు దళమై పర్వెన్. —౨౫౪

క. గగనమణి సాళువము క్రియ
నెగసినఁ దలసూపకుండి యింతట నతఁ డ
స్తగిరిచటిన్ వ్రాలిన పె
ల్లగుఖగముల కరణిఁ జుక్క లయ్యెడ నిక్కెన్.[1] —౨౫౫

శా. ఆవేళన్ భువిఁ బీఁటవెట్టిన మహావ్యాఘ్రంబు నీక్షించుచున్
దైవంబు న్నది దూఱుచుం దలఁకుచుం దద్రాత్రియర్థంబుఁ జిం
తావేశంబునఁ బుచ్చి కూర్కుఁ దలపోయంగా నెలుంగంత యుం
డా వీక్షించి నిజాంకసీమఁ జెలువౌతల్పంబుగాఁ జూపుచున్ —౨౫౬

క. నిద్ర చను దెంచె నేనియు
నిద్రింపుము వెఱవ నేల నీకిట ననినన్
నిద్ర సుఖ మెఱుఁగ దనఁగా
నిద్రించెఁ దదంకశయ్య నృపసుతుఁ డంతన్. —౨౫౭

సీ. శార్దూల మటు చూచి నిర్దయత్వముతోడ
భల్లూక ! పగవట్టి బ్రదుకఁగలనె
వాఁడు నీకేలెస్సవాఁ డయ్యెఁ బరజాతి
నృపతిపుత్త్రుండు నిష్కృపుఁడు వీఁడు
మనకులం బాదిగా వనగోచరంబుల
వేఁటచాటున నొక్కనాఁటఁ జంపె
నిల నొక్కగూఁటిపిల్లల మిద్దఱము దుష్ట
బోలునకై పోర నేల మనము

1. స్తగిరిన్ వ్రాలిన పెల్లగు. ఖగములక్రియఁ జుక్కలంతఁ గానఁగనయ్యెన్.

వీనిఁ గ్రింద వైపు విడిచిపెట్టెద నిన్ను
నగమునీకు నిత్తు నగవుగాదు
నను నమ్మవలదు నమ్మ మున్నొకపాము
చిచ్చులోనఁ గాలి చచ్చెఁ గాదె. ౨౫౮

క. ఆకథ విను వింధ్యాటవి
నేగలుఁ డనుబోయ తోఁటయారమున మహా
శాకోటముఁ[1] దెగనఱకఁగ
నాకోటరసీమ నొక్క యహిపతి వెడలెన్. ౨౫౯

గీ. వెడలి యేను నిలిచి విహరించుతా విది
వలదు దీన నేమి గలదు నీకు
నన్నుఁ గలసి బ్రతుకు[2] మెన్నఁ జేతులే
దనిన వెరఁగుపడుచు నట్ల తలఁగె. ౨౬౦

క. తలఁగిన వానికి నది తన
తలరత్నం బిచ్చి పుచ్చి తా నేగిన ని
మ్మల వాఁడు నేగి పురిలో
పల నొకవర్తకున కమ్మ పదిగద్దెలకున్. ౨౬౧

చ. అట మఱునాఁడు వచ్చిన మహాభుజగేంద్రుఁడు గారవించి ని
న్నఁటిమణి యెంత కమ్మితి వనా యనమూల్య మెఱుంగఁ దెల్పిన[3]
క్కట పదివేల కమ్మక వికల్పము చేసితి వింతనుండి మి
క్కుటముగ నమ్ముకొమ్మనుచుఁ గ్రొత్తఫణామణి యిచ్చె వానికిన్.

క. తనయిల్లుఁ గాచినాఁ డని
మనమునఁ బ్రియమంది యిచ్చు మణు లనుదినముం
గొనిపోయి యమ్ముకొనుచును
ధనికుండై వాఁడు చెల్మి దప్పినబుద్ధిన్. ౨౬౨

---

1. తొంటియిర వెఱఁగి మహానోకహముం. 2. ఇదిగొగొమ్ము మణియు నెన్నఁడుఁ.
3. వనాయని మూల్యము నెట్టెఱింగి యక్కట.

గీ. దీని కెచటఁగలుగు దివ్యరత్నంబులు
దీని మొదలితావుఁ దెలియవలయు
ననుచుఁ గోరిపోయి యాపాముచనుజాడ
వట్టి యేగియొక్కపుట్టఁ గనియె. ౧౬౪

క. కని తిరిగి పోయి మఱునాఁ
డనలంబును గనవుమోపు హస్తంబులఁ గై
కొని వచ్చి తోట్టిలోపలఁ
జొనిపె భుజంగంబు మిడుకుచు న్నడిఁయంగన్. ౧౬౫

క. జాల్ముం డిటు గాలిచి యా
వల్మీకముఁ ద్రవ్వఁ జనిన వడి విషములచే
గుల్మాదులు దరికొనఁగా
నుల్మకములభంగి మఱియు[1] నురగము లెగసెన్. ౧౬౬

గీ. ఉరగకులము బోయఁ బొరిగొని శమియించె
నట్లు గానవీని కడలనేల
పాము క్రూరమంత్రుఁడు ప్రాణులలో నెల్లఁ
బాముకంటె నధముఁడు పాతకుండు. ౧౬౭

క. నామాటనమ్మి డిగ్గన
నీమనుజునిఁ ద్రోవుమింక నేగెద ననినన్
మోమోటలేక నవ్వుచు
నేమీ సభ్యుఁడవె యనుచు నెలుఁ గిట్లనియెన్. ౧౬౮

క. ఇలఁగలపశువుల నెల్లను
బొలియించుచుఁ బాపములకుఁ బొడవయ్యెడు పె
బ్బులితోడి పొత్తు గలదే
పులి నమ్మియకాదెతొల్లి పులుఁ గొక టిలిగెన్. ౧౬౯

1. కొన్నియురగ-

మ. వినుమా చెప్పెదఁ దొల్లి యొక్కపులి కావేరీతటిం బ్రాణులం దనయిచ్ఛ న్వధియించుచుం దినుచు నుత్సాహంబుతో నుండి కారెనుఁబోతుం దిను నాఁడు మాంసకబళాస్వీతంబుగా నొక్కబొ[1]క్క నిజాస్యంబున నొక్క దౌడయెడ వీఁకం జొచ్చిన న్నొచ్చుచున్.

క. వదనము విదురుచుకొను చది
తుదినాలుకయెత్తుచేత దూపొడుచుక్రియం
గదలించుఁ దాలువొరఁగ
న్మెదలించుం దగ్గు మ్రొగ్గు మేదినిఁబొరలున్. ౨౭౧

మ. ఇటు దుర్వేదనఁ జిక్కి మాన్పుకొనఁగా నెం దేగినం బ్రాణసంకటమై ప్రాణులు మారి వచ్చె నని డాఁగం బాఱఁగా నొప్పి యెచ్చటనుం బాపెడు దిక్కు లేక చనుచున్ శైలస్థలిం జేరి ముందట సూచీముఖపక్షిఁ గాంచి తన ఖేదం బంతయుం జెప్పినన్. ౨౭౨

క. సూచీముఖంబు డగ్గఱి
నీచెడుగుందనము మాని నిలువవు నీనో
రో చెల్ల చొరఁగవలెహిం
సాచారవికాలుఁడైన నలుగఁడె నీకున్. ౨౭౩

చ. అనవుడు నోరుసాచి వ్యథ[2] యార్పఁగదే మును చచ్చినట్లు పల్లును మెదలింపకుండెద నలోలత నంచు మొగంబు వంచి వ్రాలిన నదినోరుసాచి కదలించి క్రమంబున దౌడబొక్క[3] ముక్కునఁ గొనివచ్చె నాపులికిఁ గుత్తుకనాటినకొయ్య నొయ్యనన్.

గీ. అట్లు పుచ్చిన ముద మంది సూచీముఖుఁ
బొగడి యేగి క్రూరమృగముమఱియుఁ
బసులఁ జంపి తినఁగఁ బలలంబుతో దౌడ
నాఁటిజాడ నెముక నాటినంత.[4] ౨౭౪

1. బొక్క = ఎముక. 2. నమ్మిచొచ్చి వెతయార్పు. 3. దౌడబొక్కముక్కున గొనివచ్చె నాపులికిఁ గుత్తుకనాటిన కొఱ్ఱు. 4. పుచ్చినను ముదమందుచుఁ బులుగుఁజాలఁ, బొగడియును నేగి యా క్రూరమృగము మఱియుఁ, బసులఁ జంపి తినంగ జావలముతోడఁ, నాఁటి దౌడనె యెముకయు నాటె మగుడ.

ఉ. క్రమ్మఱ వచ్చి పుచ్చు మని కైకొని వేఁడినఁ బుచ్చివైచి స
ఖ్యమ్మొనరించి నిచ్చలు సుఖస్థితి నుండఁగ నొక్కనాఁడు మాం
సమ్మొకయింత గానకయుఁ జయ్యన నాఁపులి వచ్చి వక్త్రము
న్నమ్మిక దోఁపఁగాఁ దెఱచిన న్విహగంబును జొచ్చె నాక్రియన్

క. చొచ్చినయంతన కాలునఁ
జచ్చె న్విహగంబు పులులసంగడ మిదిగో
నిచ్చకములాడె దీతన
నిచ్చుటకై యంత యేమి యే నజ్ఞుఁడనే. ౨౭౭

క. జాతివిభేదం బేటికిఁ
బాతకునకునైన నెడరుఁ బాపి[1] మహావి
ఖ్యాతిఁ గొననొప్పుఁదిర్య
గ్జాతికపోతంబు చెంచుఁ గాచుట వినవే. ౨౭౮

క. గోదానము ధనదానము
భూదానము నన్నదానమును బధికహితాం
భోదానము నుత్తమవి
ద్యాదానము గూడ నభయదానము సరియే. ౨౭౯

గీ. వెన్నుసొచ్చువానిఁదన్ను నమ్మినవానిఁ
జంపిరేని శిశువు జంపుటండ్రు
పంతమెఱుఁగు జాంబవంతునివారము
బాస తప్ప మిట్టియాస విడువు. ౨౮౦

చ. అనుచు నిరుత్తరంబుగ దయామతిఁ బల్కెడు నంత రాజనం
దనుఁడును లేచినన్ క్షణము దా నిఁకఁ గూర్కెద నిద్రవోకుమీ
యనితొడమీఁదనూఁదికొనియాఱొలుఁగించుకకన్ను మూయఁగాఁ
గనిపులివల్కె వానిమెయిఁ గంపము వుట్టఁగ బీతు వెట్టుచున్.

1. ఘాతుకునకునైన నెడరుగల్గినఁ దనలో నాతుకనవచ్చు.

గీ. కోఱలు గలవాని గోళులు గలవానిఁ
గొమ్ములు గలవాని నమ్మవలదు
బహ్మరించె నేని బ్రతుకంగవచ్చునే
యెలుఁగు తోడి చెలిమి యేల[1] నీకు. ౨౮౨

క. మొన్న నొకనిఁ దోలితి వాఁ
డిన్నగ మిఱ్ఱెక్క వాని నిది కరుణాసం
పన్ననిక్రియ లోనిడుకొని
నిన్న విఱిచిపెట్టి నేఁడు నిజమరినోలెన్. ౨౮౩

క. కూరిమిగల దని నమ్మకు
క్రూరమృగంబులకుఁ గరుణగూడునె యిదినీ
చేరువ నుండుట నేఁటికి
నీరీతుల బుజ్జగించె నెల్లిటి కొఱకై. ౨౮౪

గీ. దానిఁ జెప్పనేల యేనిదె యొకయేఁడు
పట్టు నాలునెలలు పట్టుఁ గాక
మిమ్ముఁ జంపి తిందు నమ్ముమీయెడనాకు
దీనిఁ ద్రోచి బ్రదుకు తెరువు గనుము. ౨౮౫

చ. అనవుడు వాఁడునిక్కముగ నాత్మఁ దలంచి యెలుంగుఁ గూలఁద్రో
చిన నది జాఱుచుం దెలిసి చేతికి లోనగు కొమ్మపట్టి యొ
య్యనఁ బఱతెంచి బెగ్గిలునృపాత్మజుఁ గన్గొని యల్పబుద్ధి వే
మన నను నమ్మమంటి భయమందకుమీ యని పల్కుచుండఁగన్.

క. కలకలఁ బలికెడుపక్షుల
కలకలములు సకలదిశలఁ గలయఁగఁ బొలయం
దళదళికులముగ దళశత
దళదళములు విరియఁ బ్రొద్దు తళతళఁబొడిచెన్. ౨౮౭

---

1. పొందులేల.

గీ. తమముతోడఁ గూడఁ దరలి శార్దూలంబు
శైలగుహాలకేగెఁ జాల డస్సి
తరణికిరణపంక్తి సరసఁ జెట్టుననుండి
యెలుఁగుఁగూడి బాలుఁ డిలకు డిగ్గె. ౨౮౮

క. ఆయెలుఁ గతనిఁ బిలిచి య
న్యాయివి పరలోకపీడనం[1] బగుదురితం
బీయెడన పాయఁ జేసెద
రా యిట వినుమిఁక "ససేమిరా"యను మొప్పుదున్. ౨౮౯

క. ఈనాలు గక్షరంబుల
నీనేరమి నొరుఁడు చెప్పనేని వికారం
బూనక తొల్లిటిక్రియ స
న్మానము గైకొనుము మంచిమాటలతోడన్. ౨౯౦

క. అని వీడ్కొలిపినతఱి న
ట్లనెయాతఁడును 'స్ససేమిరా' యనుచు వనం
బున భూతావిష్టుని చా
డ్పునఁ దిరుగఁగ వానిహయము పురిఁ జేరుటయున్. ౨౯౧

సీ. అశ్వరత్నం బొంటి నరుదెంచె నిన్నఁటి
శకునము ల్పాపనిఁ జంపె నొక్కొ
యని తలంకుచు నందజనపాలుఁ డాజాడఁ
బఱతెంచి యడవిలో బాలుఁజూచి
యన్న యిదేమిరా వన్న "ససేమిరా"
యనుడుఁ గలఁగి యెత్తి యడుగుటయును
నాలుగక్షరముల నోలిఁ బల్కెడువానిఁ
దోడ్కొనిపోయి మందుల నొనర్చి

1. యన్యాయపరతఁజేయుపీడన.

వీనిభూతశంక విడిపించువారికి
నర్ధరాజ్య మిత్తు ననుచుఁ జాటి
వేలుపులకుఁ బెట్టి వేఁడికొన్నను నాలు
గక్షరములు విడువఁ డయ్యె వాఁడు. ౨౯౨

ఉ. నందనృపాలుఁ డిట్లను మనంబునఁ గుళ్లుచు నెల్లవేల్పులన్
మందులు మ్రాఁకులున్ మణులు మంత్రములున్ వృథయయ్యె శారదా
నందుఁడ యిప్పుడున్నఁ బ్రియనందనుఁ దెల్వఁగ నోపు నట్టి పె
ద్దం జునిమించినాఁడ వలదా హితు లెవ్వరు నడ్డపెట్టఁగన్.

ఉ. నావుడు మంత్రి చిత్తమున నవ్వుచు నావిధ మయ్యె నాఁడు, నేఁ
డీవిధ మయ్యెఁ, బేరుకొన నేఁటికి నిందలపాల దృష్టమౌ
దైవము గల్గెనేని భువిఁ దత్సముఁ డొక్కఁడు గల్గనేరఁడే
కావున బమ్మరింపఁ బని గా దని యూఱడఁ బల్కె భూపతిన్.

ఉ. ఆవిభు నూఱడించి నిలయంబున కేగి బిలంబువిప్రుతో
నీవిధ మెల్లఁ జెప్పిన మహీసురుఁడు న్సచివాగ్రణీ భవ
ద్భావరుఁ జేరి నాఁటిగురుపుత్రిక యేడవయేఁటి పాప నీ
జీవముచిక్కుఁదీర్చు ననిని[1] చెప్పుము నీ వని పంచె నాతనిన్.

వ. అటకుం జని.

ఉ. ఆతఁడు విన్నవించినఁ బ్రియాన్వితుఁడై సుతుఁ దోడుకొంచు ధా
త్రీతలనాథుఁ డింటి కరుదెంచుడు నాధరణీసురుండు క
న్యాతిలకంబుఁ నాజవనికాంతరికాకృతి నిల్పి పద్యవి
ద్యోతితరీతి దోఁప వినుచుండెఁ గుమారు 'ససేమిరా' ధ్వనిన్.

వ. ఇట్టి నాలుగక్షరంబుల నాలించి విని యందఱు నూరకుండుం డని
కుమారు నుద్దేశించి పద్య మిట్లని చదివె. ౨౯౩

1. జీవము వేదదీర్చునని.

క. "స"జ్జనభావము గలుగు సు
హృజ్జనముల మోసపుచ్చు టిది నేరుపె నీ
యజ్జతోడ మీఁదఁ గూర్కిన
యజ్జంతువుఁ జంపఁ జూచు టది పౌరుషమే. ౨౯౯

వ. [1]అని చదివిన బాలుఁడు దా విని ప్రథమాక్షరము విడిచి పెట్టి "సేమిరా" "సేమిరా" యనుచున్నంత నందఱు నా నందనచంద్రుతో నానందంబు నొంది మేలు మే లనుచు నుండఁ దత్కలకలంబు మాన్పి జవనికలో గురుండు. ౩౦౦

క. "సే"తువుఁ గని జలనిధిసం
జాతధనుష్కోటిఁ బడిన సద్ద్విజహాతికిం
బాతకము వాయు మిత్రవి
ఘాతికిఁ బాతకము వోని గతి గలుగ దనా. ౩౦౧

వ. అని రెండవపద్యంబుఁ జదువఁ గుమారుండు రెండవయక్షరంబు విడిచి "మిరా మిరా" యనుచుండ నిట నయ్యాచార్యుం డనును.

క. "మి"త్రద్రోహికృతఘ్నప
విత్రగురుద్రోహిచౌర్యవిద్యాపరులున్
మిత్రశశిస్థితి చేరఁగఁ
బుత్రులు గలిగియును నరకమునఁ బడుదు రనా. ౩౦౩

వ. అని తృతీయపద్యంబు పఠించినఁ దృతీయాక్షరంబు విడిచి "రా, రా" యనునందనుం జూచి యమందానందుం డగు నందు నుద్దేశించి శారదానందుండు. ౩౦౪

క. "రాజ!" భవదీయుఁ డైన త
నూజునకు న్శుభము నోజ నూల్కొను విద్వ
ద్రాజిక ధనదానము ని
ర్వ్యాజమునం జేయు మిహపరంబులు గలుగున్. ౩౦౫

[1] ఈవచనము మొదలు కందపద్యమువలె నడచుచున్నది.

వ. అని యిట్లు చతుర్థపద్యంబుఁ జదివినఁ జతుర్థం బగు రకారంబుతో
నవ్వికారంబునుం బాసి బాలుండు తండ్రికి మ్రొక్కి మిత్రద్రోహ
లక్షితం బగు ఋక్షవ్యాఘ్రవృత్తాంతం బంతయుం జెప్పిన నచ్చె
రువు మెచ్చునుం బిచ్చలింప నవనీ పతిజవనికవంకఁ జూచి. ౩౦౬

గీ. పిన్నదాన విచట నున్నదానవు తల్లి
యింటి వాకిలియును నెఱుఁగ వీవు
కానలోనఁ బులియు మానిసియు నెలుంగుఁ
దోడను చేత లెట్లు తోఁచె నీకు. ౩౦౭

వ. అనుడు నతం డింకఁ దాఁపం బని లే దని తలంచి. ౩౦౮

క. భూనాయక! భూసురకృప
నానాలుక నొప్పు వాణి నానాదృథవి
జ్ఞానమునఁ దెలియు నన్నియు[1]
భానుమతీదేవిమచ్ఛభంగి న్మదిలోన్. ౩౦౯

మ. అనినన్ దిగ్గన లేచి చూచి తెరలో నాచార్యుఁగా నిశ్చయిం
చి నరేంద్రుం డతి హృష్టుఁ డౌచు సచివుం జేపట్టి నీయట్టి బం
ధునిధానం బెఁక నొందు గల్గునె గురుద్రోహంబుఁ దప్పించి యెం
దును శాపంబును బొందకుండ నను ధన్యుం జేసి తీనేర్పునన్.

క. ప్రణయము దప్పక యాబ్రా
హ్మణహత్య దొలంగ రాజ్య మలరఁగ సుతుడు
గ్గుణములు విడిపించితి నీ
గుణములచే నన్ను జట్టిగొంటివి చుమిత్రా. ౩౧౧

వ. అని గ్రుచ్చి కౌఁగిలించుకొని తనపట్టిచెట్ట వట్టుకొని పుణ్యానుల
భానుమతియగు భానుమతియుం దానును గురు డగ్గఱి. ౩౧౨

1. జ్ఞానముఖంబున వెలయున్.

క. ఎల్లవిధంబులఁ జూచినఁ
తల్లియుఁ దండ్రియును నీవె దయసేయుము మా
కల్లలు లోఁగొని మము నీ
వల్లిల్లుగఁ జూడు మనుచు నరపతి మ్రొక్కెన్. 313

శా. ఈచందంబున మ్రొక్కి యందలముఁ దా నెక్కించి భూమీవరుం
డాచార్యుం గొని వచ్చి గద్దియపయిన్ హర్షంబుతో నుంచి శి
ష్టాచారంబునఁ బూజచేసి తనరాజ్యశ్రీ సమర్పించి త
ద్వాచాదత్తముగాఁగఁ గైకొని ప్రసాదం బంచు నేలెన్ భువిన్.

మ. అని మంత్రీంద్రుఁడు చెప్పిన న్విని కథాహ్లాదప్రసన్నాత్ముఁ డై
జననాథుండును మంత్రి లేనిపని మోసం బంచుఁ జేపట్టి గొ
య్యన సత్త్వాఢ్యులచేతఁ బుష్పకనిభం బౌ దివ్యసింహాసనం
బనువొందం గొనిపోయి నిల్పె నిజహర్మ్యంబైన ధారాపురిన్.

ఉ. శంభుముఖాంబుజార్క దృఢసారవరాహశరీరవశ్యవి
శ్వంభరు శాంభవీవరదు సంభృతరక్షణు సర్వలోకపు
ష్టింభరు సిద్ధసాధ్యసుర కిన్నర పన్నగ గీతకీర్తివి
శ్వంభరు జంభవైరిసహసంభవు దృష్టవపుర్విజృంభణున్. 316

ఉ. శంకితకింకరవ్రజవశంకరుఁ బంకజనేత్రమిత్రు స
ద్భ్రంకమకాంతిసంకులకపర్దవిభూషితభవ్యదివ్యకూ
లంకషు నిష్కళంకితవిలాసకలాపధురీణు శౌర్యస
ర్వంకషవైభవాంకితవశంకరు శంకరు లోకశంకరున్. 312

మాలిని. పరమకరుణలీలా భక్తలోకానుకూలా
పరిచితసురరక్షా భగ్నదైతేయవక్షా
సరసిజహితనేత్రా సచ్చిదానందగాత్రా
హరిహరమయ రూపా యాగయోగస్వరూపా. 315

గద్యము. ఇది రాయగజగంధవారణ వైరిమండలికభేకఫణీంద్ర వీర ఘోట్టవిభాళాది బిరుదప్రకట చారిత్ర కళింగదేశ నిర్ధూమధామ త్యాగనాగార్జున కర్ణాట ద్రవిళాంధ్రమహారాష్ట్ర భూపాల రూప నూపురసుందర చరణారవింద సనదప్రోలి పురవరాధీశ్వర వెలనాటిపృథ్వీశ్వర రాజ్యసముద్ధరణ శ్రీకొలవివెన్నయామాత్యపౌత్ర హారితసగోత్రపవిత్ర సకలసుకవిమిత్ర కసవరాజతనూజ గోపరాజవిరచితం బైన సింహాసనద్వాత్రింశిక యను కావ్యంబునందుఁ బార్వతీపరమేశ్వరాన్యోన్య ప్రశ్నోత్తరంబులును భర్తృహరి వైరాగ్యంబును విక్రమార్కుని రాజ్యసాయుజ్యంబులును, శాలివాహన విజయంబును భోజునికి సింహాసనప్రాప్తియు మంత్రిగుణప్రశంసయు నందోపాఖ్యానంబును నన్నది కథావతారిక ప్రథమాశ్వాసము.



శ్రీరస్తు.

# సింహాసనద్వాత్రింశిక.

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీరామాకుచశైలవి
హారుని మునిహృదయగహ్వరాశ్రయుని మహా
దారుణనఖదారితరిపు
వారణనరసింహు నిగమవనసంచారిన్. ౧

క. మనమునఁ దలఁచుచు విద్వ
జ్జనదైవజ్ఞాది సర్వజనసమ్మత మౌ
దినమున భోజుఁడు సింహా
సన మెక్కఁ గడఁగె రాజ్యసంపద మెఱయన్. ౨

సీ. ధారాపురంబులోఁ దారాపథమునోలు
రత్నమండపములో యత్నమమర
నిర్మించినపసిఁడికంబమ్ములమేడలో
దివ్యసింహాసనస్థితి యొనర్చి
యవరోచనాజ్యదూర్వామ్రపల్లవ పుష్ప
సిద్ధార్థదధి ఫలక్షీరములును
నాదిగాఁ బెక్కు పుణ్యద్రవ్యములు గూర్చి
పుణ్యాహమున భూమిపొలుపుదీర్చి[1]
దేవతరువుమాడ్కిఁ దెల్లనిగొడుగుతోఁ
గూడఁ బసిఁడికామకుంచె లచట
నిలిపి పొంతఁ గైదువులు సేర్చి యర్చన
లిచ్చి నుత్సవంబు పిచ్చలింప. 3

1. పులితోలుపైభూతి చెలువుదీర్చి.

వ. తదనంతరంబ నానాపురాణేతిహాసశ్రవణంబులను బంచమహావాద్యప్రపంచంబులను సంగీతసాహిత్యసంగతనాట్య ప్రసంగంబులను బ్రతియామదీయమాన ధూపదీపాదినైవేద్యమహోపచారంబులను దత్పరివారదేవతలకు నృపబృంహణంబుగా నేమం బగు నేమంబున నారాముండునుం బోలె నాయామినిం గడపి మఱునాఁడు కృతమంగళస్నానుం డై ప్రత్యూషనిత్యకృత్యంబులు నిర్వర్తించి యప్పుడు మకరతోరణంబులునుం దెలిముత్తియంబుల తోరణంబులునుం గలువడంబులు, బలికూటంబులు మేలుకట్లునుం జీరగుండ్లును మృగనాభిలేపనంబును, ముక్తాఫలరంగవల్లికలును వెల్లివిరియ నుల్లంబుల నుల్లసిల్లుపౌరులును నానాదిగంతాగతవిద్వజ్జన జ్యోతిషిక శాకునిక స్వరవేదులును వందిమాగధ బృందంబులును బసిండి పళ్లెరంబుల మాణిక్యదీపంబులతో నివాళింపుచున్న పుణ్యాంగనలును హితరాజలోకబంధువర్గంబునుం దలకొన జయ జీవ వర్ధస్వసుఖీభవాది శుభసూచకశబ్దంబులును బహువిధ వాద్యరవంబులును, నొక్కటై దిక్కులుపిక్కటిల్ల మిక్కుటంబుగా సుముహూర్తంబున సర్వతోముఖం బగు మహాసింహాసనంబు డగ్గఱి ప్రదక్షిణంబుగాఁ దిరిగి చూచి తత్తద్వారంబుల కడల నున్న బొమ్మలతలకడల నున్నపిన్నగద్దియలలో నెందేని నడుగిడి పెద్ద గద్దియ యెక్కుట భావ్యం బని వారశూలరహితంబుగా నొక్క దిక్కున నిలిచి సకలజనకలకలంబు నుడిపి మౌహూర్తికసావధాన శబ్దంబు లోలయు నిష్టదేవతలం దలంచి ప్రశస్తఖడ్గహస్తుం డై పూర్ణఘటికోచితనాదావసరంబు నెదురుచూచుచుండ.

## —: మొదటిబొమ్మకథ :—

క. మును గడియారంబునఁ గ
ట్టిన పెనుజేగంటరవము తేయను నెడ గ్ర
క్కున భోజుం డడుగెత్తినఁ
గని నిలునిలు మనుచు బొమ్మ కలకలఁ బలికెన్. ౫౧

చ. పలికిన భోజుఁ డద్భుత మపారముగా మది నిండి పాఱఁగా
నిలిచి గతజ్ఞ తద్జ్ఞ ధరణీసుర మాగధనందిగాయకా
కలకల మెల్ల మాన్చి శుభకాలములో నిది యెక్కఁ బూనఁగా
వల దన నేల యిందుల నివారణకారణ మేమి నావుఁడున్. ౬

మ. తనవాక్యంబులు తత్సభాజనుల కుత్సాహంబు నాశ్చర్యముల్
పెనఁగొల్పంగఁ బసిండిబొమ్మ నగి గంభీరంబుగాఁ బల్కె నో
జననాథా విను చంద్రగుప్తనృపసంజాతుండు కంజాతమి
త్రనిభుం డుజ్జయినీపురిం బరఁగె నేతత్కర్త సత్కీర్తితోన్. ౭

వ. ఆయనఘునత యెట్టి దం టేని— ౮

క. సిద్ధులకు నసాధ్యము లగు
సిద్ధులు నెనిమిదియుఁ దనకు సిద్ధంబులుగా
నిద్ధరణిఁ బౌరుషమునఁ బ్ర
సిద్ధుం డగు సాహసాంకుఁ జెప్పం దరమే. ౯

శా. సంభూతాన్యవిడంబడంబరమిథఃసంరంభగర్వోర్వశీ
రంభానాట్యవిజృంభమాణమతివిస్రంభాదిశుంభన్మనో
జంభారిప్రియసంభృతానకమహాసంభావనాసంభవా
స్తంభోదుక్కఁడు విక్రమార్కుఁ డతఁ డేతన్మాత్రుఁడే చూడఁగన్.

క. అతిశయవితరణగుణమున
నతనికి సరిరాక యెక్కనలవియె నీకుం
గ్రతువులు నూఱును జేయక
నితరుల కమరేంద్రపీఠ మెక్కం దగమే.[1] ౧౧

క. అనవుడు భోజుఁడు విస్మయ
మును సిగ్గు నహంకృతియును ముప్పిరిగొన ని
ట్లనియె నొకయర్థి వేఁడినఁ
దనియఁగ నహాపాదలక్షధన మే నిత్తున్. ౧౨

---

1. మెక్కుటగలదే.

క. నావితరణ మిది యల్పమె
నావుడు నది నవ్వి తనగుణం బన్యులకుం
దా వినిపించుట కొఱంతగ
దా వివరము తప్పి తీవు ధరణీనాథా! ౧౩

క. ఇది మొదలు కొఱత యయ్యెం
దుదిఁ బుణ్యము హానిఁ బొందె దొడ్డతనంబుం
జెదరెం దనుఁ దాఁ బేర్కొను
టిది కష్టము తొంటినీతి యెఱుఁగవు చుమ్మా. ౧౪

ఉ. ఆయువు మంత్రి మహౌషధము నర్థము దానము మానభంగ మ
న్యాయము నర్థనాశము గృహవ్యసనంబును దాఁపురంబుగాఁ
జేయుట నీతియుక్త మటుసేయక తా నయి దానధర్మముల్
చేయుదునంచుఁ జెప్పినను సీయని నవ్వరె ధర్మ మెంచరే. ౧౫

క. ఈసమయమునకుఁ దగ నీతి
హాసము గల దొకటి వినుము హరిదశ్వకులో
ల్లాసకరుఁ డయోధ్యాపుర
వాసి సుదర్శనుఁ డనంగ వసుమతి నేలెన్. ౧౬

చ. అతఁడు సపాదలక్షవసుధామరపంక్తికి భోజనంబు సు
వ్రతముగఁ బెట్టుచుం దివిజవర్గము మిక్కిలిఁ దుష్టిఁ బొందఁగాఁ
గ్రతువులు పెక్కుసేయుచు జగన్నుతుఁడై సరయూతటంబునం
గతిపయవాసరంబు లధికం బగుసత్ర మొనర్చుచుండఁగన్. ౧౭

క. శారద వీణావాద్యవి
శారద తగురూప మైనచందము మెఱయన్
శారదనీరదనిభుఁ డగు
నారదముని చేరవచ్చె[1] నరపతిఁ జూడన్. ౧౮

1. వచ్చెనపుడు నరపతిఁ జూడన్.

క. వచ్చినమునిఁ గనుఁగొని యిటు
విచ్చేయుం డనుచు మ్రొక్కి విభుఁడుచితార్ఘ్యం
బిచ్చి కృతాంజలియై నే
సచ్చరితుఁడ నైతి మీప్రసాదము కలిమిన్. ౧౯

గీ. ఎచటినుండి యిటకు నేతెంచితిరి నన్ను
ధన్యుఁ జేయ నన్నుఁ దపసి వలికెఁ
బరమధర్మశీల బ్రహ్మలోకమున నీ,
దానధర్మవార్తఁ దడవ వింటి. ౨౦

చ. విని నినుఁ జూడ వచ్చితి భువిం గనుఁ బుణ్యుఁడ వంచు నన్న నో
మునివర శిష్యుఁగాఁ దలఁచి ముద్దునఁ బల్కెద వెంతవాఁడ నే
ననుచు వినీతుఁ డైనఁ గొనియాడి గుణాఢ్యుఁడ వీవు నీయశం
బనఘచరిత్ర బ్రహ్మభువనాంతము ముట్టిన దింతె చాలదే. ౨౧

క. విశదమగు కీర్తివసనము
కృశరక్షక! సప్తతంతుకృత మయ్యెఁ జతు
ర్దశభువనంబులఁ గప్పెను
వశమే నినుఁ బొగడ శేషవాణీశులకున్. ౨౨

వ. కావున నీ కసాధ్యంబు లే దె ట్లన్న. ౨౩

క. ధాత్రీశ పుణ్యనిర్మల
గాత్రులకును జగములో నగమ్యము గలదే
క్షత్రియపుత్రుఁడు విశ్వా
మిత్రుఁడు బ్రహ్మత్వపదవి మేరల మీఱెన్. ౨౪

క. స్వకులోచితధర్మముఁ ద
ప్పక మనువారలకు వలయుపని దుర్ఘటమే
ప్రకటంబుగ ఋషిపత్నులు
సికతాకలశముల జలము చేరుపుగొనరే. ౨౫

వ. దీనికి దృష్టాంతంబుగ నీవును దీనం గుండఁ జేసి నీవు నించిన నిలుచు నని యిసుక చేతి కిచ్చిన నృపాలుం డందుకొని.

క. అటు చేసినఁ జిత్రము ని
ష్కుటముగ నాదానధర్మగుణసిద్ధునిచే
ఘుటితరస మైనసికతా
ఘుటి యొప్పెను రసము ఘుటికగట్టినభంగిన్.[1] ౨౭

క. కృతిఁ గుండలు నిలిచిన స
త్కృతిఁ గనుఁగొని నారదుండు దినమును నీ వీ
గతిఁ బుణ్యకీర్తి వెలయిం
పు తపోనిష్ఠలను వెలసి పుణ్యవిచారా. ౨౮

వ. అని యుపదేశించి చనిన.

గీ. ఇట సుదర్శనుండు నీమట్టికుండల
నిచ్చి వండిపెట్ట మెచ్చుగాదు
మంటఁ జేసి మొదలి వంటనే కలిగొన్న
దానఁ దొలుత వండఁ దగుట యొప్పు.

మ. అని మృద్భాండము లెల్ల మాని సికతాయత్తంబు లౌ కుండలన్ ఘనుఁ డాపాయసశాకసూపముల పాకం బెప్పుడుం జేయుచుం దనియన్ బ్రాహ్మణభోజనంబు లిడుచుం దానొక్కనాఁ డప్పదార్థనికాయంబులు వండుచోటఁ జని తత్సామగ్రి వీక్షింపఁగాన్.

1. ఉ. ఆగతిఁ గుండ నిల్చిన ధరాధిపుఁ గన్గొని నారదుండు నీ
వీగతిఁ బుణ్యకీర్తి వెలయించుచు నిచ్చలుఁ దీర్పు సత్రము
ద్వేగములేక చేయు మని తెల్పి వియద్గతి నేగె నంతలోఁ
ద్యాగము భోగముం దగుసుదర్శనుఁ డచ్చటఁ దాను మెచ్చుచున్.

గీ. క్రొత్తకడవ దెచ్చుకొని వండి మఱి దాని, మీఁద వండిపెట్ట మెచ్చు గాదు
మంటఁ జేసి మొదల మంటనే కలిగొన్న, దానఁ దొలుతవండఁ దగుట యొప్పు.

క. వెస లుడుకం గని నృపుఁ డు
బ్బసమున నే నిట్టిఘనత వడసితి ననఁగా
నిసుమునఁ జేసినకుండలు
విసవిసలై విరిసెఁ బుణ్యవిపరీతగతిన్. 3౨

క. ఉలికి యతం డప్పుడు మదిఁ
గలఁగుచు నిటఁ గల్మషంబు గలసెనొ తను వి
ప్రులయెన్నిక గూడదొ హా
తలు మంత్రముఁ దప్పిరొకొ ధర గదలెనొకో. 33

మ. అనియుత్సాహవిహీనుఁ డౌచు నతిచింతాక్రాంతుఁ డై యుండఁగాఁ
దనయిచ్చన్మఁని తొంటిచాడ్పున వియద్భాగంబు శోభిల్ల వ
చ్చినఁ బూజించి మునీంద్ర నామహిమకుం జేటయ్యెఁ బో నీవు చె
ప్పినమర్యాదయు నేఁడు దప్పె నననం బృథ్వీశు బోధించుచున్.

క. మర్యాదఁ దప్పెఁ జిత్తవి
పర్యాసాహంకృతులను పార్థివ "గర్వా
త్కార్యం వినశ్యతి" యనుచు
నార్యులు మునుచెప్పునీతి యదితప్పగునే. 3౫

క. పర్వతపథమున రథమును
బర్వస్త్రీసంగమమున బ్రాహ్మ్యవ్రతమున్
గర్వమున ధర్మకార్యము
నుర్వీభాగమున నావయు న్నడవ దనా. 3౬

క. ఇంతమహిమ వడసితి నని
సంతసమున నీవు రాజసము గైకొన్నన్
సంతతముఁ జేయు సుకృతం
బింతయు నిట్లింకె నింక నే మనవచ్చున్. 3౭

ఉ. నాపుడు భూవరుండు మునినాయక నే నపరాధి నైతి నేఁ
డావిధ మేక్రియం గలుగు నానతి యి మ్మని ప్రొక్కినంత నా
దేవమునీంద్రుఁ డి ట్లనియె ధీరుఁడ వై మది నుబ్బు లేక భూ
దేవసపాదలక్షఁ బరితృప్తి యొనర్పుము భుక్తిముక్తులన్. ౩౮

క. బహుదినములు జరపఁగఁ ద
న్మహిమయుఁ జేకూరు నింక మనమున గర్వా
గ్రహము వల దనుచు శుభ మెం
దుహితంబుగఁ జెప్పి నారదుఁడు సనినంతన్. ౩౯

క. తాఁకిన మఱి వంగినక్రియ
నాఁకొని వడివందుకొన్న యనువున నృపుఁడుం
దేఁకువ సెడి తొల్లిటివ్రత
మూకొలఁదినె నిత్యసత్ర[1] మచ్చట జరిపెన్. ౪౦

ఉ. కావున నేన దాత నని గర్వము గైకొని పల్కు నీ వస
ద్భావుఁడ వైతి దానమును బౌరుషముం బరు లెన్నకుండఁగాఁ
దా వినిపించెనేనియు నతండుఁ దృణంబును నొక్కఁడె త్తగున్
ఙ్ఞానవర గంజిలో మెతుకు గల్గినఁ గ్రొవ్వుట నీమహత్త్వముల్.

గీ. అనుడు ఘనుఁడు భోజుఁడును మనంబున స్రుక్కి
బమ్మరిల్లి పసిఁడిబొమ్మ! నాదు
దాన మల్ప మన్నదానవు మీరాజు
దానమెంత చెప్పు దాన నిలుతు[2]. ౪౧

వ. అనిన సాలభంజిక యి ట్లనియె నతం డిట్టి మహావదాన్యుండు.

---

1. మూకొలఁదినె నిత్యసత్ర మచ్చట—చిన్నయసూరిగారి పాఠము. మూకలసత్రంబు లంగినచ్చట—ఇతరప్రతులలో— 2. దాన మెంత నీవు దానిఁదెలుపు. చి. సూరిగారు. దాన మెంత నేర్పు—

క. పొడగన్న ంతనె వేయును
నొడివినఁ బదివేలు నగిన నూఱ్వేలు మనం
బొడఁబడి మెచ్చినఁ గోటియు
నడిగెడువారలకు నిచ్చు హాటకమయముల్. ౪౪

మ. అది యెట్లన్న నతండు కీర్తి దిశలన్ వ్యాపింప భూమండలం
బుదధుల్మేరగ నేలుచుండి యొకనాఁ డుర్వీశులు న్మంత్రులున్
సుదతీరత్నములున్ రసజ్ఞులుఁ గవిస్తోమంబులుం గొల్వ న
త్యుదయశ్రీఁగొలువిచ్చియుండఁగఁ గవీంద్రుండొక్కఁడే తెంచుచున్

[1]సీ. దండకారకాధిపోద్దండభుజాదండ
భూరివిశ్వంభరాభారధుర్య
జంభారిపరికీర్తితాంభోజినీమిత్ర[2]
సూనుసమాహీయదానరాయ
అక్కిణహృదయ దండొక్క కేళిః
క్కేళిపతివశకణీవళిఃపక్కడక్క
అంకక్కరిక్క మహోలదసాందన
లవలవప్పహిత తులఃకధీర
ధీరసంపదస్తు దేవబంధకహామ[3]
దశకసాక్కు మోరిదర్శనిచయ
యనుచునాల్గుభాషలనురాజుదీవించి
నయనసంజ్ఞ నాసనమున నుఁడి ౪౫

సీ. శాకేంద్ర యాఅక్షరములపేరిటివాఁడ
నాద్యక్షరము మాన నశ్వవేది
రెండక్షరములఁ బరిత్యజించిన నాట్య
కర్త మాఁ డుడిపిన గతవిదుండ

1. ఈపద్యములోని ప్రాకృతభేదములు తెలియవచ్చుటలేదు. పద్యములోని తప్పొప్పులు తెలియలేదు. ఎవ్వరియొద్దనైనఁ బ్రతియున్నచో దిద్ది సవరించి మాకుఁబంపఁ బండితులం గోరెదము. 2. యంభోరుణీమిత్ర. 3. దేవబంధకహోదు.

నాలుగు నుడిగింపఁ జాలనేర్పరి నైదు
విడిచిన బుధుఁడ నీవిధము గాక
సర్వాక్షరంబులుఁ జదివిచూచిన బుద్ధి
బలముగాఁగల యట్టి ప్రౌఢుఁ డనఁగ

నేతిబీఱకాయనీతి గాకుండంగ
నిన్ని విద్యలందు నెన్నఁబడ్డ
సార్థనాముఁ డైనయర్థిగా నెఱుఁగుము
విబుధపంకజార్క విక్రమార్క. ౪౭

గీ. అనినఁ గ్రమ్మఱఁ జదివించి యల్లనవ్వి
ధరణిలోనీవు "చతురంగతద్జ్ఞ" సంజ్ఞఁ
బరఁగినాఁడవ యనుఁడు భూపాలుఁబొగడి
యెలమిఁ జతురంగతద్జ్ఞ కవీశ్వరుండు. ౪౮

క. ఇది తగుఁ దగ దనక కళా
విదులకు నీసమ్ముఖమున విద్యలయెఱుకం
బొదవెట్టుట హనుమంతుని
యెదుర నెసం గుప్పిగంతు లెగయుటచుమ్మీ.[1] ౪౯

ఉ. అంబుజమిత్రతేజ భవదగ్రకరప్రసృతంబు లైన దా
నాంబువులందుఁ బుట్టి భువనాంతము నిండుచుఁ గీర్తిపుండరీ
కంబు ప్రతాపసూర్యుఁడు వికాస మొనర్పఁగ నాకసంబు భృం
గంబుగ లోనఁ బూని యధికం బగువాసన నొప్పు నెప్పుడున్.

క. అని చెప్పినపద్యములోఁ
దనకీర్తివ్యాప్తియుం[2] బ్రతాపస్ఫురణం
బును గని భాండాగారికుఁ
గనుసన్నం బిలిచి మెచ్చుగా నాతనికిన్. ౫౧

---

1. గుప్పిగంతులేయుటచుమ్మీ. 2. దనకీర్తియువ్యాప్తియు.

క. ధనమిప్పించె విలోకన
మునకుం బలుకునకు హసితమునకుఁ గవికి వే
యును బదివేలును లక్షం
బును గోటియుఁ బసిఁడిటంకములు చొప్పలుగాన్. ౫౨

క. ఘనుఁడు కవి వీడుకొని యొ
య్యనభాండాగారిఁ బిలిచి యర్థి ననుం జూ
చినఁ బలికించిన నవ్విం
చిన మెచ్చించినను నిట్ల చెప్పక యిమ్మా.[1] ౫౩

చ. అని సెలవిచ్చినన్ ధనగృహస్థితుఁ డొ తనలెంక యిట్టిచొ
ప్పున నొసఁగంగ యాచకులు భూజనకల్పమహీజ మంచు నిం
పునఁ బొగడంగ దానగుణభూషణుఁ డంచు నవంతినాయకుం
డనుదినమున్ యశంబు దిశలం దలర న్మహి యేలె నెంతయున్.

క. అదికారణముగ నతనికి
సదృశం బగుగుణము నీకుఁ జాలదు భువిలోఁ
బొదలని పెద్దటికంబులు
పొదపెట్టక[2] మగిడి పొమ్ము భోజనృపాలా. ౫౫

వ. అనుడు ననంతరంబ. ౫౬

శా. లగ్నం బీక్రియ విఘ్న మొందిన నిరాలాపంబుగా విస్మయో
ద్విగ్నస్వాంతనృపాలపౌరహితవంది వ్రాత మీక్షింపఁగా
భగ్నోత్సాహమనోరథుం డగుచు భూపాలుండు లజ్జాభరా
భుగ్నాస్యాంబుజుఁ డొచు నింటి కరిగెం బుణ్యాం బగణ్యంబుగన్.

వ. అంతఁ గొంతకాలంబున. ౫౮

1. చినఁ బలికించిన మెచ్చిం చిన నిట్లని పీవు నాకుఁ జెప్పకయిమ్మా.
2. పొదపెట్టక—రర.

## రెండవబొమ్మకథ

క. మొలఁ బులితోలును మేనం
బలుచని వెలిపూఁత యఱుతఁ బాములపేరుం
దల మిన్నేఱును జడలను
జలివెలుఁగుం గలుగు మేటిజంగముఁ గొలుతున్. ౫౯

సీ. అనుచుఁ గడంకతో నాభోజతిలకుండు
దివ్యాసనం బెక్కఁ దివిరి మఱియు
ఫలకుసుమాదిశుభద్రవ్యములు గూర్చి
సర్వపూజలుఁ దొంటిజాడఁ జేసి
కవిరాజభూసుర గాయకపాఠక
నర్తకులును దనకీర్తి పొగడఁ
బసిఁడిగిన్నియలు చేపట్టి పుణ్యస్త్రీలు
శిరమున మౌక్తికశేష లిడఁగ

ఖడ్గహస్తుఁ డగుచుఁ గదలి నృపాసన
ప్రాంతభూమి చేరె గ్రహబలంబు
గలుగువేళఁ బూర్ణఘటికాంతనాదంబు
చెవుల సోఁకినంత శీఘ్రగతిని. ౬౦

క. శింజాయితమంజీర
వ్యంజితనీలాంశుభృంగ మగు పదకంజం
బంజక యిడఁగా వేళా
భంజని[1] యై యచట సాలభంజిక పలికెన్. ౬౧

క. ఓహో భూవర వలవని
మాహాలివి[2] యేల విక్రమార్కునిసరిగా
సాహసమును గంభీరో
త్సాహంబును లేక యెక్కఁ దరమే నీకున్. ౬౨

---

1. భంజిక-చిన్నయసూరి. 2. వలదుసుమాహాలివి. యాహాలివి-చిన్నయసూరి.

గీ. అనుడు నిలిచి భోజుఁ డాత్మగుణంబులు
చెప్పఁ జూచి మొదలితప్పుఁ దలఁచి
మాని నాఁటిబొమ్మపూనిక నీవును
దప్పకుండఁ జెప్పు తద్గుణములు. ౬౩

క. అనవుడు నది యిట్లను నీ
గొనములు గలనృపులఁ బేరుకొని చెప్పం జూ
చిన జగమున నుజ్జయినీ
మనుజేంద్రుఁడుగాక యితరమనుజుఁడు గలఁడే. ౬౪

క. శుభలక్షణుఁడు వదాన్యుం
డభయుం డీఁకఁ గలుగనేర్చునయ్య "నభూతో
నభవిష్యతి" యనుపలు కా
ప్రభునకు సరిచెప్పుచోటఁ బలుకఁగవచ్చున్. ౬౫

శా. ధారానాథ యనాథసస్యములకున్ ధారాజధారాధరా
కారుం డై కరుణామృతంబు గురియంగాఁ బ్రాజ్యసామ్రాజ్యల
క్ష్మీప్రౌఢిం జగ మెల్ల నుల్లసిలఁగా శ్రీవిక్రమార్కాఖ్యుఁ డు
ర్వీరామారమణుండు కీర్తిఁ బరఁగెన్ వీరుం డుదారుం డనన్.

మత్తకోకిల. అమ్మహీశుఁడు నాఁడునాఁటికి నాత్మభూముల నన్యదే
శమ్ములందుల వార్తలం బరిచారకు ల్వినిపింపఁగా
నిమ్ముతోడ నవంతిపట్టణ మేలుచుండఁగ దూరదే
శమ్మువార్త లెఱుంగఁబోయినచారు లిద్దఱు వచ్చినన్.

ఉ. అచ్చటివార్త లెల్లఁ దెలియ న్విని వారల నాదరించి మీ
రిచ్చటి కేగుదెంచునెడ నీనడుమన్ గిరులందుఁ గానలం
దచ్చెరు వేమి గంటి రని యానతియిచ్చిన నందులోన న
య్యచ్చ రెఱింగి యొక్కఁడు నరేంద్రున కిట్లనియె న్వినీతుఁడై.

సీ. చిత్రకూటాద్రిపైఁ జిత్రంబు గనుఁగొంటి
నచటి బిల్వద్రుమప్రచుర మైన
పుణ్యతపోవనంబున రత్నకాంచన
మయ మైన దేవతాలయము గలదు
లోకైకవంద్య మందాకినీజలధార
తోరమై ముందటఁ దొరఁగుచుండు
నానీరు శుద్ధిపై నమృతంబుననఁ బోలుఁ
బాపిపైఁ గాటుకభంగిఁ దోఁచు[1]
దానిపొంత నొకఁడు మౌనియై జపముతోఁ
బాయకుండ వేల్మి సేయుచుండు
నతని కెన్ని యేఁడు లరిగెనో యొలికిన
హోమధూళి హిమనగోన్నతంబు. ౮౦

మ. అని చోద్యంబుగఁ జెప్పిన న్విని తదీయాలోకనోత్సాహియై
మనుజేంద్రుండును దిగ్గనం గదలి రమ్మా చూత మాహాని పా[2]
వనతీర్థం బని వానిఁ దోడుకొని భాస్వత్ఖడ్గసాహాయ్యుఁడై
చనియెం గ్రూరమృగప్రచారతరువిస్తారంబులం దూఱుచున్.

వ. ఇట్టి దుర్గమమార్గంబునం జనుదెంచుచు నొక్కయెడ. ౮౧

ఉ. భూరమణుండు గాంచె నతిభూరిపయోధరఘాట మాత్మవి
స్తారిపృసత్ప్రరూఢపటుశాఖమహావటజూట మంచితో
ర్వీరుహసంభృతైకమునివీరకృతోటజవాటము న్సునా
సీరమణిప్రభాపటలచిత్రితకూటముఁ[3] జిత్రకూటమున్. ౮౨

సీ. అంచులతీఁగె లింద్రాంగణాగములతోఁ
చెలిమిసేయుచు మిన్నుగలయఁ బ్రాఁకు
నందుఁ బ్రమాఁకులు నందనవనకల్ప
తరువులతోఁ గూడి పెరుఁగుచుండు

---

1. శుద్ధున కమృతమై పొలుపారుఁ బాపికిఁగాటుకభంగిఁదోఁచు–ఆనీరు పుణ్యుల కమృతంబువలెనుండు-చిన్నయసూరి. 2. చూత మాదివ్యపావన. 3. చిత్రవనాటము.

నందుల క్రొవ్విరు లన్నదమ్ములమాడ్కిఁ
జుక్కలవాసన కిక్కసేయు
నందుల సెలయేఱు లాకాశగంగతో
నటనలు సలుపుచు నాడుచుండు

నందుల మెలఁగుకరు లైరావతముఁ దామఁ
గదుపుగట్టి మేసి మదము గురియు
నందుఁ గలుగు మౌను లాసప్తమునులతో
నిత్యసత్యగోష్ఠి నిలుతు రచట.

ఉ. అందుల నొక్కచో జలకమాడుచునుండఁగఁ దొల్లి మేదినీ
నందనవక్త్ర వేణినయనస్తనకాంతులు జాతిరూపులై
యిం దుదయించె నాఁగ నుతికెక్కుచుఁ బెక్కుదినంబు లంబుజేం[1]
దిందిరమీనచక్రములు దేలుచునుండు సరోవరంబులన్. ౭౪

క. వివిధద్వాదశరాసులు
దవిలి తిరిగి పాళ్ళసంపదలు చేకుఱమి
న్నవరత్నరాసులకునై
నవగ్రహంబులుఁ దదంగణంబులఁ బొలయున్. ౭౫

క. వింతలుగా నగ్గిరిపొడ
వింతం తని చెప్ప నలవి యే వెన్నెలఁ ద
ద్ప్రాంతంబునఁ గరఁగినశశి
కాంతంబులు చంద్రుకందు గడుగుచు నుందున్. ౭౬

సీ. శిరమున విమలపుష్కరవతి యగుమాల్య
వతి రత్నమాలికావతి యనంగ
మృగపాదఘట్టన మృదుల హాటకేగుఱు
ధూళి శేఖరితసిందూర మనఁగఁ

1. నుతికెక్కు దినంబులయందు నంబుజేం

ప్రబలసమీరణోత్పతితంబు లైన పు
ష్పంబులు కరశీకరంబు లనఁగ
సర్వతోముఖసముచ్చాలనవారి[1]ని
ర్ఘరములు మదజలస్రావ మనఁగఁ
దన్నుఁ జేరినమేఘముల్ మన్ననంగ[2]
సాలతరువులు బర్హాధ్వజము లనంగ
నేచినీరాజ్యపట్టగజేంద్రులీల[3]
నిలిచి పొలుచు నయ్యచలంబు నృపతిమెచ్చె.[4] ౨౭

శా. లంకేశారిపదాంకితంబులు ఝురాలంకారకూలంకషల్
పంకేజాకరసంకులాంతరములం బ్రవ్యక్త దివ్యాంగనా
సంకేతంబులు మీనకేతనధనుష్టంకారశంకావహో
ఝుంకారాళికులంబులుం గల మహాశైలస్థలుల్ చూచుచున్. ౨౮

క. ధారాధరమార్గాగత
ధారాళం బగుచు ధరణిధరమధ్యకృతా
ధారంబై ధరఁ బరఁగిన
ధారాతీర్థంబు గనియె ధారాధీశా. ౨౯

వ. కనిన నితని మనఃప్రసాదంబు దట్టంబై నిలిచె. ౩౦

క. దుర్మార్గునకైన మహా
ధర్మస్థలి నాత్మశుద్ధి దలకొను ననఁగా
ధర్మంబుల కాకరమా
నిర్మలునకుఁ జిత్తశుద్ధి నిలుచుట యరుదే. ౩౧

---

1. చ్ఛాలనలోలి 2. వన్ననంగ 3. ఉజ్జయినిరాజు పట్టగజేంద్రలీల-ఈపాఠము యతిచెడినది.
4. ఇక్కడ వ. "అచటఁ దెరువుఁజూపుచు మావంతు క్రియాహరుండు చూపమున్నుగానతండు చని చని" అని యొకదానిలోఁగలదు.

భుజంగప్రయాతము. అతం డంత సుస్నాతుఁడై రత్నహేమాం
చితం బై సువర్ణాద్రి చెల్వొంది దేవా
న్వితం బైన హర్మ్యంబు వే సొచ్చి యాదే
వతం గాంచి పూజించి వచ్చె న్నతుండై. ౨౨

గీ. అచటిహోమశాల కరిగి మౌనంబునఁ
దపము కలిమి దోఁప జపముతోడ[1]
మధురయుతము లైనమారేడుఁబండుల
వేల్మి సేయుచున్నవిప్రుఁ జూచి. ౨౩

గీ. అన్నపుష్పఫలజలాక్షతాదులు చేత
నున్నవాఁడును[2]జపహోమములను
జేయువాఁడుఁ బ్రణతి సేయఁదగరు గాన[3]
మనుజవిభుఁడు మ్రొక్కమాని పలికె. ౨౪

క. ఓవిప్రోత్తమ సవనం
[4]బీవెరవున జరుగ నెన్ని యేఁడులు చనియె
న్నావుడు నుబ్బస పుచ్చుచు
నావిధిచేఁతలకు నేమి యనఁగల దధిపా. ౨౫

ఉ. ఇచ్చట నేండ్లు నూఱు సనియెన్ జగదంబిక నాయవస్థకు
న్మెచ్చదు కూడు మాని రవి మీఁదఁ దపింపఁగ వేల్మి సేసి ము
చ్చిచ్చున వెచ్చుచుండి తెగఁ జిక్కితి నన్నుఁ; గృపానువృత్తిఁ దా
నచ్చటివాని లేపి విహితాసనుఁడై నృపుఁ డాత్మనిష్ఠతోన్. ౨౬

క. వ్యాలోలకరాళకజి
హ్వాలం బగు సప్తజిహ్వవదనంబున భూ
పాలుఁడు మధుమిశ్రిత మగు
మాలూరఫలంబు వేల్చె మంత్రముకోలఁదిన్. ౨౭

1. ఘనతపోవిభూతికలిమి మెఱసి. 2. నున్నతనికిని. 3. జేయునతనికి నతి చేయఁ దగదుగాన. 4. హవనంబీవెరవున.... ....నావుడు నుబ్బసగొట్టుచు-చిన్నయసూరి.

వ. అట్లు హోమంబు గావించిన నయ్యుమ నెమ్మనంబున నమ్మిక పొడమి పొడసూపకున్నం గడచూపుసం గెంపుగదుర మదిం బదరి దొరకొన్న కష్టం బుజ్జగించుట యుజ్జగంబున నొజ్జల లజ్జ లుడుపు రజ్జులనుచు నుజ్జయిని ఱేఁడు మారేఁడుఁబండు మాని తన మెడం జూచి.

గీ. పలుకుఁ దేనియ గలతలపండు వ్రేల్వఁ
దలఁచి తలచిక్కు చక్కమీఁదటికిఁ[1] జెరివి
యెడమ కేలఁ దెమల్చుచు నడిద మెత్తి
మెఱుఁగుమిడుఁగుఱుఁ లెగయుగా మెడకుఁబూనె. ౮౯

వ. ఇట్లు పూని యుంకించిన. ౯౦

క. ఓహో నృప నీధర్మో
త్సాహములకు మెచ్చితిని నిజం బిది యిఁక నీ
సాహసము విడువు మని త
ద్బాహాఖడ్గంబు వట్టెఁ బరమేశ్వరియున్. ౯౧

క. పట్టి నిలుచుండి నృప నీ
కెట్టిహితం బైన వేఁడు మిచ్చెద నని చే
పట్టిన మ్రొక్కి మహీవరుఁ
డి ట్టనియెం దల్లి మెచ్చి తెట్టులు నన్నున్. ౯౨

మ. ఇతఁడు స్నానము సంధ్యయున్ జపము ని ష్ఠైకాలముం జేయఁగా
శతవర్షంబులు పోయె నీద్విజుని మెచ్చం జెల్లదో మెచ్చుసం
గతి గాదో గుణ మానతి మ్మనిన నోక్ష్మాపాల యీదుస్తర
వ్రతము ల్గల్గియుఁ జంచలంబు మతి భావం బల్ప మెప్పట్టునన్.

గీ. మేరుశైలధీర మేరులంఘితమున
నాగుఁ నీవ్రతంబు నగణితంబు[2]
చంచలాత్మకృతము సంకల్పరహితంబు
నైన జపము లెల్ల హానిఁ బొందు. ౯౪

1. చెక్కుమీఁదటికి. 2. మేరుసమానమౌ, ఘనతపంబులొవగణితమైన.

క. దేవర భువిఁ గాష్ఠంబున
గ్రావంబునఁ గాంచనమునఁ గలుగఁడు శుచియై
భావమునఁ గలుగ నేర్చును
భావజ్ఞా భావశుద్ధి పరమార్థ మనన్.[1] ౯౫

క. డెందంబున సందేహము
నొందక ప్రహ్లాదుతండ్రి నొడఁబఱిచెడు చో
నిందుఁ గలఁ డనినఁ గంబము
నం దుదయింపండె విష్ణుఁ డసురులు బెదరన్. ౯౬

క. దేవద్విజమంత్రౌషధ
దైవజ్ఞాచార్యతీర్థధర్మముల యెడన్
భావన యేవిధమున నా
నా వెరవున నచటి సిద్ధి యగునిద్ధగతిన్.[2] ౯౭

గీ. భావ మస్థిరంబు గావున వీనివ్ర
తంబులెల్ల నిష్ఫలంబు లయ్యె
నీవు నిష్ఠ నిట్లు గావించితివి గాన
గడియలోన మెచ్చు గలిగె నీకు. ౯౮

క. ధన్యుఁడ వనవుడు విని స
త్కన్యాదానమును దేవతావరమును రా
జన్యవరాజ్ఞయుఁ దిరుగుట
యన్యాయము గానఁ దిరుగ కంబిక వినుమా. ౯౯

ఉ. ఇష్టములెల్ల నాకుఁ దగ నిచ్చెద నంటివి సర్వముక్త వ్రత
భ్రష్టుఁడు నాక వీనికిఁ గృపామతి నిమ్మని మ్రొక్కినంత సం
తుష్టి వహించి దేవత చతుశ్శతవత్సరభోగ్యమైన యు
త్కృష్టమహీపతిత్వమును దివ్యపదంబును నిచ్చె వానికిన్. ౧౦౦

1. పరతత్త్వ మనన్. 2. సిద్ధక్రియన్.

క. వానికి ని ట్లిచ్చి ధరి
శ్రీనాయకుఁ బరిణమించి దేవియు నంత
ర్ధానమ్ము నొందె విప్రుఁడు
నానృపు వెఱఁగంది పొగడి యరిగె నిజేచ్ఛన్. ౧౦౧

శా. తత్సేవాఫలదర్శనంబున మహాత్ప్రస్థాన విశ్రాంతిగా[1]
నుత్సాహంబును సాహసంబును బ్రతాపోదారభావంబు న[2]
త్యుత్సేకంబును భూషణాకృతులతో నొప్పారఁగా భూపతీ
వాత్సల్యంబున వచ్చె విక్రమయశోవర్ధిష్ణుఁ డుజ్జేనికిన్. ౧౦౨

వ. కావున నీ కిట్టి గుణంబులు సమకూరకునికి నెక్కఁజనదు పొమ్మ
నిన విని భోజుండును మనంబున నతనిం గొనియాడుచు నుద్విగ్న
తలగ్నుం డై[3] సిగ్గుపడుచుఁ బూర్వద్వారగమనంబు మాని యపర
ద్వారగమనోత్సుకుం డగుచు నాఁటి కద్దివ్యాసనం బెక్కఁజాకుం
డుట తెల్లంబుగా మొగంబు తెల్లంబడఁ దిరిగి చని మఱియొక్క
నాఁడు. ౧౦౩

—♦ మూఁడవబొమ్మకథ ♦—

క. ఉల్లోలదుగ్ధసాగర
కల్లోలకరాగ్రమందకంపితఫణభృ
ద్వల్లభమణిమయడోలా
వేల్లనసుఖలోలుఁ డైన వేల్పుం దలఁతున్. ౧౦౪

క. అని నియమంబున హితశా
కునికస్వరశాస్త్రవేదకోవిదయుతుఁ డై
యను వగుదినమున సింహా
సన మెక్కఁదలంచి భోజజనపతి చేరెన్. ౧౦౫

1 దదధ్వశ్రాంతిగాఁ జిత్తమందుత్సా. 2. గర్వోత్సేకంబున. 3. విఘ్నితాలంఘిత
కాలజ్ఞుండై.

క. చేరిన నచ్చటిపుత్రిక
యూరాజుం బలికె వాసవాసన మెక్కం
గోరుట జగ మెఱుఁగ మహా
దారిద్ర్యుఁడు క్రతువుసేయఁ దలఁచుటచుమ్మీ. ౧౦౬

ఉ. ఆర్యులఁ గూర్చి నేఁడు శుభమైన ముహూర్తము చూచి వట్టిగాం
భీర్యము దోఁపఁగాఁ దగని పెద్దతికం బిది యేల సన్నపుం
గార్యమె విక్రమార్కనృపుగద్దియ యెక్కుట వానిఁబోల నౌ
దార్యము నీకుఁ గల్గినఁ బదం బిడు మోజగ భోజభూవరా.

వ. అనుడు విస్మయమానమానసుండై మానవేంద్రుం డాసింహాసన
యానంబు మాని యనుమానించి మీనరపతివితరణంబు లే తెఱం
గెఱింగింపు మనిన నది యిట్లనియె. ౧౦౮

సీ. బలమున నిజమునఁ బ్రాణరక్షణమున
భీము భీమాగ్రజు భీమగురునిఁ
జెలువున సంకల్పసిద్ధిఁ దేజంబునఁ
బద్మారిఁ బద్మజుఁ బద్మమిత్రు
శివభక్తిఁ గీర్తి విశిష్టదానంబున
బాణు బాణారాతి బాణజనకు
నైశ్వర్యమున రతి నఖిలోత్సవస్ఫూర్తిఁ[1]
గామసంహారుఁ గాముఁ గామసఖుని

నష్టభోగముల రణాటోపమున బుద్ధి
నింద్రు నింద్రతనయు నింద్రమంత్రిఁ
గ్రేణిసేయు ననుచు జాణలువొగడంగ
నవని యేలె విక్రమార్కవిభుఁడు. ౧౦౯

1. నఖిలలోకస్ఫూర్తి.

క. సాహసము జయము బల ము
త్సాహంబుఁ బరాక్రమంబు ధైర్యముఁ గలని
ర్మోహకుని దొరయు నెడ సం
దేహించుచునుండు నాదిదేవుం డైనన్. ౧౧౦

క. నరుఁడు మగతనము నేర్పునఁ
బరఁగించెడుచోటఁ దోడుపడుదురు సురలున్
ధర గాలికునకుఁ దోడ్పడ
గరుడఁడు జక్రంబు హరియుఁ గలిగినభంగిన్. ౧౧౧

క. అనవుడు భోజుఁడు గాలికుఁ
డనువానికి నెచట విష్ణుఁ డాయుధమును వా
హనమును దోడ్పడియెను నే
వినవలతుం జెప్పు మనిన నెస నిట్లనియెన్. ౧౧౨

గీ. తుంగసౌధశృంగసంగతాంబర మాచుఁ
బూర్వభూమి నొక్కపురవరంబు
భజన కెక్కి మున్ను నిజమైనపేరిట
వెలసెఁ భువిఁ బ్రతాపవిషయ మనఁగ. ౧౧౩

వ. అట్టిపురంబున. ౧౧౪

క. సేనానికి నెన యనఁ బర
సేనాభంజకుఁడు గలిగె క్షితిపతి విష్వ
క్సేనారాధకుఁడు బృహ
త్సేనాఖ్యుఁడు బల్మి భీమసేనుఁడు వోలెన్. ౧౧౫

వ. ఆనరేంద్రునకు నానందిని యనుసుందరియందు నయనానందం
బుగా నొక్కనందన యుదయించె. ౧౧౬

క. ఆరాజతనూభవ క
న్యారత్నము మరుని మోహనాస్త్రము క్రియ నా
కారంబున నొప్పుచు ధర
లో రూఢికి నెక్కె నది సులోచన యనఁగన్. ౧౧౩

క. భూవలయంబున నుపమా
జీవన మగు వస్తు వేర్చి చెప్పెద మనఁగా
నావెలఁది యవయవములకు
నేవియు సరిగాక యునికి నేమనవచ్చున్. ౧౧౪

సీ. మృదుపల్లవంబులు ముదురక యుండినఁ
బదసరోజములసంపదలఁ బోలుఁ
గరికరంబులమేనఁ గర్కశభావంబు
లేకయుండిన నూరులీలఁ బోలుఁ
జక్రవాకంబులు సడిసన్న రేయెల్లఁ
బాయకుండినఁ జనుదోయిఁ బోలుఁ
జుక్కలఱేఁడు దా స్రుక్కక పొంగక
కందకుండిన ముఖకళలఁ బోలుఁ
జంచరీకచయము సంచలింపక కూడి
నిలిచెనేని కురుల చెలువుదాల్చుఁ
బువ్వుఁదీఁగె మొదలిమవ్వంబు దప్పక
ననిచెనేని మేనియనువుఁ బడయు. ౧౧౫

మ. తనలావణ్య మగణ్యదర్పమయమై తారుణ్యపూర్ణంబుగా
ననవద్యద్యుతితోడ నానృపతికన్యారత్న మేరాజనం
దనుల స్వేచ్ఛక మీఁది మేడకడ గంధర్వాంగనావిభ్రమం
బున నుండెన్ మృదువస్త్రగంధసుమనోభూషాదిభోగంబులన్.

సీ. తరుణి యీయాక్రియ మేడఁ దరలకుండుటయును
దెలిసి గాళిసుఁ డనుధీరవిటుఁడు
ఛాయలయుక్కనఁ జక్రంబు గావించి
కాష్ఠయంత్రంబున గరుడిఁ జేసి
తావిష్ణుఁడై మన్మథప్రధనమునకు
మెఱపుగాఁ గస్తూరి మిగుల నలఁది
పసపువన్నియ పట్టువసనంబు గావించి
తిరునామ మొప్పఁగాఁ దీర్చి కడఁక

నెక్కి కీలున వాహన మెగయఁజేసి
పవనపథమునఁ జనుదెంచి బాలమ్రోల
నిలిచి నేనిదె కృష్ణుఁడ నిన్నుఁగూర్చి
వచ్చితిని నన్ను వరియింపు లచ్చికరణి. ౧-౨౧

చ. అనవుడు బాల విస్మయము హర్షము లజ్జయు నగ్గలింప నా
తని నట నుంచి యేగి తనతండ్రికి నట్టితెఱం గెఱుంగఁ జె
ప్పిన నతఁడు ప్రియంబున నభీష్టము నేఁ డొనఁగూడఁబోలు నీ
కని చనుదెంచి యచ్చట గవాక్షముఖంబునఁ జూచి యుబ్బుచున్.

క. చల్లనికొండకు గిరిజా
వల్లభుఁ డల్లుఁ డగు నట్టివడువునఁ దల్లీ
నల్లని దేవర నీచే
నల్లుఁ డనఁగఁ గలిగె నేఁ గృతార్థుఁడనైతిన్. ౧-౨౩

క. అమ్మా తడయక కైకొను
సొమ్మా యని యనుప నేగి పొలఁతుక యచటన్
నెమ్మి దలఁకొత్తఁగాఁ దన
నెమ్మన మలరంగ నాతని న్వరియించెన్. ౧-౨౪

ఉ. గాళికుఁ డయ్యెడ న్మది వికాసము హాసముఁ గూడియాడఁగా
బాలిక నంతనంత మృదుభాషణభూషణతోషణంబులం
గేలికిఁ జేర్చి లజ్జ కడకీ లెడలించుచు బుజ్జగించి పాం
చాలునిపోలిక న్సురతసౌఖ్యము తీపులు చూపె నేర్పునన్.

ఉ. అజ్జలజాక్షియున్ హృదయమందునఁ బుట్టినవానిపోటుచే
బుజ్జవ మియ్యకోలు గొనుపొందునఁ గూడిన నింపు గైకొనున్
సెజ్జకుఁ దాన చేరు రతిచేష్ట లెఱుంగఁగడంగు చెయ్వులన్
లజ్జ యొకింత చేప్పడఁ జెలంగుఁ బెనంగు ననంగకేళిమై. ౧౨౬

క. ఇటు నానాఁటికి నొయ్యనఁ
గుటిలాలక యలుకు దీర్చుకొనుచుం దనకొఁ
గిట నాదటఁ జెలఁగఁగ న
విటుఁడు న్సమరతుల గారవించుచుఁ దివుటన్. ౧౨౭

సీ. అంగుష్ఠ మడుగు గుల్ఫాంతంబుఁ జిఱుదొడ
జఘనంబు నాభి వక్షంబుఁ గుచము
భుజమూలములు గళంబును జెక్కు మోవియు
నయనము ల్నుదురు ముందలయున సఁగఁ
గలుగుచోటులఁ జంద్రకళలఁ బెంపునఁ జెక్కు
నారోహణావరోహణము లెఱిఁగి
బీజమంత్రోక్షతవ్యాజహృద్భావముల[1]
హృదయాదిమర్మంబు లెక్కఁ జేయు

సుఖముఖాంకనఖరచుంబనభూషణ
గ్రహణతాడనములఁ గదలఁబొడిచి
చిత్తశయను దెలిపి యుత్తానశాయిత
ముఖ్యసురతతంత్రములఁ గలంచె. ౧౨౮

1. దృగ్ఘ్రాణముల్ హృదయాదిమర్మవాహకులఁ జొనిపి.

క. మనసిజమర్మజ్ఞునితో
మనమలరఁగఁ బెనఁగి కరఁగె మానిని రతిసం
జనితసుఖంబున నెలపొడు
పునఁ గరఁగెడుచంద్రకాంతపుత్రికఁ బోలెన్. ౧౨౯

శా. ఆజాడం గుచచక్రవాకరుచి పెంపారం దదీయాననాం
భోజాతప్రభ లుల్లసిల్లఁగ సముత్ఫుల్లాక్షి[1] మీనద్యుతుల్
రాజిల్లంగ సులోచనాసగసిలో రాయంచభంగిం గళా
భ్రాజిష్ణుం డగు గాళికుండు వారిరూపం బొంది క్రీడించుచున్.

ఉ. ఇమ్మెలఁ గొన్నియేండ్లు సుఖియింపఁగఁ దక్షిణరాజులెల్లఁ జో
ద్యమ్ముగ నిట్టివార్త విని యచ్యుతుఁ డీతని యల్లుఁ డయ్యె[2]గ
ర్వమ్ములు మాని వీనిఁ గొలువం దనంచు భయమ్ముతోఁ దురం
గమ్ములఁ గుంజరమ్ములను గన్యలఁ గప్పము లిచ్చి పంపఁగాన్.

క. చేకొనుచు బృహత్సేనుఁడు
చేకొలఁదుల లోఁగు బెట్టఁగి క్షితిపాలకులం
జీకాకుపఱిచి భూములు
చేకొనఁగా నలఁగి తలఁగి సిగ్గున నొకచోన్[3] ౧౩౨

వ. అందఱుం గూడుకొని విచారించుచుం దమలోన. ౧౩౩

క. సమముగ దేశము లేలుచు
నమరిన మగకూడు గుడిచి యథమాధమభా
వముతోఁ బెక్కండ్రొక్కని
సమరమునకుఁ బోక యునికి[4] చచ్చుట గాదే. ౧౩౪

1. పెంపారంగ కుంభస్మఖాం భోజంబు ల్వికసింపుచుం జెలఁగ నుత్ఫుల్లాక్షి. 2. డీతని కల్లుఁడంచుగర్వ- 3. నైకొనుచు. 4. జోరకయునికి.

క. గణుతింప మానభంగ
ప్రణ మాజన్మంబు నెడ్డ ప్రయ్యాలుసేయుఁ
రణమరణము శూరులకును
క్షణదుఃఖము మీఁద నధికసౌఖ్య మొనర్చుఁ. ౧౩౫

గీ. మానహాని హైన మనస్తోపకం బెను
[1]ప్రాణహీన మైన పదము లేదు
వీనిచేత బాధ వెచ్చుటకంటెను
చక్రధరునిచేతఁ జచ్చు టొప్పు. ౧౩౬

క. రావణకంసాదికర
క్షోవీరులఁ జంపి తన్నుఁ గూడఁగనిచ్చెం
గావున సమములు నల్లని
దేవరకోపములు నట్టిదేవరవరముల్. ౧౩౭

సీ. మున్నీటిపాపయు మున్నీటితేపయు
నిల్లాలు నిల్లునై యొసఁగువానిఁ
బాములపగవాఁడుఁ బాములవగవాఁడుఁ
దేరునుబాన్పునై తేరువానిఁ
గలువలచుట్టంబుఁ గలువలనెట్టంబుఁ
దనరెండుకన్నులై తనరువాని
బూవింటివాఁడును బూవింటివాఁడును
గారాపుసుతులుగాఁ[2] గలుగువాని

జోడు లేనికంటిజోగికి జోడుగా
నున్నవానిఁ బెక్కు మన్నవాని
దల్లి దండ్రియైన నల్లనివేల్పును
గంట చెడనిముక్తి పంట గాదె. ౧౩౮

1. అవనిమానవహానియగుస్త్రోవ. 2. గారాపుఁబట్టులై. గట్టియైపట్టియైతలుగువాఁడు. చిన్నయసూరి.

క. చొత్తము చత్త మనుచు ను
ద్వృత్తు లగుచుఁ దెగి ప్రతాపవిషయముపై దం
డెత్తి చనుదెంచినం గని
యత్తఱిఁ దా వెడలె నాబృహత్సేనుండున్. ౧౩౯

చ. వెడలి నిజాస్త్రసైన్యపరివేష్టితుఁడై చని గర్వపాటవం
బడరఁగఁ బోరిపోరి బల మంతయుఁ జచ్చినఁ జిచ్చులోపలం
బడి వడిఁ దూలివచ్చు శలభంబుతెఱంగున నోహటించి లో
పడక పురంబు సొచ్చి సుతపాలికి నాపద చెప్పి పుచ్చినన్.

మ. అది యాత్మప్రియుఁ జేరి, దేవ! మును ప్రహ్లాదుం గృపం గాచి యు
న్మదుఁ డౌ దైత్యునిఁ ద్రుంచి తీవు మొసలి న్మర్దించి యారోన్గు న
మ్మది రక్షించితి నేఁడు ని న్గొలువఁగా మాతండ్రి కిట్లీ మహా
పద వచ్చెన్ రిపుసంఘముం దునిమి నీభక్తు న్బ్రోవి న్నిల్పవే.

క. అని వేఁడుకొనిన వాఁడును
మనమున నిటు దలఁచెఁ దొల్లి మగతనమునఁ బూ
నినపూనిక విడిచిన నిఁక
వినువారలుఁ జూచువారు వికవిక నగరే. ౧౪౨

గీ. నాఁటిసాహసమున నిట్టిబోటి గలిగె
నేఁటితెంపున కొకవేల్పు నిల్వఁబడఁడె
యనుచుఁ జక్రంబు గైకొని యంత్రగరుడి
నెక్కి సూత్రంబు గదలించి యెగసివచ్చె. ౧౪౩

వ. అట్టి వేళ నయ్యాదివిష్ణుండు. ౧౪౪

ఉ. గాళికిఁ డీగ్గైనేనియు జగంబు జనార్దనుఁ డీగ్గై నంచు న
న్నాలముసేయుచుండుఁ దన యల్లుఁడ నే నని నమ్మియున్న భూ
పాలుఁడు చిక్కి భక్తిఁ దమప్రాణము లొప్పనసేయ నున్న మ
న్నీలతలంపులుం బొలియు నే నటు పోవకయుండఁ బాడియే.

శా. తద్ద్వారంబున సెట్టినుండి చని యంతర్వేగిపై భుక్తిము
క్తిద్వారం బగు కాళినాథునకు భక్తిన్ మ్రొక్కి సంతుష్టుఁడై
యుద్వేగస్థితినుండి ధైర్యమతితో నుర్వీశుఁ డచ్చో మను
ష్యద్వంద్వద్విశిరశ్శిరకబంధములుఁ బద్యంబు న్నిరీక్షించుచున్.

క. తదుద్యోగవ్యంజక మగు
పద్యార్థం బెఱిఁగి దాని భావంబునకున్
సద్యోనిర్ణయముగ నృపుఁ
డుద్యోగముచేసె సాహసోద్ద్యోతితుఁడై. 33

గీ. భూపశేఖరుఁడు "పరోపకారార్థ మి
దం శరీర" మనుచుఁ దలఁపుకొలఁది
మృత్యుజిహ్వవోలె మెఱుఁగులీనెడునట్టి
కడిఁదియడిద మెత్తి మెడకుఁబూనె. 34

క. ఆలోన నతని సాహస
మాలోకించుచుఁ బ్రసన్నుఁడై పార్థివ నీ
పాలం గల్గితి నని భూ
పాలునిఖడ్గంబు క్షేత్రపాలుఁడు పట్టెన్. 35

ఉ. అప్పుడు మొండెముల్ దలలు నంటుకొనంగ వధూవరుల్ ప్రియం
బొప్పఁగ లేచి మ్రొక్కిన సముత్సుకమానసుఁ డౌచు భైరవుం
డిప్పటిసాహసంబునకు నే నిదె మెచ్చితి నిష్ట మేర్పడం
జెప్పుము నీకు నిత్తు నిటఁ జేకుఱ నన్న నతండు మ్రొక్కుచున్.

గీ. దేవదేవ వీరికీవిధంబున శిర
శ్ఛేద[1]కృత్య మేల సిద్ధ మయ్యె
నాన తిమ్ము నాకు నని విన్నవించిన
భైరవేశ్వరుండు పలికె నిట్లు.

1. దేవ వీరికిట్టి తెఱఁగువ వీశిరశ్ఛేద.

క. రత్నోద్భవుఁ డనఁగా నొక
రత్నవ్యవహారిసుతుఁడు రత్నంబుల కీ
రత్ననిధిలోనఁ దిరుగుచు
యత్నంబున నిచట విడిసె నాప్తులుఁ దానున్. ౩౮

క. తద్వేళ మఱియు నొకఁడు స
రిద్వల్లభసలిల ముత్తరింపఁగ నొకచో
నుద్వాహమునకు నేగుచు
నీద్వీపముఁ జేరె నిజసుహృద్వర్గముతోన్. ౩౯

వ. ఇక్కడ నయ్యిద్దఱు నిట్లొండొరువుల మహిమలు మెఱయింపుచుఁ గలసి మాటలాడు నెడ రత్నోద్భవుండు నీనామం బెద్ది యే దేశంబునుండి యెచటి కేఁగుచున్నాఁడ వనిన నతండు నేఁ జంద్రకేతుం డనువాఁడ మగధదేశంబునుండి రత్నద్వీపంబున కేఁగుచున్నవాఁడ నం దొక విశేషంబు గలదు. ౪౦

క. పద్మాకృతి రేఖలు కర
పద్మంబుల నొప్పుచుండఁ బద్మకు నెనయై
పద్మావతి యనుకన్యక
పద్మానన గలదు జాతి పద్మిని యనఁగన్. ౪౧

క. ప్రస్తుతలావణ్యగుణని
రస్తప్రసవాస్త్రమోహనాకారిణి సం
త్రస్తకురంగేక్షణ తా
లస్తని యది మదనరాజ్యలక్ష్మియుఁ బోలెన్. ౪౨

చ. కలువలుఁ జక్రవాకములుఁ గంజములు న్బిసకాండము ల్మనం
బలరఁగ దీని లోచనకుచానన బాహుసమానలక్ష్మిఁ గా
వలయు నటంచుఁ గోరి యుదవాసమునందుఁ దపంబు సేయుచు
న్నిలుచుటఁ గాక యెప్పుడును నీటఁ జలిం బడ నేల వానికిన్. ౪౩

గీ. ఇట్టికన్య నాకు నిచ్చెద రమ్మని
దానితండ్రి తొల్లి తగినవారిఁ
బనిచినాఁడు గానఁ జనియెద ననుఁడు ర
త్నోద్భవుండుఁ దాను నుత్సహించి. ౮౪

క. ఆతరుణి యెవ్వరికి నో
నాతనిఁబడు కొప్పు ననుచు ననురక్తి మనో
జాతునిచేఁతలఁ బడల న
తీతము మును విన్నభంగి దిట్టతనమునన్. ౮౫

క. ఆకన్నియఁ దజ్జనకుఁడు
నా కిచ్చెద నంచు మున్న నయముం బ్రియముం
గైకొనఁగఁ జెప్పి పుచ్చిన
నాకడ కే నేఁగుచుంద మది యెఱుఁగవొకో. ౮౬

వ. అనుఁడు మత్సరసముత్సేకంబున. ౮౭

క. అతనిపలుకులకు నాతం
డతికుపితుండైన వాఁడు నధికక్రోధా
న్వితుఁ డయ్యెను "మూలంవై
రతరోః స్త్రీ" యనినమాట ప్రకటంబయ్యెన్. ౮౮

శా. అన్యోన్యం బిటు దూలుచు న్మనమునం ద దేఁగువా[1] రెవ్వనిం
గన్యారత్నము గోర దాతఁడు కులోత్కర్షంబు వాణిజ్యముల్
సన్న్యాసంబును జేఁత పంత మని మాత్సర్యంబుతో నాత్మసా
జన్యం బెల్లఁ దొఱంగి[1] లేచి చనుచో సంకల్పసంసిద్ధికై. ౮౯

క. సద్భావము గైకొని ర
త్నోద్భవుఁ డేక దైవబలము యుచితం బని తా
నద్భుతముగ మ్రొక్కుచు నిట
మద్భవనముఁ జొచ్చె దురభిమానము పేర్మిన్. ౯౦

1. న్మనమె నేఁడందేగుచో. 2. దొలంచి.

క. గుడిసొచ్చి నాకు సాఁగిలఁ
బడి మ్రొక్కుచుఁ బలికె నెన్నిభంగులనైనం
బడఁతుక యిది నా కబ్బిన
మిడిదల యొప్పించి నిన్ను మెప్పింతుఁజుమీ. ౫౧

చ. అని యొడఁబాటు చేసి వినయంబున మ్రొక్కుచు నేఁగి చంద్రకే
తునిపని కేతు వృట్టఁ దనదొడ్డతనంబు నటించి రత్నకాం
చనమయ మైన దీవి రభసంబునఁ జేరి కడంకఁ గన్యకా
జనకుని గాంచి చెప్పె నిజసంవరణోద్యమ మప్పు డేర్పడన్.

సీ. ఆతఱి నాచంద్రకేతుండు చనుదెంచి
తనరాక చెప్పినఁ దద్గురుండు
నిద్దఱి కర్చన లిచ్చినఁ దాంబూల
గంధపుష్పాక్షతల్ గైకొనంగఁ
దొడవులకెల్లను దొడవైన కన్నియఁ
దొడమీఁద నిడుకొన్న యెడ నొకండు
తెల్లసంపెంగలు దివ్యంబు లివి యని
సమముగా నిచ్చినఁ జంద్రకేతుఁ
డిదియ మేలని తనతలఁగదియఁ దుఱిమెఁ
దొలుత దేవయోగ్యములనఁ దోడియాతఁ
డిష్టదేవత కర్పించి యెలమిఁ బిదప
వీని ముడిచెద నని యొడిలోన దాఁచె. ౫౩

ఉ. ఇరువురచేష్టలం గని మృగేక్షణ యల్లన లేచి హంససుం
దరగతి లోనికిం జనినఁ దండ్రియు నిద్దఱిపేళ్లు జాడలుం
జరితములుం దగం దెలిసి సామ్యము గల్గిన వీరిలోన నె
వ్వారి నవుఁ గా దనం జను వివాదము బాలికచేతఁ దీఱెడున్.

క. ఆతరుణి మెచ్చి కైకొను
నాతఁడె మాయల్లుఁ డనుచు నచటికిఁ జని క
న్యాతిలకముఁ జంకిట నిడి
వాతెఱ ముద్దిడుచు బుజ్జనంబునఁ బలికెన్. ౫౫

గీ. ఒడిఁ బ్రసూనముల్ దాఁచె రత్నోద్భవుండు
తుఱిమికొని యుండెఁ జంద్రకేతుండు వొల్లఁ
నీకొలఁది యిద్దఱందును నీకుఁ జూడ
నొప్పుగా రసికుఁ డెవఁడో చెప్పు మనిన. ౫౬

క. పువ్వులు గొను మని యిచ్చిన
యవ్వేళన తుఱుముకొన్న యతఁ డెవ్వఁడో వాఁ
డివ్వసుమతి నస్థిరుఁ డగు
నవ్వంబడు నొరులచేత నాకుం జూడన్. ౫౭

వ. అనినఁ దండ్రివిని యితండె జాణ యని నాకు నీతివాక్యంబు దోఁచు
చున్న యది యది యెట్లనిన. ౫౮

క. వనితాభోగము లంచను
ధనము సుభాషితము విరులుఁ దాంబూలముఁ బం
డినపండ్లును సిద్ధాన్నం
బును దడయక కొన్నవాఁడె భువి జాణ యగున్. ౫౯

వ. అనినం బద్మావతి యీనీతివాక్యంబు దప్ప దిప్పటి కుసుమంబులు
దివ్యంబులని యిచ్చుటం జేసి తోడియాతండు దేవతార్పణంబు
చేసి మఱి ముడిచికొనం దలంచె నెయ్యి పాలలో నొలుకు టయ్యె
దేవతాపరాయణుం డగుట సకలమంగళహేతువు మానుషబలం
బుకంటె దైవబలంబు ప్రబలంబు మఱి యింతియుఁ గాదు. ౬౦

క. ఆకుసుమంబులు దేవత
కై కోరికి డాఁచికొనినయది చూడంగా
నీకడకు వచ్చునెడ ననుఁ
గైకొనుటకు మ్రొక్కు టొకటి గలుగఁగఁబోలున్. ౬౧

మ. అనిసం గూఁతు నలంకరించి మది నెయ్యం బెచ్చటం బుట్టె నా
తనిపై నైనను వాఁడె భర్త యని నూత్నంబైన పుష్పస్రజం
బెనయం జేతికి నిచ్చి బంధులు నిజాభీష్టార్థముల్[1] వచ్చుక్రం
దున వాద్యంబులు మ్రోయఁగా నెలమితోఁ దోడ్తెంచు నేతెంచినన్

క. రత్నద్వీపంబునఁ గల
రత్నంబులలోనిదివ్యరత్నము[2] కన్యా
రత్నము దా వనమాలిక
రత్నోద్భవుమీఁద నైచె రాగం బడరన్. ౬౩

వ. అవ్వేళం బద్మినీరాగకారణంబగు గగనరత్నంబుపగిదిం బద్మావతీకృతానురాగుండగు రత్నోద్భవు శుభోదయంబునం జంద్రకేతుండు ప్రభాతచంద్రుక్రియం బ్రభాహీనుండై లోనం గుందుచు జలధిఁ బడందలంచిన నది తెలిసి యాసెట్టి తనతమ్ముని కూఁతుఁ గుముద్వతి నిచ్చెదనని యతనిరాకసఫలంబుగా ననునయించి తెచ్చె.

ఉ. సంపద సొంపుమీఱఁగఁ బ్రసన్నమనస్కుఁడు సెట్టి వేడ్కతోఁ
బెంపడరంగ నల్లునకుఁ బెండిలిచేసి తదీయసత్క్రియా
లంపటుఁడై సువర్ణదశలక్షధనం బరణంబు నిచ్చి యా
దంపతు లుల్లసిల్లఁగఁ బదంపడి వారల నంపె నింపునన్. ౬౫

క. రత్నోద్భవుండు నిట కతి
యత్నంబున వచ్చి వంచితాప్తజనుండై
నూత్నవివాహశ్రీ యగు
పత్నిం జేపట్టి నాముభవనము సొచ్చెన్. ౬౬

1. భీష్టౌఘముల్. 2. మొదలిరత్నము.

వ. చొచ్చి ప్రణమిల్లి. ౬౭

శా. దేవా ప్రొక్కెడె వచ్చె నంచు శితశస్త్రిం గంఠనాళంబు స
ద్భావాధిక్యము దోఁపఁ ద్రెంచుకొనినం బద్మావతీకన్య ప్రే
మావేశంబును భక్తియు న్నిగుడఁగా నాథంగి నిచ్చోఁ నిజ
గ్రీవాచ్ఛేదము చేసి వ్రాలెఁ బతిపైఁ గీర్ణోచ్ఛలద్రక్తయై. ౬౮

చ. అటఁ దమమూఁకలోన హితు లాతనిఁ గానక జాడ పట్టి యి
చ్చటి కరుదెంచి తున్కలయి చచ్చినవీరలఁ జూచి మద్గృహం
బిటనట నాదటం బోరలి యేడ్చుచు నెత్తులు మొత్తుకొంచు ను
త్కట మగుదుఃఖవహ్నిఁ గడుఁ గ్రాఁగిరి వేఁగిరి దోఁగి రశ్రులన్.

సీ. తదనంతరంబ యిద్దఱ నెత్తికొని వెలి
కరుగఁ జూచిన నేను గరుణ కల్మి
మీలోన నొక్కఁడు మిడిదల యిచ్చిన
దంపతుల్ బ్రదుకుట తథ్య మనిన
నామాట కుల్కి మిన్నక కాలభైరవుం
డీలోన నిద్దఱ నిట్లు ద్రుంచె
నింక నెందఱఁ జంప నెంచినాఁడో యని
విడిచి కన్కని గుడి వెడలి పాఱి

రేను నామాట పద్యంబుగా నొనర్చి
వ్రాసి నిలిపితి నంత నెవ్వారలైన
ప్రొక్కఁ జనుదెంచి కాంచి విదిక్కుపడుచు
వెడలిమఱిచూడ రిట వెఱ వేఁకిపట్టి. ౭౦

క. వీరాగ్రణి యగు నీచే
వీరిద్దఱు బ్రదికి రింక వేఁడుము దగ నీ
కోరిన కోరిక లిచ్చెద
భూరమణీరమణ సర్వభూతదయాత్మా. ౭౧

వ. అనుడు నతండు మఱియుం బ్రణమిల్లి. ౭౨

క. సకలార్థసిద్ధికై దే
వ! "కలా మైలారు భైరవా" యనుపలుకుల్
ప్రకటంబుగ రాజ్యముతో
వికలత్వము లేనిబ్రదుకు వీరల కిమ్మా. ౭౩

వ. అనుచు న్వేఁడిన వానిసాహసము నత్యౌదార్యముఁ భైరవుం డనురక్తిం గొనియాడి వారలకుఁ బ్రాజ్యం బైనరాజ్యంబుఁ జందనశైలస్థలిఁ గల్గ నిచ్చి తనలోఁ దా సన్నిధిం బొందినఁ ధనదుం గూడి కడంకతో మగిడె నాధాత్రీశుఁ డుజ్జేనికిన్. ౭౪

క. ఆభూపతి గుణములు నీ
కేభంగులనైనఁ గలుగ వీఁక మగుడు మనం
బ్రౌభవముఁ గలిమి జాఱఁగ
నాభోజుఁడు తిరిగి చనియె నంతఃపురికిన్. ౭౫

వ. అంతఁ గొంతకాలంబు చనఁగ. ౭౬

—: ఎనిమిదవబొమ్మ కథ :—

క. కాశాబ్జమల్లికాకలి
కాశారదనీరదేందుకైరవహంసా
కాశాపగాంబుహిమనం
కాశాంగవికాసితప్రకాశు గిరీశున్. ౭౭

చ. తలఁపుచు మ్రొక్కి భోజవసుధాపతుఁ డిష్టులు దృష్టశాస్త్రవే
త్తలు శకునజ్ఞులు న్సముచితం బగు లగ్నము చెప్పఁగా సము
జ్జ్వలకరవాలహస్తుఁ డయి వచ్చి మహాసన మెక్కఁ బూనఁగా
నిలునిలు మంచుఁ బల్కెఁ గడు నేర్పున నచ్చటి బొమ్మ యిమ్ములన్

క. మోహమున భద్రపీఠా
రోహణ మగు ననుట గుణవిరోధము గాదే
సాహసభూషణుసరిగా
సాహసగుణగణము లేక చనునే యెక్కన్. ౭౯

క. ఇవ్విధమునఁ బలికిన నృపుఁ
డవ్వీరుని బలిమి తెంపు లవి యెట్టి వన
న్నవ్వుచు నప్పాంచాలిక
యివ్విధిఁగందంగఁ జెప్పె నిర్వచనముగన్. ౮౦

శా. ఆకర్ణింపుము భోజభూవర నిలింపాధీశసంపాదితా
స్తోకస్నేహవివేకనాకయువతీస్తోత్రైకసాత్రుండు భా
శ్రీకాంతాపరిభోగ్యభాగ్యనిధి కీర్తిన్ విక్రమాదిత్యుఁ డ
శ్లోకచ్ఛత్రముగాఁ దనర్చుచు జగం బేలెం గృపాలోలుఁడై.

క. ద్వాత్రింశద్భాగములను
ద్వాత్రింశద్ద్వారమైన వజ్రాసనమున్
ద్వాత్రింశదాయుధములున్
ద్వాత్రింశల్లక్షణములుఁ దగు నాతనికిన్. ౮౨

సీ. దుర్గరక్షణమును దుష్టశిక్షణమును
శిష్టపాలనమును జేయవలయు
వర్ణధర్మములును వనములు గుళ్లును
జలజాకరంబులు నిలుపవలయుఁ
గృషియు వాణిజ్యంబు గృహజీవధనములు
నాయుర్వ్యయంబులు నరయవలయు
వనదల నర్థుల నార్తులఁ బాత్రులఁ
బూజ్యుల విప్రులఁ బ్రోవవలయు

బలముఁ దెంపుఁగలిగి యలుకయుఁ గరుణయుఁ
జలమునిలుకడయును జరుపవలయు
నయముఁబ్రియము నైరి జయముఁగార్యముఁ గొల్వు
నితరరాజగతుల నెఱుఁగవలయు. ౮౩

క. అన నున్న నీతివిధమున
ననువుగ భూపతులవలన నయ్యెయుపవ
ర్తనముల జరిగెడు నృపవ
ర్తనములుఁ దెలియుచు నతండు ధరయేలంగన్. ౮౪

క. చారులు చనుదెంచినఁ బతి
వారలచే నన్యదేశవార్తలు వినుచు
న్నీరు చరించిన యూకా
శ్మీరంబున నేమి గలవు చిత్రము లనినన్. ౮౫

సీ. వసుధేశ యచ్చట వైశ్యుండు ధనపతి
యోజనాయతమైన యొక్క చెఱువు
గట్టించి లోఁతుగాఁ గావింప నందులోఁ
బుడిసెఁడునీళ్లును బొడమకున్న
వగచి యింటికిఁ జని మగిడి నిచ్చలు నట్ల
వచ్చి యాకట్టపై వెచ్చనూర్చు
చుండఁగా ముప్పదిరెండులక్షణములు
గలవానికంఠరక్తంబు లిమ్ము
చెఱువు నిండు ననుచుఁ జెప్పె నంబరవాణి
దాని కాతఁ డట్టివానిఁ గూర్పఁ
బూని యేడుకోటు లైన బంగారునఁ
బ్రతిమ లేడు నిలిపెఁ, బద్య మొకటి. ౮౬

గీ. "అవనిఁ ద్రిదశలక్షణాన్వితుఁ డగుధీరుఁ
డిచటఁ గంఠరక్త మిచ్చెనేని
సప్తకోటిమూల్యతప్తకాంచనముల
ప్రతిమ లేదు నతని పాలు సుమ్ము." ౮౭

మ. అని యిట్లున్నది విస్మయం బిది నృపాలాగ్రేసరా నావుఁడు
న్విని యుత్సాహముతోడఁ దత్సహితుఁడై విశ్వంభరాధీశుఁడుం
జని యచ్చోటఁ దటాకమధ్యమున గర్జన్మ్రగ్గళధ్వానసం
జనితశ్రీరమణీప్రసాదవిలసత్సౌధంబు వీక్షించుచున్.[1] ౮౮

గీ. అష్టదిక్కులందు నష్టభైరవులను
దాండవమున నొప్పుతాండవేశు
నెదుర శ్రీవరాహు నేఁబదిచేతుల
రాతికంబముతుదిఁ బ్రీతిఁ గనియె. ౮౯

క. ఉర్వీశుఁడు సేతువునఁ జ
తుర్వింశతిమూర్తు లెదురఁ దోఁచఁగఁ ద్రిజగ
న్నిర్వాహకుఁ డన నిలిచిన
సర్వేశ్వరుఁ జూచి మ్రొక్కి సద్భావమునన్. ౯౦

ఉ. అచ్చటిపద్యముం బ్రతిమ లన్నిటి నెప్పుడఁ జూచి యాత్మలో
నచ్చెరువంది భూమివరుఁ డచ్చెఱు వప్పుడె నిండఁ జేయఁగా
నిచ్చఁ దలంచి వేళకొఱ కించుక సేపు సహించి యుండఁగా
నిచ్చయెఱుంగుసంగతి దినేశుఁడు దగ్గఱెఁ బశ్చిమాంబుధిన్.

ఉ. అంబరరత్నబింబ మపరాంబుధిఁ జేరఁగ నెండ శైలశృం
గంబుల ధాతురాగముల కైవడిఁ గెంపు వహించెఁ జక్రవా
కంబులు తల్లడిల్లె విహగంబులు గూండ్లకు నేఁగఁజొచ్చెఁ బ
ద్మంబులు వాడఁబాఱెఁ గుముదంబులు సొంపున కెక్కి సక్కుచున్

1. శ్రీరమణీకటాక్ష విలసత్స్థానంబు వీక్షించుచున్. ప్రసాదమగునాసౌధంబు వీక్షించుచున్.

గీ. పండుటెండఁ దరులు పల్లవద్యుతులతో
మెండుకొనఁగ వరుణుమేడమీఁద
నుండి వెలుఁగు పసిఁడికుండ చందంబున
నెండఱేఁడు గ్రుంకుకొండ నొప్పె. ౯౩

సీ. అపరాబ్ధిఁ గ్రీడించు నంబరస్త్రీ యొద్ద
నిద్దమౌ కుంకుమముద్ద యనఁగ
నచట సంధ్యాదేవి కర్ఘ్యంబు లెత్తుది
క్పతిచేతిమణిమయకలశ మనఁగ
వరుణుని ముందటఁ బరిచారకులు నిల్పఁ
బట్టిన రత్నదర్పణ మనంగ
నస్తాచలం బను హస్తిమస్తకమునఁ
దిరమైన రక్తచామర మనంగ

నిఖిలదిగ్వలయాంతమాణిక్య మనఁగ
నిట్ట గ్రాఁకిన పవడంపుఁ జట్టయనఁగ
గట్టుతుద నున్న జేగుఱుగ ల్లనంగ
నరుణమండల మొప్పె దినాంతమందు. ౯౪

క. అయ్యెడ నరుణమండల
మయ్యచలము డిగ్గి పశ్చిమాంబుధి సొచ్చెం
నయ్యందిఁగాఁచి కమ్మరి
చయ్యనఁ బదనిచ్చు నుక్కుచక్రము మాడ్కిన్. ౯౫

గీ ఏవిధమున మలక నైన దైవగతిని
సొమ్ము వానిన మఱి చేసు సొమ్ము నాఁగఁ
త్రిభువనము లెల్లఁగలయంగఁదిరిగి గగన
రత్నమప్పుడు రత్నాకరమునఁగలసె. ౯౬

క. నెఱసంజఁ గ్రుంకుగుబ్బలి
చఱి జఱజఱ నినుఁడు డిగ్గజాఱుచుఁ జనునా
తఱి నఱిముఱి నెగసిన [1]జే
గుఱుధూళి యనంగఁ గెంపు గుఱికొని పర్వెన్. ౯౭

క. మిన్నందెడు తేజంబున
నెన్నంగల యినుఁడు దీఱె నిదె యెడ రనుచు
న్విన్నంతనె పఱతెంచెదు
మన్నీలన నపుడ యిరులుమన్నీ లెసఁగెన్. ౯౮

*క. లోకమున విగతదృష్టి వి
వేకంబునఁ జక్రవాకవిరహానల ధూ
మాకారంబున జనములు
చీకాకుపడంగ దెసలఁ జీఁకటి గప్పెన్. ౯౯

గీ. అర్కుఁ డేఁగిన పిదపఁ గాలాభ్రలీలఁ
దమము గప్పిన యెడ వియత్పథము దోఁచె
వరుస దప్పక దావపావకము సోఁకి
చనినపిమ్మట ఘనతృణస్థలము కరణి. ౧౦౦

క. నేలయు నింగియు నిండఁగ
వాలుచు దళమైన చీఁకువాలేచినఁ ద
త్కాలంబున జగ మొప్పెను
నీలసలిలమునను గడవ నించినమాడ్కిన్. ౧౦౧

సీ. యమునాజలానీల పఠాచిమ్మచీఁకటి
పెల్లున జగమెల్ల నల్లనైన
దిగినఁ దప్పిద మని యగజతోడను శూలి
తనవెండికొండపై దలఁకుచుండ

1. తఱివడితో నెగసినజేగుఱు—*ఈపద్యము మొదలు **వఱకు నొకప్రతిలోనే కలవు.

నీదెస మఱి గానరా దని హరి లక్ష్మి
దోయిగా సమ్మృతాబ్ధిఁబాయకుండ
దీనఁ బాసినఁ గానలే నని వాణి తో
డ్పడ బ్రహ్మ వెలిదమ్మి వెడలకుండఁ
దెలుపు నలుపును నదియెడి తెలివి తలఁగి
పల్లమును మిఱ్ఱు నెఱుఁగక యెల్లజనులుఁ
బుట్టుచీఁకులగతి నంటి పోక దక్కి
యుండి రుదకంబులోఁ మునిఁ గున్నపగిది. ౧౦౨

క. రాజిల్లెడు తారాగ్రహ
రాజింగ్రిక్కిఱిసి యంబరము గడు నొప్పెన్
రాజు చనుదెంచు నని యు
ద్భ్రాజితమైయున్న విరులపందిరిభంగిన్. ౧౦౩

శా. దిగ్భామామృగనాభిలేపనము భాతి న్విస్రుతం బౌ తమః
ప్రాగ్భారంబు నిశావధూచికురభారస్ఫూర్తి వర్తిల్లఁగాఁ
బ్రాగ్భాగంబునఁ దచ్ఛిఖావినిహతప్రవ్యక్తరక్తోత్పల
స్రగ్భావంబునఁ గెంపు దోఁచె రజనీరాజద్యుతివ్యాజమై. ౧౦౪

క. తరుణారుణకిరణోత్కర
పరిహృత ఘనతిమిర మైనప్రాగ్భాగమునం
బురుహూతు నెదుర నెత్తిన
కరదీపికకరణి శీతకరుఁ డుదయించెన్. ౧౦౫

క. తనయుదయ మెం దుదిఁ గోరెడు
నను విడిచె నినుండు కల్ల నాయెడ లేకుం
ట నెఱుఁగఁ డని పూర్వాశాం
గన జగమున మస్తు పట్టు గతి శశి మెఱసెన్. ౧౦౬

సీ. ఉదయాచలను చేతి నున్న బంధూకంబు
కొమ్మను బొడమిన కుసుమమనఁగఁ
దత్ప్రదేశంబునఁ దలకొని పొడ తెంచు
నలినీలతాపక్వఫల మనంగ
విరహిమృగంబుల వేటాడుమదనుండు
తివిరి పెట్టించిన దివియ యనఁగ
నమరంగ నింద్రాణి యాఖండలుని నివా
ళించెడు పసిఁడిపళ్లెర మనంగఁ

దోడుతోడన తనకెంపువీడుచుండఁ
దిమిరపటలంబు కొంత మీఁదికిఁ జలింపఁ
దెలివిపడలేఁత వెన్నెల మొలకలెత్తి
నిండుకొనియుండె నమృతాంశుమండలంబు. ౧౦౭

ఉ. కోకములు న్సరోజములుఁ గుందుచుఁ గందుచునుండఁ గైరవా
నీకములుం జకోరములు నిక్కుచు సొక్కఁగ మానినీసఖీ
త్సేకము నంధకారమును దిగ్గఁగ దిగ్గన లోకము న్నిజా
లోకము నుల్లసిల్లఁ గవిలోకము మెచ్చులు పిచ్చలింపఁగన్.

క. నడుమం గృష్ణుఁడు గలపా
లకడలిని జనియించి తండ్రికై వడి మూర్తిన్
బెడఁ గడరెడువాఁ డనఁగా
నుడుపతి తెలుపై కళంకయుతుఁడై మెఱసెన్ ౧౦౮

క. తిమిరసముదాయమున న
ర్ధము నలుపై పూర్ణతుహినధామద్యుతి న
ర్ధము తెలుపై యాకాశము
యమునాగంగాంబుసంగమాకృతిఁ దాల్చెన్. ౧౧౦

గీ. మిత్రుఁ డేగిన యెడయన మేర దప్పి
వాలి చేకొన్న యిరులమన్నీలు పఱవ
యశముగతిఁ గ్రొత్తవెన్నెలదిశలఁ బర్వ
రాజుచనుదెంచె గగనదుర్గమునకంత.** ౧౧౧

క. ఇటునటుఁ జనకుండఁగఁ జెం
గటఁ జంద్రుం డాఁక నిడిన గతిఁ దప్పినచీఁ
కటి చెలికాండ్రన నంబుజ
పుటములలోఁ జంచరీకములు తగులొందెన్. ౧౧౨

క. భాగీరథియుదకంబు న
భోగంగయు వేఱుసేయఁ బోల దను చు న
వ్వాగీశుఁడు గూర్చెనా యన
వేగన భూగగనములను వెన్నెల నించెన్. ౧౧౩

సీ. తొలితొలి లేఁతవెన్నెల నారగించుచుఁ
దనియఁ బిల్లలనోళ్ళఁ జొనిపి చొనిపి
ముదురువెన్నెలఁ బట్టి చదియంగ నములుచు
మెచ్చుచుఁ బిల్లల కిచ్చి యిచ్చి
పండువెన్నెల దాడఁ బలుమాఱు నొక్కుచు
గమిగూడి యందంద కమిచికమిచి
నెలినార సాఁగెడు వెన్నలకాఁడలఁ
ద్రొక్కి ముక్కునఁ ద్రెంచి బొక్కి బొక్కి
చొక్కి శ్రీప్రవాహములోన సోలిసోలి
యద్దమీఁదుచు గద్దపై నాఁగియాఁగి
యెనసి బలఁగముతోఁగూడి[1] మునిఁగిమునిఁగి
కోరికలు మూరిఁబుచ్చెఁ[2] జకోరచయము. ౧౧౪

1. యెనసి బుడుగులయట్టులు మునిఁగి-బుడిగి = బుంగపుంత. చి. సూ.—2. మూగిముంచె.

చ. కలువలవిందు జక్కవలకందువ వెన్నెలతీవదుంప ము[1]
చ్చుల మెడకోఁత మంగజునిచూపరి చూపులయింపు జారకాం
తలవెఱగొంగ రాత్రికులదైవము చల్లనిరాజు పంకజం
బుల ముకుగొయ్య[2] యచ్యుతుని ముద్దుమఱంది వెలింగెనయ్యెడన్

క. కొడుకుసిరిఁ జూడ నుబ్బునఁ
గడఁగి వడి న్వడలి వచ్చి కడు మీఱినపా
ల్కడలి యన నిండు వెన్నెల
గడలుకొనుచు నెల్లకడలఁ గడు బెడఁ గడరెన్. ౧౧౭

సీ. దిక్కులు గలయంగఁ బిక్కటిల్లిన పండు
వెన్నెల యావాలనెల్లి యనఁగ
ముత్తియంబులభాతి మొత్తమౌ తారకా
గణములు లహరికాగణము లనఁగ
నుజ్జ్వలాకారమానుఁడు రాజబింబంబు
సెజ్జయై మెలఁగిన శేషుఁ డనఁగ
నందమై మృగనాభిబిందుసుందర మైన
యందులకందు ముకుందుఁ డనఁగ

నట్టివేళఁ గువలయానందకందమై
పుణ్యములకుఁ గలితభోగములకుఁ[3]
గారణంబునాఁగఁ గందర్పజనని యై
రజనిలక్ష్మి మిగుల భజనకెక్కె. ౧౧౮

ఉ. ఆతఱిఁ బార్థివుండు సమయం బిదె నిర్జన మంచు నిల్చి త
త్సేతువుమీఁద రక్తబలిదేవత[4] నిష్ఠఁ దలంచి ధర్మ వి
ఖ్యాతముగాఁ బరోపకృతికై తల యిచ్చెద నంచు నుబ్బుమం
జేతికృపాణ మల్ల మెడఁ జేర్చె మెఱుంగులు తొంగలింపఁగన్.[5]

---

1. రాజుల మెడకోఁత, 2. పంకజంబుల కెదురెక్క, 3. యానందమై పుణ్యభాగులకును వారి భోగములకు. 4. రక్తజలదేవత, 5. కృపాణమెత్తి మెడఁజేర్చె మెఱుంగుతురఁగ లింపఁగన్.

ఉ. అప్పుడు ర_క్తభోజిని తదస్త్రము వట్టి ప్రసన్నచి_త్తయై
కప్పు తనూలత న్మెఱయఁగా నృపుముందట నిల్చి వేఁడు మే
నిప్పుడు మెచ్చితి న్వరము లిచ్చెద నావుడు మ్రొక్కియాత్మలోఁ
దప్పనిభ_క్తితోడ వసుధాపతి పల్కె నుదారవృ_త్తియై. ౧౧౯

క. ఇచ్చటఁ గోరినకోరిక
లిచ్చెద నని యానతిచ్చి తే నడిగెద నా
కచ్చెరువుగ నీతలఁపున
నిచ్చెలు విదె నిండఁ జేయు మిప్పుడు తల్లీ. ౧౨౦

గీ. అనుడు దేవిపల్కె నవనీశ నీధర్మ
బుద్ధిఁ జెలువు దానె పూర్ణమయ్యె
ధార్మికులకు సిద్ధితడయునే కప్పలఁ
గాచి యెలుక పాము గతికిఁ బుచ్చె. ౧౨౧

క. అనవుడు జనవిభుఁ డది యె
ట్లని యడిగిన దేవి చెప్పె నాకథ యిదిగో
వినుము హిమాద్రిసమీపం
బునఁ గడు లోఁతైన మడుఁగుపోలుపైయుండుఁ. ౧౨౨

క. ముదమున నందులకప్పలు
వెదవెట్టిరె వెట్టికోరు వెట్టిర యెమరే
కదకడ దక్కము పొదపొద
యఁదె వరవర వాఁగురూఁగు రనుచుం జెలఁగుఁ. ౧౨౩

క. అట కంతటను ఘనాత్రయు
పటుతరుఁడై యొక్కశంఖపాలుం డను పే
రిటి నాగేంద్రుఁడు చని దా
పటికప్పల[1] మ్రింగఁ జొచ్చి సద్యము చదివెఁ. ౧౨౪

1. యప్పటికప్పల.

క. "గుండియ చెదరక భువి నె
వ్వం డైన నిజాంగ మిచ్చువాఁడు గలిగినన్
గండూపదీయుతం బగు
మండూకౌఘంబుతిండి మానుదుఁ జండీ." ౧౨౫

క. అని ముమ్మాటు ముఖత్రయ
మునఁ జదువుచు మడుఁగుచుట్టు ముమ్మాఱు వివ
ర్తనచేసి మఱఁటి భ్రమించుచు
నను దినమును వ్రతముపోలె నచటం దిరుగున్. ౧౨౬

శా. ఈమర్యాదల నున్నదాని చరితం బేపారఁగాఁ జూచి వి
శ్రామార్థంబుగ నొక్కకాకి చని వృక్షశ్రేణిపై బాంధవ
స్తోమంబు న్వినిపించి నిల్వక మహాచోద్యంబుగా నుత్తమ
ప్రేమాఢ్యం బగు మూషకంబునకుఁ జెప్పెం దత్క్రమం బేర్పడన్

క. ఆమూషక మిది చూడఁగ
నీమహిఁ గడుఁ జిత్ర మనుచు నిచ్చఁ గుతుక ము
ద్దామముగఁ గాకితోడుగ
నామడువున కేఁగి యచటి యవనిజ మెక్కెన్. ౧౨౭

క. అత్తరువుమీఁద నుండుచు
నత్తటి నుదకంబులోన నహిభీతిఁ గడుం
గుత్తుక తుకతుక యనఁగాఁ
దత్తఱపడుచున్న భేకతతిఁ బొడఁగాంచెన్. ౧౨౮

గీ. బ్రహ్మ "కప్పకాటు బాఁపనపోఁటును"
లేకయుండఁ జేసెఁ గాక నేఁడు
గలిగెనేని వైరిఁ గని యిన్ని దునుమానె
దైవలిఖిత మేల తప్పు ననియె. ౧౩౦

క. ఆలోచనను నెడలి మహా
వ్యాళము చదువుచును మడువు నలగొనఁగాఁ ద
త్కాలంబున మూషక మిటు
చాలం గృపపుట్టి వాయసంబున కనియెన్. ౧౩౧

చ. అలిగి వధించినప్పుడొరు లడ్డము వచ్చిరయేని నాఁడుఁగ
ప్పల మగకప్పల న్విడువఁ బంతముచేసె వడిన్ భుజంగ మి
మ్ముల మన మడ్డమై నిలిచి ముక్తుల మాదను రమ్ము నావుడుం
గలఁగి ఖగంబు బుద్ధి యిదిగాఁ దనుచుం దలయూఁచి యిట్లనున్

ఉ. అన్నలొ తమ్ములో చెలులొ యాత్మజులో చనువారు వీరికై
మిన్నక చావనేల యిది మేలె భువిన్ బలిభోజి నయ్యు నా
యున్నెడ విశ్వసింప నొరునొద్దకుఁ జేరఁ బ్రమాద మైనఁ గ
న్నన్న నెఱింగి యొండెడకుఁ జాఁగుదుఁ బ్రాణముతీపి చూచితే.

క. వలవనిపని యిది ఫల మని
చలమునఁ దాఁ జచ్చి పడయుసంపద లేలా
యిలఁ బ్రాణము గలిగిన *బి
బ్బిలియాకేఱి తినవచ్చుఁ బెక్కుదినంబుల్. ౧౩౪

గీ. మనుజుఁ డొక్కఁ డేటమునిఁగెడు దిగి నిల్వఁ
బట్టు మనిన భంగి నిట్టునీవు[1]
గొంత దెలియలేవు క్రొవ్విన గొఱియ దాఁ
జింతకట్టె మేయఁ జేరుటయ్యె. ౧౩౫

గీ. ప్రాణమైన సుతులుఁ బత్నులుఁ జావఁగాఁ
జావలేరు వీనిచావు కింత
తన్నుమాలినట్టి ధర్మంబు గలుగునే
చెడుగుబుద్ధు లింక విడువు నీవు. ౧౩౬

---

* బిబ్బిలియాకేఱి— 1. డొక్కఁడు (మనగు) గునుకుదినియె (యే) డుగోడానఁ బట్టు మనినభంగి నిట్టినీవు- చిఱుత కట్టె- చిన్నయసూరిగారు.

క. అనవుడు నది యిట్లనియెను
వినుమొక ప్రాణమునఁ బెక్కువిధముల ప్రాణుల్
మనఁగం జేసినపుణ్యం
బెనయునె భువిలోనఁ గ్రతువు లెన్నియుఁ గూడన్. ౧౩౭

క. ధనధాన్యములును సుతులును
వనితలుఁ దనతోడఁ గూడి వచ్చుట గలదే
జనహిత మగునడవడినిఁ జ
నిన ధర్మము దనకుఁ దోడునీడను బోలున్. ౧౩౮

క. ధనము గలిగి పెట్టక యీ
జననంబున నెలుకనైతి జనులకు నిడువ
ర్తన సమకూరక యూరక
చనియెను దినములు లోగి ధర్మసంచయ మేదీ. ౧౩౯

క. పాపంబు పుట్టునెడఁ దా
నోపియు నుడుపంగలేక యూరక యున్నం
గా పురుషుం డాతం డగు
నా పాపము వానిఁ బొందు నండ్రు వివేకుల్. ౧౪౦

క. క్షోణి "ననిత్యాని శరీ
రాణి" యనుచుఁ బెద్ద లెఱుక ప్రచురింపంగాఁ
బ్రాణిపరిపాలనమునకుఁ
బ్రాణము వంచింపనేల పరహితమతికిన్. ౧౪౧

క. తనతనయులుఁ దనసతులును
దనవారలుఁ దనగృహంబుఁ దనసొమ్మనుచుం
దనువునఁ దనరెడికష్టలఁ
దన దగు తను విచ్చి కాచి తనిపెదఁ బ్రీతిన్ ౧౪౨

క. ఈగతి "ధర్మస్య త్వరి
తాగతి" యనుపలుకుకొలఁదిఁ దడయక నే నా
నాగేంద్రుని కెదిరించెద
నాగాంతకుఁ జేరుఖచరనందను మాడ్కిన్. ౧౪౩

క. అని పలికి శంఖపాలుని
పని విఘ్నముఁ బొందఁజేయఁ బనిపూని గజా
ననుఁడు దనవాజిఁ బుత్తెం
చెనొ యనఁగా మూషకంబు క్షితిపై నుఱికెన్. ౧౪౪

సీ. ధవళాంశు మ్రింగి సుధాశక్తిఁ దెల్లని
దేహంబు వడసిన రాహు వనఁగ
భువనత్రయం బాక బుట్టఁ[1] బెట్టఁగఁజాలు
వేఁడిమిపడగలు మూఁడు మెఱయ
భీషణం బై యున్న రోషాగ్నిఁ బొడమెడు
శిఖలకై వడిఁ గ్రాలు జిహ్వ లదరఁ
దనలోని కీడు ముందటఁ దెల్పుమాడ్కిని
శ్వాసంబుతో విషజ్వాల లొలుక

[2]మ్రోయుజేగంటచాడ్పున మ్రోగిమ్రోగి
చదివి తిరిగెడునాగేంద్రు నెదురనుండి
నీకు నాహార మిప్పుడు నేన యైతి
నిలిచికైకొను మనుచు నయ్యెలుక పలికె. ౧౪౫

క. ఆపలుకున భుజగము తన
రూపంబు పరిత్యజించి రుచిరాకృతి వి
ద్యాపారంగతమతి యన
దీపించెడు విప్రుఁడై నుతించుచుఁ బలికెన్. ౧౪౬

1. బుస్సఁ. 2. మోసియున్నట్టి ఘోరమౌముఖము లదర.

క. మూషకకులతిలక దయా
భూషణ నినుఁ బోలునట్టి పుణ్యులు గలరే
భాషణమాత్రంబున ని
ర్దోషుఁడ నై బ్రదుకఁ గంటిఁ దొల్లిటిభంగిన్. ౧౪౭

సీ. తాపసుం డగుదీర్ఘతముఁ గొల్చి సాంగయు
క్తంబుగా వేదత్రయంబు చదివి
యతనిచే దేవకార్యమునకు నామంత్రి
తుండనై యుండఁగా దొర యొకండు
తనయింటి పితృకార్యమునకు ర మ్మనవుడుఁ
దద్గృహంబునఁ బదార్థములు పెక్కు
గలుగ నూహించి యక్కడి కేఁగి కుడిచిన
విని ఋషి చనుదెంచి నను నదల్చి
మునుపు మాకు నీయకొని యట చని కూడు
కుడిచి తీవు కుడువఁ గూడ దనక
శ్రుతి యుతుండ వయ్యు శ్రుతిహీనజీవనై
పెనఁచి భ్రమింగుచుండు ఘూకములను. ౧౪౮

క. అని శపియించిన నే నా
తనికిన్ ధరఁ జాఁగి మ్రొక్కి తప్పు గలదు శి
ష్యునిఁ గరుణింపుము మునుచది
వినచదువుల దురితమెడలివిరతియుఁగలుగన్. ౧౪౯

గీ. అనుడు నామాటదప్పదు వినుము నీకు
వేదము లూర్మఁడు పడగలై వెలయుఁగాన
శంఖపాలుండ నై జలాశయముఁ జేరి
మాఁటఁటేఁదినుమనిపద్యంబు మొదలఁ జెప్పె. ౧౫౦

క. "గుండియ చెదరక భువి నె
వ్వం డైన నిజాంగ మిచ్చువాఁడు గలిగినఁ
గండూపదీయుతం బగు
మండూకౌఘంబుఁ బిండి మానుదుఁ జుండీ." ౧౫౧

క. ఈకరణిం జదువుచు* నీ
వాకడ మున్మాటు దిరుగునవసరమునఁ ద
ద్భేకములఁ గావ ధైర్యము
గైకొని యొకఁ డద్దమైన గతిఁ గను నునియోఁ. ౧౫౨

క. కావున నిట నురగాకృతి
నీవిధమునఁ దిరిగి చదివి యిన్నిటిఁ గలయం
గా వధియించితిఁ గడపట
నీ వెరపున దురిత మెల్ల నీఁగితి ననఘా. ౧౫౩

క. దీర్ఘతముని శాపం బను
నిర్ఘాతము సోఁకి వచ్చి నీవచనసుధా
నిర్ఘర్షణమున మంటిని
దుర్ఘట మిది యనఁగ వింటిఁ దుది గతిఁ గంటిన్. ౧౫౪

మ. అని చెప్ప న్విని మూషకంబు గడుఁ జోద్యం బంది యవ్విప్రుఁ దో
డ్తోని తా నుండు బిలంబుఁ జేరి యిదె కైకొమ్మంచు నం దున్న కాం
చన మెల్లం గొనివచ్చి యిచ్చి యుచితస్నానప్రదానస్పృహం
జనియెం గాశికి ధర్మరాశికిని మోక్షశ్రీపయోరాశికిన్. ౧౫౫

మ. ధరణీదేవకుమారుఁడు న్మగిడి యుత్సాహంబుతోఁ దత్సరో
వరతీరంబున మూషకేశ్వరమునా వర్తిల్లు తీర్థంబు నీ
శ్వరగేహంబును గట్టఁ జేసి చని యాచార్యుం దగం గాంచి సు
స్థిరభక్తిఁ జతుర్థవేదముఁ బఠించెన్ ధర్మనిర్మాతయై.[1]

* వ. అనుచును. క. ఈకండముఁ జదుపుచు. 1. నిర్మీతమై.

సీ. ఈవిధంబున నొక్కయెలుక ధర్మము సేయఁ
చింతించునంతలో సిద్ధి యయ్యె
సర్వలక్షణముల సంపూర్ణుఁ డవు నీవు
నీతలంపున నిది నిండు టరుదె
యదిగాన నొండెద్దియైన నన్నడుగుము
నావుడు వసుమతీనాయకుండు
చెలువుగట్టించిన సెట్టిధర్మం బెల్ల
సుడివడకుండఁగ నడపు తల్లి!

యేనొనర్చినట్టి యీచేత మానవు
లెఱుఁగకుండఁ జేయు మిదియచాలు
ననుచు మ్రొక్కి వీడుకొని గూఢచారియై
యిచ్చమెచ్చి మగిడి వచ్చెఁ బురికి. ౧౫౭

క. ఓరాజ యతని సరిగా
నీరీతిగుణంబు లేక యొక్కరు మనుజుల్
ధారానాయకుఁ డతి వి
స్మేరకుఁడై మగిడె నోము సిగ్గున వ్రాలన్. ౧౫౮

:— తొమ్మిదవబొమ్మ కథ :—

వ. అంత నొక్కనాఁడు నవమద్వారంబునం బ్రవేశింపఁ గడంగి.

క. నలువకు నెల వగుతమ్మియు
వలిపం బగుపచ్చపట్టు వలయపుటలుగుల్
నెలిగుల్లయు వనమాలయుఁ
గలిమియు మానికము మేనఁ గలిగిన వేల్పుల్. ౧౫౯

ఉ. భక్తిఁ దలంచి భోజుఁడు శుభం బగులగ్నమునందు హాళిపై
మౌక్తిక శేషలొప్ప హితమాగధవందివనీపకద్విజా
ముక్తజయానులాపములు మున్నుగడంగెడు నంతనంత నా
సక్తసువర్ణపుత్రిక వెసం బలికెన్ నృపు నడ్డపెట్టుచున్. ౧౬౧

గీ. వినుము భోజరాజ విక్రమార్కుని బోలి
సత్త్వధైర్యములను జాలకునికి
దివ్యపీఠ మెక్కఁ దివురుట పిచ్చుక
కుంటు శైలమెక్కఁ గోరుటయ్యె. ౧౬౨

మ. అనుచు న్నిల్చి యతండు వాని బలధైర్యంబుల్ దగం జెప్పమా
యనఁ బాంచాలిక పల్కె నాతఁడు రణవ్యాపారపారంగతుం
డిన తేజోంశభవుండు సాహసఘనుం డింద్రాదిమిత్రుండు స
జ్జనరక్షామణి యామ నుజ్జయిని రాజ్యప్రాజ్యుఁడై యేలఁగన్.

గీ. భట్టిమంత్రి సైన్యపాలి గోవిందచం
ద్రుఁడు త్రివిక్రముఁడు పురోహితుండు;
నప్పురోహితునకు నాత్మజుం డగు కమ
లాకరుం డన నవివేకి గలఁడు. ౧౬౪

క. ఆకమలాకరుఁ డాకమ
లాకరసాదృశ్యముగ జడాశయుఁ డైనన్
శోకము మదిఁ బొదలంగ వి
వేకము పుట్టింపఁ దండ్రి వెరవున[1] దూతెన్. ౧౬౫

క. చుట్టములకుఁ దలిదండ్రుల
కెట్టియెడం బ్రియము నెఱపనెడపని చదువుల్
గట్టిగ నెఱుఁగనిపుత్త్రుఁడు
పుట్టుట కులమునకుఁ దెవులుపుట్టుట చుమ్మీ. ౧౬౬

1. వెరచుచు దూతెన్—మూ. విద్యలు నేరఁడేని పశువేయగుఁగాదె గణించిచూచినన్.

క. విను ముత్తమ మగుపుట్టువు
గనుపట్టెడు నట్టిరూపు గలమోదుగుఁబూ
వును మూర్ఖుండును బ్రబలెడు
వనమున భవనమునఁ దగినవాసన గలదే. ౧౬౭

క. కులసతికి సిగ్గు క్షత్రియు
కులజునకుఁ జయము వర్తకున కోపికయుం
గలిమికి వితరణమును వి
ప్రులకు న్విద్యయును దగినభూషణము లగున్. ౧౬౮

క. పసులకు సోదరులకు భూ
వసులకుఁ గొనరాదు సర్వవశ్యము తా నె
వ్వరి కిచ్చినఁ గోటిగుణో
త్తరవృద్ధి భజించు విద్య తనధన మెపుడున్. ౧౬౯

క. పరభూమికిఁ జనుచోఁ ద
స్కరులకు నగపడదు వ్రేఁగుగా దెచ్చట నె
వ్వరి నైన హితులఁ జేయును
ధరలో మఱి విద్యఁ బోల ధనములు గలవే. ౧౭౦

ఉ. గద్యముఁ బద్యముం బెనుపఁ గైకొను టొండె, ధ్రువాప్రబంధసం
పద్యుతుఁడౌటయొండె,మృదుభాషలఁ బ్రొద్దులు పుచ్చుటొండె,లో
కోద్యమలక్షణం బెఱుఁగు టొండెఁ, గడు న్భజియించుఁగాక యే
విద్యలు నేరఁ డేనిఁ బృథివిం బశు వాతఁడెగా గణింపఁగన్.[1]

శా. సంగీతంబుఁ గవిత్వతత్త్వమును సౌజన్యంబు భావంబు స
త్సాంగత్యంబు నెఱుంగఁ డేని భువి నాశ్చర్యంబుగా వాలమున్
శృంగద్వంద్వములేని యెద్దతఁ డనం జెల్లుం దృణం బాతఁ డ
య్యాంగీకంబున మేయఁ డాపసులభాగ్యం బిచ్చటం గల్గుటన్.

1. గణించిచూచినన్.

సీ. అనుచు నెగ్గించిన నాకమలాకరుం
డభిమానియై తనయాత్మలోన
విద్యలు నేర్చి వివేకినై కాని యీ
జనకువక్త్రము చూడననుచు వెడలి
కాశ్మీరదేశంబుకడ కేఁగి యొకయూరఁ
జంద్రకేతుం డనుసంజ్ఞఁ బరఁగు
నుత్తమద్విజుఁ గొల్చియుండఁగా నాతండు
క్రమమున సిద్ధసారస్వతంబు
కరుణ నొసఁగిననతఁడు సాంగంబుగాఁగ
నాల్గు వేదములును గావ్యనాటకములు
దర్శనంబులు నీతిశాస్త్రములు దివిరి
కలయ సంగీతసాహిత్యకళలు నేర్చి. ౧౭౩

వ. అభిజ్ఞుండై గురునానతివడసి తిరిగి దేశవిశేషంబులం జూడంజరి
యించుచు నొక్కనాఁడు. ౧౭౪

క. [1]కాంచనమణిమయరుచికలి
కాంచితనిజసాలవలయ మై భూమిసతీ
కాంచీగుణ మన మించిన
కాంచీపట్టణము నతఁడు గాంచెం గడఁకన్. ౧౭౫

క. ఆనగరమునకుఁ జని జయ
సేనుం డనురాజుచేతఁ జిత్రంబగు వి
ద్యానిపుణతఁ బూజ్యుండై
యానెపమునఁ గొన్నిదినము లచ్చట నిలిచెన్. ౧౭౬

వ. అంత నొక్కనాఁ డతనియెదుట విటలోకమోహిని యను వార
కామిని లలితవిలాసిని యై పొలసె నది యెట్టి దనిన. ౧౭౭

(1.) కాంచనమయతటరుచికలి, కాంచిత- కాంచనమణిమయ తటరుచి, కాంచిత-

సీ. శృంగారరసములోఁ జేవశోధించి వి
రించి యీసతి నొనరించెనొక్కొ
మెఱుపు లన్నియుఁ గూర్చి మెదపి రూపుగఁ జేర్చి
యీ సరోజాననఁ జేసెనొక్కొ
కాక బంగారులోఁ గాంతిసాధించి యీ
చంచలనేత్రఁ గావించెనొక్కొ
యుడురాజుఁ జేపట్టి పిడిచి సారంబున
నీపడంతుక రచియించెనొక్కొ

చక్కఁదనము నెల్ల నొక్కచోటను గూడఁ
గూర్చి యీ నెలఁత నొనర్చెనొక్కొ
యనఁగ రత్నపుత్రికాకృతి రసికుల
చూపుగములకెల్లఁ దీపు లొసఁగు. ౧౭౮

క. ఆకామినిఁ గనుఁగొని కమ
లాకరుఁడు ప్రమత్తచిత్తుఁడై కందర్పో
ద్రేకమునఁ జేరునెడ నా
లోకించి యొకండు వింతలుగ నిట్లనియెన్. ౧౭౯

క. ఈనరమోహినిఁ బొందం
గా నేఁగినరాత్రి వచ్చి ఘనదంష్ట్రుం డన్
దానవుఁడు చంపుఁగావున
సానింబడనేల తిరిగి యరుదెె మ్రొటకున్. ౧౮౦

ఉ. నావుడు నుల్కి భూమిసురనందనుఁడు న్నరమోహినీరతే
చ్ఛావిరతాత్ముఁడై నిలిచి సత్యముగా జనులెల్లఁ జెప్పఁగాఁ
డా విని చోద్యమంది వసుధావరు పీఠిఁ గాని యొయ్య నొయ్య వి
ద్యావినయాఢ్యుఁడై తిరిగి తండ్రిఁ గనుంగొన వచ్చె నూరికిన్.

మ. అచటం దల్లికిఁ దండ్రికి న్వయస సాష్టాంగంబుగా మ్రొక్కినం
బ్రచురప్రేమరసాకృతిం బ్రమదబాష్పస్యంద మందంబుగా
రచితాలింగను లై, కుమారక ! సుధీరత్నంబవై వచ్చితే
సుచరిత్రా! యిది భాగ్య మంచు మదిలో సొంపొంది రాదంపతుల్

శా. తద్యోగంబునఁ దండ్రి మిక్కిలియు నాత్మంబొంగి సద్వృత్తికిం
జోద్యం బంది యనంతరంబ ధరణీశుం గానఁగా నేఁగి నా
యుద్యోగంబున జాణ యయ్యె నని యేనూహించెదన్ వీనికిన్
విద్యాచాతురి గల్గు టీవు కరుణ న్వీక్షింపుమా నావుడున్.

మ. క్షితినాథుండు సిజాదరంబునఁ గృతాశీర్వాదుఁడై నవ్వారో
హితపుత్రుండు సభాస్థలి న్బుధగణం బింపొందఁగాఁ దా నకం
పితుఁడై శాస్త్రపురాణకావ్య నిగమస్మృత్యర్థ సంగీత సం
గతి మర్మజ్ఞతతోఁ బ్రసంగ మొలమిం గావింపఁగా ని ట్లనున్.

క. యత్నమునఁ దెలియ నన్నియు
రత్నాకరుభాతి దుస్తరం బగు విద్యా
రత్నము గవితాతత్త్వము
నూత్నముగా నందుఁ గలుగు నును పెఱిఁగితివే. ౧౮౫

క. నావుడు కమలాకరుఁ డను
దేవా నీ వానతిచ్చితివి నిజ మది, వి
ద్యావారిధి కడ గానఁగ
నావారిజభవునకైన నలవియె తలఁపన్. ౧౮౬

గీ. అట్ల యయ్యు సంస్కృతాదిభాషలు నేర్చి
కవిత యొఱిఁగి యెల్లకడలఁ దిరిగి
తెలిసినాఁడ నిచటఁ గల లక్షణముకంటె
నూతనంబు లేదు భూతలేంద్ర. ౧౮౭

క. గణములు గణవర్ణంబులు
గణతారలు గణరసములు గణదేవతలున్
గణజాతులు గణఫలములు
గణుతింపఁగ నొక్కవిధము కవితల కెల్లన్. ౧౮౯

వ. ఇట్టి విధం బయ్యును నంధ్ర మండలంబునం [1] గోణదేశంబునం దెలుఁగుం గవితకు ప్రాలు[2] వళ్లు నను నియమంబులు చూచినాఁడ నవి యెయ్యెడం దఱచుగాకుంట నపూర్వం బవధరింపుము.

శా. పుణ్యస్త్రీకి గుణంబు[3] మంగళగుణంబు న్సొమ్ములై యొప్పఁగాఁ
బణ్యస్త్రీకి సువర్ణ మౌక్తిక సురూపవ్యక్తి భూషాకృతుల్
గణ్యం బౌగతి సంస్కృతంబునకు వాగ్భావంబు శబ్దంబు లా
వణ్యాకారము లౌఁ దెనుంగునకుఁ బ్రాల్వళ్లుం గడు న్వన్నియల్.

గీ. పలుదెఱంగులైన పలుకులు గలిగియుఁ
బ్రాలు వళ్ళు లేని పేలుగవిత
వన్నెలెల్లఁగూర్చి వ్రాయుచోఁగాఁబుక
వన్నెలేని ప్రతిమ వ్రాఁతఁ బోలు. ౧౯౧

క. తప్పక వళ్ళును బ్రాలును
ముప్పిరిగొనఁ దగినశబ్దములు నేర్పెఱఁగెక్కం
జెప్పినకవితాచాతురి
యొప్పము వెట్టినపసిండియొఱపున మెఱయున్. ౧౯౨

క. పాదముల వళ్ళుఁ బ్రాసము
లాదిమము ద్వితీయ మైనయక్షరములు త
త్పాదంబుల యతు లవిసం
వాదముగాకుండఁ దగినవ ళ్ళిడవలయున్. ౧౯౩

1. గణదేశంబున- 2. వ్రాలు-ప్రాలునని రెండురూపములుగలవు. 3. గణింప.

వ. అందు వళ్లన్నవి—స్వరవళ్లు, వ్యంజనస్వరవళ్లు, గూఢస్వరవ్యంజనవళ్లు, వర్గవళ్లు, సరసవళ్లు, నెక్కటివళ్లు, సంయుక్తవళ్లు, ననుస్వారవళ్లుం, బోలికవళ్లు, వృద్ధివళ్లుం, ప్లుతవళ్లు, నిత్యసమాసవళ్లుం, బ్రాదివళ్లుం నాఁ ద్రయోదశవిధంబులయ్యె నందు స్వరవళ్లెట్టి వనిన. ౧౯౪

క. అద్వయ నైఔలకు నా
నిద్వయము ఋఋలు గూడ నేఏలకు నా
నుద్వయ మూ నోఓలకు
విద్వన్నుత వళ్లు సెల్లు వీడ్వడఁ దమలోఁ౯. ౧౯౫

ఇంక వ్యంజనస్వరవళ్లు—

క. ఈకోలదిఁ గాక కాదులు
గైకొని చెప్పుదురు వళ్లకడ నీస్వరముల్
పైకొనఁగఁ దత్స్వరంబులు
నాకడ వళ్లౌ నృపాలకాన్వయతిలకా. ౧౯౬

ఇంక గూఢస్వరవ్యంజనవళ్లు—

క. అన్యోన్యపరీక్షాదిప
దన్యాసములందు సంస్కృతస్వరములు[1] పూ
ర్వాన్వాయంబుగ నగు న
న్యోన్యము వడి హల్లుసెల్లు నూతనకర్ణా. ౧౯౭

ఇంక వర్గవళ్లు—

క. రమణీజనమన్మథ భూ
రమణా నిజపంచమాక్షరము వర్జ్యముగాఁ
దమనాలుగక్షరమ్ములుఁ
దమలోఁ వళ్లయ్యెఁ గచటతపవర్గములఁ౯. ౧౯౮

1. సంభృతస్వరములు.

ఇంక సరసవళ్లి—

క. నయముగ చఛజఝశషసలు
నయహాలు నణలును జెలంగు[1] యతి మీఁద నసం
శయగతిఁ దమలో వీడ్వఁడు
జయలక్ష్మీ శ్రీయువతిభోగసౌభాగ్యనిధీ.[2] ౧౯౯

ఇంక నెక్కటివళ్లి—

క. నరవరవంశవిభూషణ
మరవఱలను వళ్లిగిం దమకుఁ దామె యగుఁగా
ధరజ్ఞణాలు మొదలవిన మం
తరపదములఁ గలుగు నేని దగునట్టులగున్. ౨౦౦

ఇంక సంయుక్తవళ్లి—

క. బుధసమ్మతి మిశ్రితబహు
విధవర్ణములందు వళ్లి వివరింపంగా
నధరీకృతఫల్గునశౌ
ర్యధరనిభా యొల్లయక్షరమ్ములఁ జెల్లున్. ౨౦౧

ఇంక ననుస్వారవళ్లి—

క. అమరఁగ వర్గస్థితవ
ర్ణములపయిఁద బిందులూఁదినం బంచమవ
ర్ణములును వళ్లగు జయసం
భ్రమపరిచితపరనృపాల మానితకీర్తీ. ౨౦౨

ఇంకఁ బోలికవళ్లి—

క. పోలును[3] బుఫుబుభులకు మూ
పోలికవడి యనఁగ నంత్యమున యతి మీఁదం
దేలి బుకారముపట్లను
భూలోకసురేంద్ర యోగ్యముగఁ జనుదెంచున్. ౨౦౩

1. వెనంగి. 2. సౌందర్యనిధీ. 3. పోలఁగ.

క. తెలుఁగుననది కెడి శబ్దం
బులమీఁదిమకార మందముగ స్వాత్త్వమునన్
నిలుచు నట పావడికిన్నై
పలుకుటకంటెను భజించుఁ బావడియైనన్. ౨౦౪

ఇంక వృద్ధివళ్లు—

క. సుగునైధిత నగరౌషధి
నగౌఘనై కౌదియోజనలసంధులఁ బెం
పుగ వృద్ధు లండ్రు వానికి
నగు నయమాలు వళ్లు సరవశౌఘశరణ్యా. ౨౦౫

ఇంకఁ బ్లుతవళ్లు—

క. గానప్రశ్నవిధానా
హ్వానములఁ ద్రిమాత్రమైన యత్వము నుభయా
ధీనమునై వళ్లకుఁ జన
నా[1]నిది నీవేమి యెఱుఁగవా సర్వజ్ఞా. ౨౦౬

ఇంక నిత్యసమాసవళ్లు—

క. డాయఁగ సమసింపఁగఁ బా
రాయణ నారాయ ణాంతరం గానేకా
నాయాసాదులఁ గర్ణర
సాయనముగ రెండువళ్లు జరగుచునుండున్. ౨౦౭

క. ఇది చేతిది పోచక పి
న్నది కట్టెఁడు దానికంటె నల్లల ననునీ
పదముల నుభయమునోన ను
న్నదివళ్లకు ననుమతంబు నరలోకేంద్రా. ౨౦౮

1. జనఁగా.

ఇంకఁ బ్రాదివళ్లు—

క. మేదినిఁ బ్రపరిప్రతిసప
రామునుపాపాత్యవవినిరాజన్యభిసం
సూదప్యధులన నిరువది
ప్రాదులు యతి తత్స్వరములు హల్లులుఁ జెల్లున్. ౨౧౯

సీ. ప్రమదాజనేక్షణప్రార్థితసౌందర్య
యాచకసంతతిప్రార్థనీయ
పృథ్వీసురప్రజాభీష్టసంధాయక
యిభముఖ్యసైనికాభీష్టయాత్ర
పరమధర్మక్రియోపాయసంచితకీర్తి
యరిదుర్గసాధనోపాయవేది
వివిధశాస్త్రాగమవీక్షణతాత్పర్య
యిందిరాసత్కృపావీక్షణీయ

రాజనీతిగుణనిరంతరవైభవ
యష్టసిద్ధిబలనిరంతరాయ
ప్రాదివళ్లి కిది యుదాహరణం బయ్యె
విద్వదంబుజార్క విక్రమార్క. ౨౨౦

వ. మఱియుం బ్రాసంబు లన్నవి దుష్కరప్రాసంబు, ద్విప్రాసంబు, త్రిప్రాసంబు, చతుష్ప్రాసం, బంత్యప్రాసం, బనుప్రాసంబు నన నాఱుదెఱంగులయ్యె నందు దుష్కరప్రాసం బన్నది. ౨౨౧

క. దృఙ్మంజులవిలసన్మృగ
దృఙ్మన్మథరూప వసుమతీవరతిలకా
దిఙ్మండలభరితయశ
స్స్రిఙ్మండన యిట్లు దుష్కరప్రాస మగున్. ౨౨౨

ద్విప్రాసము :—

క. నవరసములు నమరం బడ
వివరణభరణీయమైన వెరవునఁ గావ్య
ప్రవరమతులైన కవులీ
వివరంబునఁ జెప్పిరేని ద్విప్రాస మగున్. ౨౧౩

త్రిప్రాసము :—

క. సరములుగూర్చినక్రియఁ న
క్షరములు పాదములఁ గలయఁ గవిరాజమనో
హరము లన సముచితార్థ
స్థిరములుగాఁ జెప్ప నిట్లు త్రిప్రాస మగున్. ౨౧౪

చతుష్ప్రాసము :—

క. భూషణముగఁ గైకొని రస
పోషణముగఁ గాలు నర్థపోషణమున ని
ర్దూషణముగఁ జెప్పిన కవి
తోషణముగఁ గృతుల నివి చతుష్ప్రాస మగున్. ౨౧౫

అంత్యప్రాసము :—

క. అనుపమపుణ్యవిశేషా
ఘనబలవిద్వేషినికరఖండనరోషా
వినయనయవినుతవేషా
విను మంత్యప్రాస మయ్యె విక్రమభూషా. ౨౧౬

అనుప్రాసము :—

క. ఈప్రాసప్రకరంబు శ్రు
తిప్రసవదళప్రభాప్రదీప్తం బై లో
కప్రకటార్థప్రసృతి న
నుప్రహితం బైనచో ననుప్రాస మగున్. ౨౧౭

క. అని లక్షణయుక్తముగా
వినిపించిన సంతసించి విభుఁ డద్దేశం
బునఁ బరఁగెడు సుడుగులఁ గల
నునుపునఁ బద్యంబుఁ జెప్పుమనుడు నిట్లనియెన్. ౨౧౮

సీ. పొదలినకూటమి పిదప మెల్పునఁ గల
గనయంబు డాకేలఁ గొని తెమల్చి
పోఁడిమి గలపాఁపజేఁ దనుసెజ్జపై
నూఁతగా వలకేల నొయ్య హత్తి
క్రొమ్ముడిఁ జెరిపిన కమ్మనిక్రొవ్విరు
లెడలి వెన్నున జాఱి కడలుకొనఁగ
లేచి వేంచేయుచోఁ జూచి నెన్నుఁదు సొంపు
రెట్టింపఁ గమ్మఱఁబట్టి యెడఁదఁ
దమక మినుమడిగాఁగౌనుదక్కఁదొడిగి
బిగువుఁగౌఁగిటఁ గదియంగఁ దిగిచి తివుట
మోవిగదియంగఁ గోర్కులుమీఱిఁ బుచ్చు
కలిమి యాబిడ చూడ్కులుగాచుఁగాత. ౨౧౯

వ. అని చదివినం జెవులకుం జవులు చిలుకు నచటి పలుకులకు సరస భావంబులకుం బులకించి నృపతితిలకుం డచటి యాబిడ యను శబ్దం బది స్త్రీవాచకంబుగదా యనవుడు విద్యాకరుం డగుకమలాకరుం డిట్లనియె. ౨౨౦

సీ. ఎలనాఁగ తొయ్యలి యింతి ముద్దియ నాతి
ప్రోయాలు పొలఁతుక పువ్వుఁబోణి
చెలువయుఁ గలకంఠి చేడియ నెలఁతుక
మగువ మెఱుఁగుఁబోఁడి మచ్చెకంటి

యుగ్మలి యీబిడ యువిద వాలుంగంటి
యన్ను చిగురుఁబోణి యతివ పడఁతి
లేమ క్రాల్గంటియుఁ జామ పొలఁతి కొమ్మ
తీఁగఁబోఁడి మడఁతి తెఱవ బోఁటి

వెలఁది ముదిత గొంతి నాలఁతుక పడఁతుక
నెలఁత యిగురుఁబోఁడితలిరుఁబోఁడి
యనఁగ సతులపేళ్లు తెనుఁగున నలువది
వెలయుచుండు నిట్లు విక్రమార్క. ౨౨౧

వ. అనిన నచ్చాతురికిం బరిణమించి ధరణీరమణుం డారీతి రత్నమాలిక యతని యఱుత నిడి కర్ణానందంబుగా నాకర్ణించితి విలోకానందంబుగా విలోకించితి నిట్టి దెద్దియేనియు వింత గలిగినఁ జెప్పు మనవుడు నాకమలాకరుండు. ౨౨౨

క. అవనీశ నీగుణంబులు
చెవులకుఁ జవు లొసఁగి విందు సేయుచునుండున్
నవలావణ్యమయం బగు
భవదాకృతి చూపు గనులపండువ గాదే. ౨౨౩

మ. జగతీనాయక సర్వవిస్మయనివాసం బైన నీ విప్పు డిం
పుగ నన్నచ్చెరు వేమి గంటి వని సంబోధించి తేఁ జెప్పఁగాఁ
దగ ద ట్లయ్యును విన్నవింతు నిజవిద్యాకాంక్ష నాఁ డేఁగి యొ
క్కటిన్ సస్యఫలప్రశస్యతలమౌ కాశ్మీరదేశంబునన్. ౨౨౪

సీ. అగ్రహారములోన బుధాగ్రగణ్యుఁ
జంద్రచూడుని గురునిఁ బ్రసన్నుఁ జేసి
సిద్ధసారస్వతమున వాక్సిద్ధి వడసి
వేడుకొని తిరిగితిని నావిద్య మెఱసి. ౨౨౫

మ. భవదాజ్ఞావశవర్తులౌ నృపులతో భాషించుచు న్వచ్చి వ
చ్చి వియత్సంచరరమ్యహర్మ్యగణమై చెల్వారు కాంచీపురం
బవలోకించి యటేఁగి యందు జయసేనాఖ్యున్ విభుం గాంచి యు
త్సవలీల న్నిలనాళ్లు నిల్చితి మనస్సంభావ్యసంభావనన్. ౨౨౬

క. ఆవీటను నరమోహిని
నానెలయుచు నిఖిలమోహనం బైన మహా
లావణ్యంబున మరుసం
జీవనిక్రియ నున్న యొక్క చెలువం గంటిన్. ౨౨౭

సీ. క్రాలుగన్నుల నెమ్మొగమ్మున గళమున
నబ్జవిజృంభణ మాలిసేయు
జఘనస్థలంబునఁ జనుఁగవ నతనాభిఁ
జక్రవైభవము నతిక్రమించు
స్వరమునఁ దనుమార్దవమున బింబాధర
ద్యుతిఁ బ్రవాళగుణంబునోటుపఱుచుఁ
బదతలంబుల మురిపంబులఁ బయ్యెదఁ
బల్లవరాగంబు ప్రబలఁ బొలయుఁ

గన్నయంతన కన్నులకఱవు దీర్చు
నట్టిరూపంబు వర్ణింప నలవి గాదు
చెప్పవచ్చునె పడియచ్చు సేయఁ దరమె
రక్షణోపేంద్ర విక్రమార్కక్షితీంద్ర. ౨౨౮

గీ. ఆనెలఁత రాక్షసాశ్రిత యాటఁ జేసి
పాముతల నున్నరత్నంబుభాతి నుండుఁ
గోరి యెవఁడైన దానిని జేరెనేని
దానవుఁడు రేయి పఱతెంచి వానిఁ జంపు. ౨౨౯

మ. ఇది చిత్రం బని చెప్పిన న్విని ధరిత్రీశుండు కౌతూహలం
బు దలిర్పం గమలాకరా యచటియంభోజాననం జూడనే
గుదమే రమ్మని వానిఁ దోడుకొనుచుం గ్రూరాసి చేఁదోడుగాఁ
గదలెం గాంచికిఁ గాంచనాంచితనిజక్ష్మాకామినీకాంచికిన్.

వ. ఇట్లు కతిపయదివసంబుల కాపురి సొచ్చి గూఢవేషంబునం దిరు
గుచు రాజమార్గంబున నున్న నరమోహినిం జూచి తదీయలావణ్యా
పయోధిలో మునిఁగినదృష్టిం దివియంజాలక తన్నుఁ దాన సవ
రించుకొని. ౨౩౧

క. సురకిన్నరపన్నగఖే
చరకన్యలఁ జూచినాఁడ సరిపోల్పఁగ నే
తరుణులు లే రీతరుణికి
నరమోహిని యనఁగ నున్ననామంబ తగున్. ౨౩౨

క. చూపులు మర్మము గాఁడెడు
తూపులు మురిపములు వలపుఁదూపులసరికిం[1]
బ్రాపులు సతినిలు వంతయుఁ
దీపులు నగు మన్మథాస్త్రదేవతచుమ్మీ. ౨౩౩

క. ఈపోలఁతి రాక్షసాశ్రిత
యై పన్నగసహితచందనాకృతి మెఱయున్
దీపితయై వెలిపించెడి
వ్యాపారముకోలఁదిఁ జూడవలయును మనకున్. ౨౩౪

క. కావున నీ వింటికిఁ జని
నే వచ్చెద ననుచుఁ జెప్పు నేలఁతుక తోడన్
నావుడుఁ గమలాకరుఁడును
నా వెలఁదికిఁ జెప్పి వచ్చి నరపతి కనియెన్. ౨౩౫

1. మరుకున్.

గీ. దేవయీమాటఁ జెప్పినఁ దెఱవనవ్వి
యొయ్యఁ బలుకుచునిదురకునియ్యకొనుచుఁ
గప్పురం డనునొక్కరక్కసుఁడు గలఁడు
వాని మఱవక రమ్మని వనితచెప్పె.[1] ౨౩౬

క. నావుఁడు నావీరవరుం
డావిప్రునిచేతఁ బోఁక లాకులు విరులుఁ
రో నెలయుం దగఁ బంపిన
నా నెలఁదియు నందుకొనియె నతివిస్మిత యై. ౨౩౭

సీ. అయ్యెడ దశరథునాజ్ఞపోలిక బ్రహ్మ
కట్టడిఁ గాలంబు గడవరాక
జనకజ కెనయైన దినలక్ష్మి తనతోడు
నీడకై వడిఁ దోడఁ గూడినడువ
సౌమిత్రిగతి [2]మునిసవనంబునకు మున్ను
దోడైనయరుణుండు తోడుగాఁగ
సాకేతపురిలోని జనులవక్త్రంబుల
వడువున జలజము ల్వాడువాఱఁ

గైకవంకవారిపగిదిఁ గలువ లుబ్బఁ
జిత్రకూటముక్రియ నస్తశిఖరి దాఁటి
రాక్షసులభంగి నటఁ దిమిరంబునడువ
వనముసొచ్చె రఘువరుసవరుస నినుఁడు. ౨౩౮

గీ. గడియకుడుకభంగి గ్రహరాజు జలధిలో
గ్రాలఁ జుక్కలు దలఁబ్రాలుగాఁగఁ
గెంపు హోమవహ్నిక్రియ నొప్పఁగా ద్విజ
రాజు పెండ్లియాడె రాత్రిసతిని. ౨౩౯

---

1. నొక్కచిక్కుమగలదొక్కరకసుండు. చేరిచనుదెంచు నీవింతఁ జేరుమనియె.
2. సాహసమునకుమున్నుగా.

క. నలఁగినవిరులును గుఱుమా
పులయిన చీరలును నుదుటి బొట్టులు నెడగా
జులుఁ గమ్మటాకులును సొ
మ్ములుగాఁ దమక్రంతలందు మురిసిరి జంతల్. ౨౮౦

సీ. తిలకంబుఁ గొప్పపువ్వులుఁ బూఁతలును గను
పట్టఁగా మెలఁగెడుదిట్టవిటులు
నిఱుకింద్లఁ బాతికపరక కొంగున ముడ్చి
కొని ముసుంగిడి చొచ్చుగూఢవిటులు
బోఁటికత్తియలు పల్మాటును బిలువఁగా
మెరవడిఁ దామేఁగు మేటివిటులుఁ
గనియుఁగానకయుండఁగా నోరముసుఁగుల
నగపడ్డచో నిల్వఁ దగినవిటులుఁ

బెట్టలేమి వెడలఁగొట్టిన చోటికిఁ
బొంచి పడపుచెఱచు క్రించువిటులుఁ[1]
గ్రందుకొనఁగవారకాంతలవాడలఁ
బచ్చవింటివాఁడు పెచ్చుపెరిఁగె. ౨౮౧

వ. అట్టియెడఁ గొందఱు విటులు లంజియలతల్లుల బిఱుసులకు వెఱచి యందఱు నొక్కెడంగూడి తమలో ని ట్లని వితర్కించిరి. ౨౮౨

క. మును మున్నుగ గొఱియలుఁ గూ
డును మొదలుగ నిడక చనువిటునిఁబణ్యస్త్రీ
జనని మెడ విఱిచి కొను నది
ధనముపయిం గాచియున్న దయ్యము చుమ్మీ. ౨౮౩

వ. అనుడు మఱియు నొకరుం డి ట్లనియె. ౨౮౪

1. చొచ్చివెరవు చెరచివుచ్చువిటులు.

క. వారాంగన మధురసవి
స్తారాకృతి యనఁగఁ జెల్లుఁ దజ్జసని విటుం
జేరఁగనీ దచ్చట సహ
కారఫలము పొంతనున్న కడుఁదురు సుమ్మీ. ౨౪౫

వ. అనిన మఱియు నొక్కరుండు. ౨౪౬

క. వెలయాలితల్లి కూఁతుం
గలఁచి విటుఁడు వచ్చెనేనిఁ గలుపించినఁ దాఁ
దలతోన మ్రింగునది ని
ర్మలజల మగు మడుఁగులోని మకరము సుమ్మీ. ౨౪౭

వ. నావుడు నితరుండు. ౨౪౮

క. పరికింప లంజతల్లికి
దొరయైనను మచ్చుఁడైన దొరికినఁ జాలుం
బొరిగొను నది యీపురిలో
నరమోహిని నంటియున్న నరభోజిసుమీ. ౨౪౯

వ. నా విని యపరుండు ౨౫౦

క. పుడమి నీఁక లంజతల్లిం
గడుమీఱిన యట్టికీడు గలదే యది యొ
య్యొడఁ జూచినఁ గూఁతునకు
న్నెడకోణము దొడ్డ గుదియ[1] మిండలకెల్లన్. ౨౫౧

వ. అనవుడుఁ దోడివాఁడు. ౨౫౨

క. ఆకూఁతుఁ గన్నయప్పుడ
చేకొని తజ్జననియాకుఁ జింపక వెడఁగై
లోకేశుఁడు పాపమునకుం
గాకికిఁ గలయాయు వేల కలుగఁగఁ జేసెన్. ౨౫౩

వ. అనినం దత్సఖుండు. ౨౫౪

1. త్రాపుగుదియ.

ఉ. ప్రేమరసంబు తేటలనఁ బెక్కు గుణంబులు గూర్చి వారకాం
తామణులన్ సృజించి పరతంత్రతఁ ద్రోయఁగనున్న దిగ్గనం[1]
డామరచూలి లంజియలతల్లులఁ జంపఁడు లంజకాఁడు గా
కేమనవచ్చు నాతని నశేని విటావలి నిస్తరింపఁడే. ౨౫౫

వ. అని పెక్కువిధంబుల వితర్కించుచున్న మఱియు నొక్కెడం గొందఱు సుందరులు పానగోష్ఠికిం గడంగి కాదంబంబును, మాధవంబును, నైక్షవంబు, క్షీరంబు, నాసవంబు, వార్షంబు, రతిఫలంబులనఁ బాకభేదంబుల మూలస్కంధకుసుమఫలసంభవంబుల బహువిధంబుల మధురంబులైన మధువిశేషంబు లెల్లం బరిమళద్రవ్యపరిమిళితంబుగాఁ గూర్చి పాత్రంబుల నించిన- ౨౫౬

క. అతిమధురంబై నసిజా
మృతరసములకంటె నిదియ మే లని తారా
పతి చేరెనొక్కొ యనఁ ద
త్ప్రతిబింబము లలరె దివ్యపాత్రంబులలోన్. ౨౫౭

వ. అప్పుడు. ౨౫౮

సీ. కామాక్షికిని మహాకాళికిఁ జండికి
నక్కజియ్యకుఁ[2] గాళి కంబికకును
వింధ్యవాసిని కేకపిరకు మున్నుగా
నెల్లవేల్పులకు బిందించి మ్రొక్కి
త్రావుచు నెడనెడఁ దాల్పుఁగా వండిన
వంజుటిపౌరకలు నంజుకొనుచు
గుక్కెఁడు చవిచూడు మక్క యీమధు వని
తీపులు దమలోనఁ జూపుకొనుచు

1. తొదవయున్నదెగ్గుణా. 2. గన్నజియ్యకు.

నెట్టివస్తువు ల్గడియించెనీతఁడనుచు
బ్రహ్మఁ గొనియాడి యిదెసాఁకఁబెట్టుమనుచుఁ
బొట్టఁగోలఁదిగఁ బోంట్లకుఁ బోసిపోసి
పరిణమించిరి యొండొండఁదనుజులెల్ల. ౨౫౯

సీ. ఈవారుణీరసం బీశుండు దన కని
సమకూరకునికి విషంబు ద్రావె
మధువైరి యగుట నీమధువున కెడరయ్యె
హరి మాధవాఖ్యను శరణుసొచ్చె
నీసుర లేక గంగాసార మున్న యా
తలఁ జేరెఁ జంద్రుండు బలుపుదక్క
యీమదిరాస్వాద మెడలి విఘ్నేశుండు
పొగులఁగా లోలోనఁబొట్టయుబ్బె
నిట్టిమద్యము గని పట్టి త్రావఁగలేక
శక్తిసేవసేసె షణ్ముఖుండు
అనుచుఁ జతురులైన యతి వన్నెరేఁడుంబుఁ
బొగడుచుండ నొక్కపోలఁతివలికె. ౨౬౦

క. పరిమళముఁ గొన్నయంతనె
పరవశమై మేను హర్షభరితం బగు నీ
సుర గలుగ నమృతమునకై
సుర లంబుధిఁ ద్రచ్చి రిట్టిచోద్యముగలదే. ౨౬౧

వ. అనవుడు నొకర్తు. ౨౬౨

క. సుఖములతల్లి మనోభవు
సఖి యీసుర దొల్లి శుక్రుశాపంబున స
న్ముఖులకు నెడగాకుండిన
నఖిలజనులచేత దక్కునా మన కనినన్.[1] ౨౬౩

1. నిఖిలజనులచేతఁ దక్కనేర్చునె మాకున్.

వ. మఱియొక్క స్త్రీ. ౨౬౪

క. ఎక్కడశుక్రునిశాపం
బెక్కడఁ గొందఱకు భాగ్య మించుక యైనన్
లెక్కకు నెక్కనికతమున
డక్కెఁజుమీ మధువులేర్పడ న్మనకెల్లన్.[1] ౨౬౫

వ. అని తమ నేర్పులం గొనియాడుచు నానందంబున మాటలు తొట్రుపడఁ బలుకుచుం బయ్యెదలు సవరించుటలు మఱచి లజ్జలు దొలంగ బహుప్రకారంబుల నున్మత్తభావంబులు దోఁపం బ్రవర్తిల్లి.

ఉ. ఇంపు మనంబులోన నటియింపఁగఁ జెక్కులమీఁదఁ గన్నులం
గెంపువహింప మోవిఁగల కెంపు చలింపఁగ ఘర్మబిందువుల్
పొంపిరివోవ ముద్దుమొగముల్ మెఱుపెక్క రతాంతసంగతిన్
సొంపువహించి రంగనలు సోలుచు నమ్మదిరామదంబునన్.

సీ. అక్కమీతల్లి మాయత్త[2] యా నెఱఁగిటిఁ
గోడలితల్లి నాకూఁతు రగుట
మాతల్లి మఱఁది మామామ సభ్యులక్రియఁ
నుయ్యెఁ[3] జంకిటనిడి యొయ్యనరిగె
మాబావకొడుకు నామఱఁది గాలపువేటఁ
గొమ్మలకుం దేలుఁ గొట్టితెచ్చె
నిది సెప్పఁ గొఱఁతని యిదికల్ల సేయక
చెవులారఁజూడు నేఁజెప్పినట్టు

లనుచు లోకవిరోధోక్తులాడుకొనుచు
సొలపులూరఁగ నోరచూపులునటింప
పట్టినగవులఁ జప్పట్లు నెట్టికొనుచు
నాడఁజొచ్చిరి చేడెలు పాడిపాడి. ౨౬౬

1. దక్కెం బో మధువు నేఁడు దగ మనకెల్లన్. 2. మాయక్క. 3. నొయ్య-నయ్య.

వ. ఇట్టివినోదంబులు సూచుచు విక్రమాదిత్యుండు త్రివిక్రమాపత్యంబు తోడరా నరమోహిని గేహంబున కేఁగి తదాళీపరిచరితసముచితోపచారంబులు గైకొని హంసతూలికాపర్యంకంబుపై సుఖాసీనుండై సరసవాక్యంబులం బ్రొద్దుపుచ్చి. ౨౬౯

క. నరమోహిని మీఁదకక్కనుఁ
డరుదెంచి తలంగకుండ నాలోపల ని
న్నరయుచు నుండెద నని భూ
సురయుతుఁడై యధిపుఁ డట్టిసాహసిక బుద్ధిన్. ౨౭౦

క. ఆలోన నొదిఁగి యున్నెడ
నీలాలక శయ్యమీఁద నిద్రింపఁగ నా
భీలనయనాంతదంత
జ్వాలలు నిగుడంగ నసుర వచ్చెం బెలుచన్. ౨౭౧

ఉ. అచ్చట నొంటినున్న సతి నాస్చుచు వేసె యదల్చి నీవిఁకుం
డెచ్చట డాఁగెదు జూతు మని యాడ్చి గృహాంగణసీమ కేఁగఁగాఁ
జెచ్చెర విక్రమార్కుఁ డొకసింహము చాడ్పున నేన నీఁడుగో[1]
వచ్చితినంచు నార్పుఁగొని[2] వచ్చెఁ గరాళకృపాణపాణియై.

క. అటువచ్చిన దనుజుఁడు గిట
కిటఁ బండులు గీఁటుకొనుచుఁ గినుకఁ బాటము యు
ద్భటవృత్తి నెగసినం గని
భటధర్మము దప్పి తోడి పాటికి ననుచున్. ౨౭౩

క. దుర్బలుఁడ నోరి నీదగు
దోర్బల మిది యెంత నన్ను దొరసెదు విను నేఁ
గర్బురుఁడఁ ద్రొల్లి నాచే
నర్బుదసంఖ్యలుగ మనుజు లణఁగిరిచుమ్మా. ౨౭౪

1. వీఁడకో. 2. నార్చుకొని.

శా. వారిం గూడఁగ నేఁగు మంచు గద నైవంజేరినన్ భీముఁ డా
కౌరవ్యేంద్రుని నేలఁ గూల్చుగతి నాత్మానాయకుండుం దదీ
యోరుద్వంద్వము నొంచి కూల్చి భువిదైత్యున్ ఖండతుండంబుగా
ఘోరాస్త్రాహతిఁ బ్రోవుచేసె, సుర లుత్క్రోశించి[1] వర్ణింపఁగన్

క. రక్కసుఁ డనియెడు చీఁకటి
నుక్కడఁపి శుభోదయమున నొప్పుచుఁ దమకున్
దిక్కైన విక్రమార్కుని
నక్కమలాకరుఁడు చూచి హర్షం బందెన్. ౧౭౬

క. తత్సాహసబలధైర్యస
ముత్సేకంబులకుఁ జోద్య మొందుచుఁ బ్రియసం
విత్సమ్మతి నరమోహిని
యుత్సుక యై మ్రొక్కి పలికె నోభూనాథా. ౧౭౭

క. నామంబున నరమోహిని
నా మెఱయఁగ వీనిచేత నరఘాతినినా
నామీఁద నున్నకీ డిదె
నీమాహాత్మ్యమునఁ బాసె నిమిషములోనన్. ౧౭౮

క. కావున నాకేవిధమునఁ
గావం బ్రోవంగ నీవ కర్తవు పను లౌఁ
గా వనక యొద్దిపంచినఁ
గావించెద నుడిగమునకుఁ గైకొను నన్నున్. ౧౭౯

గీ. అనుడు వసుమతివల్లభుం డల్ల నవ్వి
యొద్దిపంచినఁ గావింపనియ్యకొంటి
వనజలోచన జాతిఁ బద్మినివి నీవు
సరసగంభీరుని గమలాకరు భజింపు. ౧౮౦

1. సురలుత్క్రోశించి.

క. ఓకమలాకర మునునీ
వీకమలానన భజింప నింపొందితి నేఁ
డీకాంతామణిఁ గైకొని
యేకాంతక్రీడ నిలువు మిచ్చట సుఖినై. ౨౮౧

వ. అని పరస్పరకరగ్రహణంబు చేయించి. ౨౮౨

గీ. లంకలోని రాజ్యలక్ష్మి విభీషణు
కిచ్చి వచ్చి రాఘవేంద్రు పగిది
దితిజుఁ జంపి వారసతి నాశ్రితున కిచ్చి
విజయలక్ష్మిఁ గూడి విభుఁడు గదలి ౨౮౩

క. వాలుగంటి నిలువు మని
వాలాయింపంగ నేఁగవలయు ననుచు స
వ్యాలుమగఁడు మెఱుఁగారెడు
వాలు సహాయమునుగ మగిడి వచ్చెం బురికిన్. ౨౮౪

క. కావున నీకీగుణములు
లేనైనను గద్దె నెక్క లే విట మగుడం
బోవుట మే లనవుడు భో
జావనిపతి సిగ్గుపడుచు నల్లనఁ దిరిగెన్. ౨౮౫

శా. జీమూతాళికురంగనాభిశశిభృచ్ఛిహ్నమహేంద్రోపల[1]
వ్యోమేందీవరసామజాతయమునాహాలామాగ్నిధూమాంజన
శ్యామాకారు సమస్తకల్మషతమస్సందోహమార్తాండు ను
ద్దామానంతయశోభిరాముని రమాధాముఁ గుణస్తోమునిన్.

శా. సర్వాధీశ్వరకుందచందనపయశ్చంద్రాబ్జమందాకినీ
కర్పూరామృతహారహీరతుహినాకారానుకారాకృతిన్
దర్పారూఢపికద్విరేఫశుకబృందారామకోత్సాహకం
దర్పాటోపవనాంతదావదహనుం దైత్రిలోక్యరక్షామణిన్. ౨౮౭

1. శశిభృచ్ఛిహ్నమహేంద్రోపల.

మాలిని. వివిధసురవరేణ్యా వేదవేదాంతగణ్యా
భవతిమిరదినేంద్రా భక్తకారుణ్యసాంద్రా
సవినయజయులోలా సర్వలోకానుపాలా[1]
భవమధురిపురూపా భవ్యదివ్యస్వరూపా.[2] ౨౮౮

గద్యము. ఇది రాయగజగంధవారణ వైరిమండలికభేకఫణీంద్ర వీర ఘోట్టవిభాళాది బిరుదప్రకటచారిత్ర కళింగదేశనిర్ధూమధామ త్యాగనాగార్జునకర్ణాటద్రవిళాంధ్ర మహారాష్ట్ర భూపాలరూప నూపురసుందరచరణారవింద సనదప్రోలిపురవరాధీశ్వర వెలనాటిపృథ్వీశ్వరరాజ్యసముద్ధరణ శ్రీకొఅవి వెన్నయామాత్య పుత్ర హారితసగోత్రపవిత్ర సకలసుకవిమిత్ర కసనరాజతనూజ గోపరాజవిరచితంబైన సింహాసనద్వాత్రింశిక యను కావ్యంబునందు రత్నోద్భవుకథయును మూషకోపాఖ్యానంబును విక్రమార్కుని సాహసికత్వమహౌదార్యత్వంబులును గమలాకరు కథయు నన్నది చతుర్థాశ్వాసము.

---

1. సర్వలోకానుకూలా.  2. భవకుదినిజరక్షా పద్మపత్రాయతాక్షా.

శ్రీ

# సింహాసనద్వాత్రింశిక.

## పంచమాశ్వాసము.



క. శ్రీమత్పన్నగఫణమణి
ధామావృతబాలతుహినధామాంశునిభ
వ్యోమాపగాంబుసుమనో
దామాచరితావతంసు దక్షధ్వంసున్.[1] ౧

ఉ. ఇచ్చఁ దలంచి భోజధరణీశ్వరుఁ డంత గ్రహానుకూలత
న్మెచ్చగునట్టిలగ్నమున నిల్చి మహాసన మెక్కఁబూనఁగా
నచ్చటిబొమ్మ పల్కె విను మర్థికి నుజ్జయినీపురీశ్వరుం
డిచ్చినభంగి నీగి మెఱయింపక నీ కిది యెక్కవచ్చునే. ౨

క. అనవుఁడు జనవల్లభుఁ డా
తనివితరణ మెట్లు మెఱసెఁ దగఁ జెప్పు మనం
దనమోవి[2] మందహాసం
బునటింపఁగ నిట్లు దశమపుత్రిక పలికెన్. ౩

### —♦ పదవబొమ్మకథ ♦—

సీ. ఎవ్వనిసాహసం బేవేళఁ జూచినఁ
బరహితంబులకేళ్లఁ బట్టుఁగొమ్మ
యెవ్వనియాజ్ఞ భూమీశుల శిరముల
హారిరత్నావళిమాడ్కి మెఱయు

1. తావతంసి దక్షధ్వంసి. 2. మోము.

నెవ్వనివైభవం బెల్లయాచకులకు ముం
గిటిపెన్నిధి భంగిఁ దోఁచు
నెవ్వనిసత్కీర్తి యీరేడుజగముల
నాటపట్టుగ నిండి యాడుచుండు

నతఁడు సామాన్యజనుఁడె ధీరాధినాథ
నిర్మలాత్మకుఁ డత్యంతధర్మమూర్తి
శత్రుసమవర్తి నృపలోకచక్రవర్తి
సత్యసంధుండు విక్రమాదిత్యవిభుఁడు. ౪

క. అట్టివిభుం డుజ్జయినీ
పట్టణమున రాజ్యలక్ష్మిఁ బరఁగుచుఁ బ్రజఁ జే
పట్టి తగఁ బెంచి సంపద
దట్టంబుగ నిల్పి తల్లిదండ్రులమీఱెన్. ౫

వ. అట్టిదినంబుల. ౬

క. అకళంకచిత్తుఁ డార్యుఁడు
సకలాగమమంత్రతంత్రసారజ్ఞుఁడు భి
క్షుక వేషధారి యవధూ
తకుఁ డనఁగా నపుడు వచ్చెఁ దత్పురమునకున్. ౭

ఉ. అచ్చటి దేవతాగృహమునందు గతస్పృహవృత్తి నుండఁగా
వచ్చెరువంది పౌరజను లాతనివర్తన విన్నవించినం
జెచ్చెరఁ దోడితెం డని ప్రసిద్ధులఁ బంచిన రాకతక్షణం
దచ్చరితంబుఁ జూడ వసుధావరుఁ డయ్యెడ కేఁగె వేడుకన్. ౮

క. అవనీసురరక్షకుఁ డగు
నవనీశ్వరవరుఁడు చనినయవసరమున న
య్యవధూతకల్మషుం డగు
నవధూతకుఁ డతనిఁ గరుణ నవలోకించెన్. ౯

క. తత్కరవిహితోపాయన
సత్కార మనుగ్రహించి సంయమిపతి వి
ద్వత్కులరత్నము భూవరుఁ
దత్కాలసముచితగోష్ఠిఁ దగులం జేసెన్. ౧౦

క. మా టిడక యాతఁ డడిగిన
మాటలలో సకలశాస్త్రమర్మంబులు ప
ల్మాఱును నానావిధములఁ
దేటపడం దెలిపి భూపతికిఁ బ్రియ మడరన్. ౧౧

క. నిధ్యానంబున నజున క
సాధ్యం బగుతత్త్వబోధసారము కుదురొ
నధ్యాత్మవిద్యమర్మము
మధ్యమజగతీశునకు సమస్తముఁ జెప్పెన్. ౧౨

సీ. క్షోణిపానీయతేజోవాయుగగనాఖ్య
పంచభూతాంశసంబంధమైన
మేనిలోఁ గర్ణనాసానేత్రజిహ్వాత్వగా
హ్వాయపంచేంద్రియములగోష్ఠి
శబ్దగంధాంగరసస్పర్శసంజ్ఞిక
పంచవిషయములఁ బాలుపఱుచు
ప్రాణప్రభృతిపంచపవనప్రసారంబు
హృదయాదిపదములఁ బొదలుబుద్ధిఁ

గూడి నిలిచి యుండు కుంభకపూరక
రేచకములగతి వివేచకంబుఁ
జిత్తకమలచక్ర జీవాత్మపరమాత్మ
యోగసాధనముల నొనరఁ జెప్పి. ౧౩

క. యోగము కల్మషబంధవి
యోగము పంచేంద్రియాభియోగము, పుణ్యో
ద్యోగము, ముక్తివధూసం
యోగము పరతత్త్వపదనియోగము సుమ్మా. ౧౪

గీ. దుఃఖసాధ్యమయ్యుఁ దొడరి యభ్యాసంబుఁ
జేయఁజేయ యోగసిద్ధి పెంపు
దినఁగఁ దినఁగ వేము తియ్యనౌకైవడిఁ
బిదపఁ బరమహర్షపదము సుమ్ము. ౧౫

సీ. హఠయోగమంత్రయోగాష్టాంగయోగసా
ధనయోగలయయోగధర్మములకు
యమనియమాసనధ్యానధారణశక్తిఁ
బవననిరోధంబుఁ బట్టుకొలిపి
నాభిచక్రోపరినలినమధ్యంబున
నీవారశూకసన్నిభ విభాతి
వెలిఁగెడు తేజంబు వెలుఁగునఁ గరఁగిన
యమృతంబు మదిలోన ననువార

నందుఁ గలుగుట సచ్చిదానందమయ్యె
నచటి తేజస్స్వరూపంబె యచ్యుతుండు
పంచవింశతితత్త్వప్రపంచమునకు
నతఁడె కారణ మాదినారాయణుండు. ౧౬

క. కరణాసనభేదంబుల
వెర వెఱిఁగి తదంగయోగ వితరణసరణిం
బరికించి పెనఁగ నేర్చిన
మరగుఁ జుమీ ముక్తికాంత మర్మజ్ఞునకున్. ౧౭

క. అని బహువిధములఁ జెప్పఁగ
విని జనపతి తెలిసి యోగవిద్యావిభవం
బున రాజయోగి యనఁగా
జనకునిక్రియఁ బ్రజలఁ బెంచె జనకునిభంగిన్. ౧౮

వ. ఇట్లు కొంతకాలంబు పుచ్చి తన్ముఖకళలం జూచి యోతాపసో
త్తమ నీకెన్ని యేం డ్లయ్యె నని యడిగిన నతండు యోగికిఁ గాల
క్రమంబు విచారింపనేల నూఱేం డ్లు వేయేం డ్లని యెన్నిక గలదే
సిద్ధయోగంబున వజ్రశరీరంబు దుర్లభంబు గాదు. ౧౯

క. బాధారహితగతికుఁడు
బోధాహితపరమహర్ష పూర్ణుఁడు నిజవాం
ఛాధీనమరణుఁ డీక్షణ
సాధితచిన్మూర్తి యోగి సామాన్యుండే. ౨౦

క. తలనరసినఁ జెక్కులపై
వళు లెగసిన మేని బిగువు వదలిన నేత్రం
బుల నెఱ్ఱసెరలు విరిసిన
జెలు వెడలిన యతఁడు[1] యోగసిద్ధుఁడె ధాత్రిన్. ౨౧

క. అనఁ దద్వచనామృతసే
చనమున యోగంబు సిద్ధిచందము దెలియన్
మనమునఁ గౌతుకకందళి
మొనసూపిన నృపుని నెఱిఁగి మునినాయకుఁడున్. ౨౨

గీ. ఎద్దియైన నీకు నెఱిఁగింతు నడుగుము
సిగ్గుపడకు మనుడు క్షితివరుండు
మరణభయము లేనిమార్గంబుచేకూఱు
సిద్ధయోగనియతిఁ జెప్పుమనియె. ౨౩

1. జెలువింపక యుడయు.

మ. అనిన న్యాసముతో జరామరణశూన్యం బైన మృత్యుంజయం
బను మంత్రంబును హోమతంత్రమును హవ్యద్రవ్యభేదంబు సా
ధనయోగంబుఁ గ్రమంబునం దెలిపి విద్యాదక్షిణానుగ్రహం
బున మన్నించి నరేంద్రు వీడుకొని విప్రుం డేఁగె వింధ్యాద్రికిన్.

సీ. క్షితివరుం డిట యోగసిద్ధికై మంత్రిపై
రాజ్యభారం బిడి రాముపగిది
జటిలుఁ డై మేన భస్మముఁ బూసి వల్కల
ధారియై కాననాంతమున కేఁగి
ఋషిభంగి గంగలోఁ ద్రిషవణస్నానుఁ డై
జపతపంబులఁ బురశ్చరణ చేసి
మంత్రపూతంబుగా మధుతిలదూర్వాజ్య
హోమంబు జరపుచు నేమమునను

నక్తము నుపోష్యమును నేకభుక్తమనఁగఁ
గలుగుదినముల సిద్ధయోగమున నుండి
కందమూలముల నశనకాంక్షదీర్చి
వ్రతము చరియించె నక్లైకవత్సరంబు. ౧౫

వ. తదనంతరంబ యొకనాఁటి హోమసమయంబున. ౧౬

క. ఆహుతి వోయఁగఁ గాంతితి
రోహితుఁడై లోహితాశ్వరోచిఃపటలీ
రోహితుఁడై యాకుండము
లోహితుఁ డై నిల్చె నీలలోహితుఁ డంతన్. ౧౭

వ. తదాకారంబు గని సాఁగిమ్రొక్కి నిలిచిన ౧౮

క. మృత్యుంజయుఁ డతనితపః
కృత్యమునకుఁ జిత్తవృత్తికిం దగఁగ జరా
మృత్యునివారక మగు ఫల
మత్యాదరణంబుతోడ నాతని కిచ్చెన్. ౧౯

వ. ఇచ్చి తిరోహితుం డైన. ౩౦

గీ. అట్టిఫలము చేత నంది జనేశ్వరుం
డీశ్వరునకు మ్రొక్కి శాశ్వతముగ
సంగసిద్ధి గంటి నని యుల్లసిల్లుచు
మగిడి వచ్చునట్టి మార్గమునను. ౩౧

చ. పదములుఁ జేతులు న్ముడిఁగి పండ్లు డుల్లి నిజస్వరంబు గ
ద్గదికఁ బెనంగ నంగమున గ్రంథులు వాఱఁగఁ గుష్ఠరోగముఁ
ముదిమియుఁ గూడి రూపు బలుపుం బొలియింపఁగ దైన్యజీవనా
స్పద మగు బ్రాహ్మణుండు జనపాలున కష్టమువచ్చి యిట్లనుఁ.

క. ముదిమియు రోగముఁ గూడం
బొదలెడు నిదె మేనునిలువఁబూనదు నాకుఁ
మది నెఱుఁగు దేని మం దీ
పదనున సమకూర్చి యిమ్ము పరమదయాత్మా. ౩౩

గీ. అనిన నతనిఁ దోడుకొనిపోయి తనయింట
మందుమ్రాఁ కొనర్ప మదిఁ దలంచి
యాతఁ డంతదూర మరుదేర లేఁ డని
యాత్మఁ జూచి విక్రమార్కవిభుఁడు. ౩౪

గీ. కలిగి పెట్టలేక కష్టుఁ డైయున్న దు
ర్గుణుని పాపమునకుఁ గొలఁది లేదు
తన్ను మాని యైన ధర్మంబు చేసిన
యతనిపుణ్యమునకు నవధి లేదు. ౩౫

క. తుదిముట్టని బ్రతుకున కా
పదఁ బొదలెడివాఁడు దానపాత్రం బని స
మ్మదమున నాస్తులకొఱకై
సదయులు ప్రాణములు తొల్లి చాగము లిడరే. ౩౬

వ. అని తొల్లింటి రాజులం బ్రశంసించి తనలో శంకింపక సాహసాం
కుండు సుహోదారుండై. ౩౮

క. ప్రాణము లడుగఁడు వృద్ధ
క్షోణీసురుఁ డితఁడు మందుఁ గోరెడు దేహ
త్రాణము గావించెద నని
క్షోణీశుఁడు చేతిపండుఁ గోరిక నిచ్చెన్. ౩౯

శా. దివ్యం బాఫల మిచ్చినం దిని ధరిత్రీనిర్జరుం డంతఁ గు
ష్ఠవ్యాధిస్థవిరత్వదూరతమనై సంపూర్ణ తేజఃకణా
భివ్యాప్తం బగు దివ్యదేహ మటుఁ బ్రాపింపంగ నిర్మోకము
క్త వ్యాళేంద్రుని భంగి నొప్పెఁ బతి చోద్యం బంది హర్షింపఁగన్

క. అర్థికి నీక్రియ నిచ్చి కృ
తార్థుండై కదలి వచ్చె నటుగావున న
ప్పార్థివునకు సరిపూనమి
వ్యర్థము నీతలఁపు భోజవసుధాధీశా. ౪౧

క. నావుడు భోజక్షితిపతి
భావంబునఁ జోద్యహర్షభరితుం డై ల
జ్జావనతవదనుఁ డగుచు హి
తావృతుఁ డై మగిడి పోయె నంతఃపురికిన్. ౪౧

వ. మఱియుఁ గొన్నిదినంబులు సనిన నేకాదశద్వారపీక్షకుండై.

—♦ పదునొకొండవబొమ్మ కథ ♦—

క. సూక్ష్మముగఁ దలఁచెద న్మర్గ
లక్ష్మకళారమ్యు వీరలక్ష్మీ న్గమ్యున్
లక్ష్మీలలనావక్షో
జక్ష్మాధరసక్త భక్తసంహు నృసింహున్. ౪౩

క. అని నియమంబున భోజుం
డనువగులగ్నమునఁ జేర నరిగి మహేంద్రా
సన మెక్కఁ బోఁగ నిలునిలు
మని యచ్చటిబొమ్మ పలికె నచ్చెరువందన్. ౪౪

క. పరికింప విక్రమార్కుని
సరిపూనఁ బరోపకారసత్త్వంబులు సు
స్థిరముగఁ గలుగనివానికిఁ
దరమే యిట దీని నెక్క ధారాధీశా. ౪౫

క. అనవుడు నవ్వసుధాపతి
చనునతనిపరోపకారసత్త్వగుణము లె
ట్లనఁ బాంచాలిక యును స
ద్వినయంబున భోజనృపతి విన ని ట్లనియెన్.[1] ౪౬

క. జననాథ రాజసముఖం
బున నున్ననరుండు యోగ్యము నయోగ్యముఁ[2] బ
ల్కిన నవ్వుఁ గా దన కూరక
వినవలయును సరస మైన విరసం బైనన్. ౪౭

గీ. పలుకఁ దగినపలుకు పలుకక యున్నను
బలుకు వినియు వినని పగిది నున్నఁ
బలుకఁ జూచువానిఁ బలుకకు మన్నను
బలుకు లేల తల్లి పొలయు నతని. ౪౮

వ. కావున.

1. వ. అనవుడు నవ్వసుమతీపతి యతని పరోపకార సత్త్వగుణంబు లెట్టివనినఁ బాంచాలిక సవినయంబుగాని ట్లనియె. అని యొకప్రతిలో వచనమున్నది. 2. రాజసమ్ముఖ. మున వరుఁడవయోగకార్యములుగా వెసఁ.

క. వ్యక్తంబుగఁ జెప్పెద నను
రక్తుఁడ నై విను మవంతిరాజుగుణము నా
యుక్తిం జులుకం జూడకు
యుక్తులయెడ నాఁటదాని యోగ్యత గలదే. ౫౦

మ. సత్యవచోవిశారదుఁడు, శారదనీరదసంస్ఫురద్యశో
నిత్యుఁడు నిత్యదానగణనీయుఁడు విజ్ఞజనావళీమనో
వృత్త్యనుసారి సారబలవిక్రమకృత్యుఁడు నాఁగ విక్రమా
దిత్యుఁ డవంతి యేలె నలుదిక్కులరాజులు పంపుసేయఁగన్.

వ. అట్టిమహీపాలుండు షణ్మాసరాజ్యప్రతిపాలనంబును షణ్మాసదేశాం
తరవనాంతర ప్రవాసంబును నవశ్యకర్తవ్యం బగుటం జేసి యొక్క
సమయంబున రాజ్యం బరాజకంబు గాకుండ భట్టి నుజ్జయిని
నునిచి యసహాయశూరుండు గావున నొంటి నిగూఢవేషంబున
దేశాంతరనగరగహనవిశేషంబులు చూచుచుం జని చనియొక్క
నాఁడు. ౫౧

ఉ. పణ్యపథంబు భంగి భయభంగము నొందక చొచ్చె దండకా
రణ్యము శైలగర్భితహిరణ్యము తాపసచిత్తనిత్యకా
రుణ్యము గంధబంధురసరోజరజోవనరాజిలక్ష్మణా
గణ్యము[1] పత్రపుష్పఫలగణ్యముఁ బుణ్యజనానుగుణ్యమున్.

వ. చొచ్చి యనుష్టుప్ఛందంబునుం బోలె హంసరుతయుతం బై త్రిష్టు
ప్ఛందంబునుం బోలె భ్రమరవిలసితం బై జగతీచ్ఛందంబునుం
బోలెఁ గుసుమవిచిత్రాంబరం బై యతిజగతీచ్ఛందంబునుం బోలె
మత్తమయూరసేవితం బై శక్వరీచ్ఛందంబునుం బోలె సింహో
ద్ధతాశ్రయం బై యతిశక్వరీచ్ఛందంబునుం బోలె సుకేసరభాసు
రం బై యష్టిచ్ఛందంబునుం బోలె హరిణీసంశ్రితం బై ధృతి
చ్ఛందంబునుం బోలె మత్తకోకిలాకలితం బై యతిధృతిచ్ఛందం

1. రజోవనరాజితాజలక్షణ్యము.

బునుం బోలె శార్దూలవిక్రీడితలక్షితం బై కృతిచ్ఛందంబునుం బోలె నుత్పలమాలాయుక్తం బై ప్రకృతిచ్ఛందంబునుం బోలెఁ జంపక మాలాసహితం బై సంకృతిచ్ఛందంబునుం బోలె సరసిజచిహ్నిత క్రౌంచపదాంకితంబై[1] యుత్కృతిచ్ఛందంబునుం బోలె భుజంగవిజృంభిత సంగతంబై యున్న యవ్వనాంతరంబునం దిరుగునప్పుడు. ౫౪

క. ఇల నందఱుఁ దను నైరిం
పలే రనుచు నెట్టయైన బ్రదుకొల్లక తాఁ
గలుమడుఁగు లుఱికెనో యన[2]
జలజాప్తుం డస్తశిఖరి దఱి దిగఁబడియెన్. ౫౫

వ. అప్పుడు. ౫౬

క. బహుయోజనదూరము లగు
గహనంబుల నుండి యెగసి కలకలములతో
విహగంబులు నిలయమహీ
రుహములకు దెంచెఁ బంక్తిరూపం బలరన్. ౫౭

క. బంధురమదాంధదిక్కూ
లంధరగజగండమండలప్రచలితసు
ప్వంధయనిభసిలిమ జగ
దంధంకరణప్రసార మై తమ మొదవెన్. ౫౮

వ. తత్సమయంబున. ౫౯

---

1. క్రౌంచపదమును సరసిజచిహ్నితమును శంకృతిచ్ఛందములోఁ గనఁబడుచున్నవి. ప్రకృతిచ్ఛందములోని దని తెల్పినాఁడు. 2. దసుసైఁపక. పలుతెఱఁగుల ననఁగ నట్టిబ్రదుకొర్వకతా. గెలఁకుల గ్రేళ్లఱికెనో యన.

గీ. ఆదిమూర్తిక్రియ సహస్రశాఖలను స
హస్రపాదములను నవనిగగన
భాగపూర్ణ మగుచు భవ్యమై ద్విజకుల
[1] సేవ్య మైనతరువుఁ జేరె విభుఁడు. ౬౦

సీ. ఏమ్రానిమూలంబు లిలకు నాధార మై
శేషపడగలతోఁ జెలిమిసేయు
నేవనస్పతికొమ్మ లెక్కియాడంగ ది
గంతబాలికలకు నందికోలు
ఏవృక్షమునఁ గల యి ర్లహర్నిశ మంధ
తమసంబునకు నుండఁ దల్లియిల్లు
ఏపాదపముతుద నెడనెడఁ గాలూఁద
రవిహయంబులకు విశ్రామభూమి

యేమహీజమునిలు వెల్లపక్షుల కునిక
పట్టు నాఁగ నెగడి ఫలదళముల
నబ్జరాగమరకతాంచితైక స్తంభ
హర్మ్యసామ్యమందు నట్టివటము. ౬౧

క. ఆవటముక్రిందఁ బలికుల
నావటముగ శయ్యదీర్చి యుండు సమస్త
ఖ్లావరమణికోటిక
స్థావరనిజశాసనుండు శయితుం డయ్యెన్. ౬౨

వ. ఆవేళ నాతరుశాఖాంతరంబున నున్న చిరజీవి యను వృద్ధపక్షీ
శ్వరుండు తనచుట్టు వచ్చి యున్నపిట్టలం జూచి మీరు దిరిగిన
వనంబుల నపూర్వంబు లేమిగంటి రని యడిగిన వానిలోఁ గుక్షిం
భరికుం డనువిహంగం బోస్వామీ నీవెఱుంగని యపూర్వంబులు
లే వట్లున్నను నొకటివింటి మవధరింపుము. ౬౩

1. హస్రశిఖర రమ్యమౌచునెపుడు. భూమిగగనభాగపూర్ణమైద్విజకుల.

మ. ఖగవంశోత్తమ నేఁడు గుంపుగ నుమఃకాలంబున న్వేడ్కతో
గగనాభోగము నిండ నే మెగసి పక్షశ్రేణివాతోద్ధతి
న్నగము ల్దూలఁగఁ బోయి వింధ్యముచెంత న్నానావిగంతాగతం
బగు నాత్మీయగణంబుఁ గూడి యొకపుణ్యారణ్యమధ్యంబునన్.

క. కంకాలఖండనుం డను
కంకము విహగములు గొలువఁగా నిజమిత్రా
తంకం బగుశోకాంబుధిఁ
గ్రుంకఁగ నేఁగితిమి వానికుంనుట దెలిసన్. ౬౫

క. ఏఁగినఁ నాతం డశ్రులు
దోఁగిననయనములఁ జూపు నోఁపక శోకాలోఁ
గ్రాఁగుచునుండఁగ నేమా
పాఁ గెఱిఁగినభంగినొయ్యఁ బలికితి మతనిన్. ౬౬

క. పిట్టలము మేము నీకల
చుట్టాలము మమ్ము నేల చూడవు నీకీ
పట్టున వలవనిశోకము
పుట్టెడుకత మేమి చెప్పు పొంపుపడంగన్. ౬౭

ఉ. నావుడుఁ జూచి యాతఁడు మనంబు యథాస్థితి నిల్పి యి ట్లను
న్వోవుసు బాంధవు ల్గలుగ వేదనఁ బొందఁగ నాకు నేల మీ
కీవిధిచొప్పెఱుంగఁ దగునేని వినుం డిఁక వింధ్యకందర
గ్రామముఁ జెంది యుండె నొకరక్కసుఁ డక్కడ నిక్కువంబుగన్.

శా. ఆమాంసాశనుఁ డుక్కుపిక్కటిలఁగా నాత్మాంతికద్వాదశ
గ్రామాంతస్థుల నెల్లవారలఁ దినంగా నందఱు న్భీతి నై
స్తోమం బై చని పోఁగి ప్రొక్కి యొకమర్త్యు న్నిత్యము న్నీ బహి
ర్భూమి న్నిల్పెద మారగింపుము నవాపూపాదియుక్తంబుగన్.

మ. అని సంప్రార్థన చేసి యేఁగి నిజమర్యాదావిధిం బ్రాప్తుఁ డౌ
మనుజుం గమ్మనిపిండివంటలును సన్మానంబుతోఁ దెచ్చి య
ప్పనసేయం గని యార్చుచు న్వెడలి వ్యాపాదించి[1] తృప్తాస్థగాఁ
దినుచుండుం దనుజుండు యత్నమునఁ బత్నీయుక్తుఁడై నిచ్చలున్

వ. ఇట్లనుదినంబును నరబలి జరగు నెల్లిటిదినంబున. ౭౧

క. మన్మిత్రుఁ డైన యొక్కద్వి
జన్మకుమారకుని వరుస చనుదెంచిన దే
తన్మూలము నాశోకము
సన్మార్గికిఁ గలియుగమున సౌఖ్యము గలదే. ౭౨

మ. అనిన న్విస్మయ మంది మేము ఖగవర్యా నీకు నవ్విప్రబా
లునకుం జుట్టఱికంబు సేకుఱిన కీలుం జెప్పుమా నావుడున్
వినరయ్యా యుపకారహీనుఁడ భయావిష్టుండ నిర్భాగ్యజీ
వనుఁడం జెప్పెద దీనికారణము మీవాలాయపుంబల్కులన్.

ఉ. ఏనును బిల్లలుం గలయ నెల్లెడఁ ద్రుళ్లుచు నుల్లసిల్లుచుం
గాననభూమిలోఁ దిరుగఁగా నొకచెంచురు లొడ్డి పోయినం
గానక తూఱుచో మెడలుఁ గాళ్లను జుట్టలుగొన్న దిక్కులన్
దీనులమై కలంగి నలుదిక్కులుఁ జూచుచునున్నయత్తఱిన్.

క. ఫలకుసుమసమిత్పర్ణం
బుల కట చనుదెంచి మమ్ముఁ బొడఁగని కరుణా
కలితుఁ డయి యక్కుమారకుఁ
డలజడిఁ బడకుండఁ ద్రెంచె నయ్యురు లెల్లన్. ౭౩

క. అతనికృప నిట్లు బ్రదికితి
క్షితి రాఁబులుఁగులకు నెల్ల సేవ్యుఁడనై విం
శతివర్షంబులు పెరిఁగితి
గతిసేసిన యతనికీడు గనుఁగొనవలసెన్.[2] ౭౪

1. యార్పాటించి. 2. గతిగానక యతనికీడు గనుఁగొనఁబడియెన్.

క. తనకుపకారము చేసిన
మనుజునకు న్మేలు గోర మానక[1] దుఃఖం
బున కష్టపడక యుండిన
జనుని బ్రదుకు మేఁకయజిఁకి చన్నుం బోలున్. ౭౭

క. రాక్షసిని జంపనోపను
బక్షిని దుర్బలుఁడ నన్నుఁ బ్రతినిధి గాఁగన్
భక్షింపు మనిన మాంస
ప్రక్షీణతఁ జూచి వాఁడు పైఁబడఁ డిటకున్. ౭౮

చ. అనవుఁడు దత్ప్రతిక్రియ కుపాయము గానక చింతఁ జెందియా
తనిఁ దగ నూఱడించి మఱిఁ దారుచు వచ్చితి నేము నావుఁడు
న్వాని చిరజీవి పల్కె నరవిందభవుం డలికంబునందు వ్రా
సినయది తప్పునే పసులచేతఁ జరాచర సృష్టికోటికిన్. ౭౯

క. ఈక్రమమునఁ బలుకఁగ విని
విక్రమభూషణుఁడు శాలివిప్రత్రాణో
పక్రమమున నిద్రింపక
శుక్రోదయవేళ కెదురు చూచుచు నుండెన్. ౮౦

గీ. అంతభార్గవోదయం బైన నెలుఁగునఁ
దెసవు గానవచ్చె తెఱఁ గెఱింగి
కదలె వింధ్యగిరికి గండభేరుండాని
ఘోర మైనయడవిఁ గొంకు లేక. ౮౧

చ. జలజల మంచునీ రొలుకఁ జల్లనిగాడ్పులు వీవఁ దారక
ల్మలమల మ్రగ్గఁ జీఁకటి క్రమంబున డిగ్గ విహంగసంఘము
ల్కలకలఁ బల్కఁ దూర్పున వికాసము కెంపునఁ గూడియాడఁగా
బలబలఁ దెల్లవాఱె జనపాలకుఁ డేఁగువనాంతరంబునన్. ౮౨

1. మేలుఁజేయ మఱిగానక.

క. ఒకసారె యేడు తేజులు
[1]వికలాంగుఁడు సూతుఁ డనిలవీథి జెరువుగా
నొకరథమునఁ ద్రిభువనములు
నొకనాఁటనె తిరుగునాతఁ డుదయము సేసెన్. ౮౩

క. ఆసర్వాత్ర మెక్కుచు గజ
రూపంబగు తిమిర మణఁచి లోహితకాంతి
వ్యాపితకరనఖరుండై
దీపించె మృగేంద్రుకరణి దినమణి కనఁకన్. ౮౪

సీ. పూర్వదిక్పతి యొద్దఁ బోలుపారు గొడుగుపై
ఖచితమౌ మాణిక్యకలశమనఁగ
విలబ్ధబాలురఁ గూడి వేడుకతోడ జ
యంతుఁ డాడెడి పట్టుబంతి యనఁగఁ
బ్రాచీవధూటికాఫాలభాగంబునఁ
బెట్టిన కెంపులబొట్టనంగఁ
దెలివితో నాడెడి దివసఫణీంద్రుని
తలమీఁద నున్న రత్నం బనంగ
రక్తకాంతి మీఱియు రచితరక్తాశోక
కింశుకాగ్రగుచ్ఛసంశయంబు
పొడుపుఁగొండమీఁదఁబొడ తెంచెఁద్రైలోక్య
మండనంబు భానుమండలంబు. ౮౫

క. దళ నుగుదీధితి నుదయా
చల మలగఁగ రూపబోధజననచ్ఛాయా
కలితం బై యరుణిమం
డల మప్పుడు రత్నదర్పణముగతి నొప్పెన్. ౮౬

---

1. ఒకతేజికేడుపేరులు.

సీ. ఎవ్వనియుదయ మీరేడులోకములకు
దిక్కాలవృత్తులు దెలుపుచుండు
నెవ్వని తేజ మగ్నీందుమునై భవముల
కాధారమును దానయై వెలుంగు
నెవ్వనిమండలం బెల్ల యోగీంద్రులుఁ
జేయుముక్తిక మణిద్వారభూమి
యెవ్వనిమూర్తి వాణీశశంకరవిష్ణు
రూప మహా వేదస్వరూప మింద్రు
ఎవ్వఁ డిష్టజనుల కిష్టదర్శనమునఁ
బాపసంచయంబుఁ బాపుచుండు
నట్టిలోకమిత్రుఁ డైన తేజోనిధి
కోకములకు విరహశోక మణఁచె. ౮౯

మ. గిరిశృంగంబుల గైరికాకృతిని శాఖిశ్రేణిపైఁ బల్లవా
కారలీలం గరిరాజకుంభముల మీఁద న్రక్తచూర్ణాకృతిన్
శరధిద్వీపములం బ్రవాళరుచిఁ గాసారంబుల న్శోణప
ద్మాకరకాంతిం దరుణాతపం బడరె దిక్కాంతాంగకాశ్మీర మై.

వ. కలువలవైరి చక్కవలఁ గావఁగఁ బూనిన దాత ముజ్జగం
బులకును సాక్షి యంబరవిభూషణ మానెలతాల్పువేల్పుకు
న్వలపలికన్ను ముక్తి తలవాకిలి చీఁకటివీడుకోలు నా
వెలుఁగులఱేఁడు తామరలవిందు వెలుంగుచునుండె నయ్యెడన్.

క. సంధ్యావందనవిధి యా
వింధ్యానదిలోనఁ దీర్చి విభుఁ డనవరతా
వంధ్యారంభుం డల్లన
వింధ్యాద్రిబిలంబుఁ జేరె విప్రునిఁ గావన్. ౯౦

క. కాలుని కేళీశైలముఁ
బోలెడునచ్చోటి యస్థిపుంజముఁ గని భూ
పాలుఁడు మనమున నధికకృ
పాళుం డై వధ్యభూమి బలిమై నిలిచెన్. ౯౧

గీ. అంత నింతిఁ గూడి యసుర యార్చుచు వచ్చి
యోరి పిండివంట లుజ్జగించి
నేఁడు నీవె వచ్చినాఁడ వి దేమిరా
యనుడుఁ దెలియఁబలికె మనుజవిభుఁడు. ౯౨

క. ఓరాక్షస నే నొక్కని
బారికి నై యడ్డుపడితిఁ బగదేశిఁ బ్రియా
కారముగ మెసవు పక్వా
హారంబులు వెనుకవచ్చునంతకు నన్నున్. ౯౩

మ. అనినం జిత్తములోన దానవుఁడు చోద్యం బందుచు న్నీదుపూ
నినసత్కార్యము సెల్లు మెచ్చితిఁ జుమీ నీకిష్ట మెద్దేని వేఁ
డిన నే నిచ్చెద నావుడుం గరుణాదృష్టిం గల్గ నీక్షించి య
జ్జననాథుండు పరోపకారకరణోత్సాహంబుతో ని ట్లనున్.

క. ఇప్పుడు నీ వాడినయది
తప్పకుమీ తఱచుగాఁగ దానవునకడం
దప్పులు గలవని పెద్దలు
చెప్పుదు రొకచోట సత్యశీలము లేదే. ౯౪

చ. నయమునఁ బూర్వదేవతలు నాఁగఁ బ్రసిద్ధికి నెక్కు రాక్షసా
న్వయము జగంబులో నసురవంశవిభూషణ[1] మీవు నీవచో
నియమముఁ దప్పనేరుతువె నీదుకళత్రము సాక్షి గాఁగ నా
ప్రియమును నీవునుం బ్రియము పెంపునఁ జేయుము[2] నిన్ను వేఁడెదన్

1. శిరోమణివీవు. 2. నీడునప్రియము పెంపును జేసర.

క. దనుజేంద్ర నేఁడు మొదలుగ
మనుజాహారంబు గొనుట మానుము కృపతో
జనులకుఁ బ్రియ మొసఁగుచు నీ
వనమున నెలకొనుము వింధ్యవాసిని కెనయై. ౯౭

గీ. అనుడు నవ్వరమిచ్చెద నని తలంచి
ముదితహృదయుఁడై తనయింతి మోముఁజూచి
యితనిసరిపోల్ప నెవ్వరి నెన్నవచ్చు
వనిత యీతఁడు జీమూతవాహనుమీఱె. ౯౮

వ. అనిన నా రాక్షసి జీమూతవాహనుం బల్కె నిట్లనియె. ౯౯

—: జీమూతవాహనుచరిత్రము. :—

క. జీమూతవాహనుఁ డెవ్వం
డేమి ఘనత[1] చేసె వెలసె నిక్కథఁ దెలియం
గా మనుజాంతక చెప్పుము
నా మనమున హర్షమ్ము నాటుకొనంగన్. ౧౦౦

వ. అనుడు న ద్దనుజుండు పుణ్యపురుషుని యెడఁ[2] బుణ్యపురుష కీర్తనం బుచితంబని యిట్లనియె. ౧౦౧

సీ. ప్రాలేయగిరిమీఁద భానుబింబద్యుతి
మణిమయప్రాకారమహిమతోడఁ
దిరమైన కాంచనపురములో జీమూత
కేతుఁడు నాఁగ విఖ్యాతయశుఁడు
ఖచరవల్లభుఁ డొక కనకవతీసంజ్ఞఁ
బరఁగెడుకన్యకఁ బరిణయించి
ప్రీతిసంధిల్ల జీమూతవాహుం డనఁ
దగునట్టి పుత్రరత్నంబుఁ బడసి

1. ఏమితగవు చేసె. 2. పుణ్యపురుషుఁడు వినం బుణ్యపురుష.

రాజ్యలక్ష్మిచేతఁ బూజ్యుఁ డై కడపట
వార్ధకమున భోగవాంఛ వదలి
నిజపదమునఁ బుత్రు నిలిపి నీతులుసెప్పి
వనితఁ గూడి చనియె వనమునకును. ౧౦౨

క. జీవయాత్ర వాహనుండను మ
హామహిమామాఖండలుండు యాచకజనచిం
తామణి శరణాగతజన
త్రాణమణి ఖచరేంద్రకులశిఖామణి యయ్యెన్. ౧౦౩

క. పితృదత్తమైన కన్య
క్షితిరుహ మర్త్యలకు నొసఁగి చిక్కిన ధనసం
హతిఁ దనబంట్లకుఁ బ్రజలకు
హితులకుఁ దగ నిచ్చె రిపుల కెడ రిది యనఁగన్. ౧౦౪

గీ. పురముఁ గానఁ దలంచు నరులఁ జంపఁగఁబూని
జీవహింస కోడి చింతనొంది
తల్లిదండ్రు లున్నఁ దగుఁగాక యిది యేల
యనుచు గురులజాడ ననుగఁ దలఁచె. ౧౦౫

వ. తలఁచి సఖుం డైన మధుకరుం గూర్చుకొని యరిగి త జ్జననీజనకులం గని సాష్టాంగంబుగాఁ బ్రణమిల్లిన వారలు సంతుష్టాంతరంగు లై యుండం జేరి. ౧౦౬

క. తత్పదపంకజ సేవా
తత్పరమతి విరులఁ బంట్లఁ దాఁ దెచ్చుచు నా
సత్పురుషుఁడు మలయమహీ
భృత్పార్శ్వమునం జరించెఁ బితృభక్తుఁ డనన్. ౧౦౭

మ. ఒకనాఁ డిష్టసఖుండుఁ దాను ఫలపుష్పోపాన్తవాసక్తితో
వికచాంభోజసరోవరంబుల నవావిర్భూతచూతాది జా
లకజాలంబుల రాజకీరమదరోలంబాగ్ర పుష్పంబులం
బ్రకట శ్రీగుణగణ్యమౌ నొక తపోరణ్యంబు సొచ్చెం గడున్. ౧౦౭

క. ముందఱ గౌరీమందిర
మందారనవార విందమూకందలతో
కుందమకరందబిందు
స్పందానందనుఁడు మందపవనుఁడు వీచెన్. ౧౦౮

వ. అంతఁ దదాగతకుసుమామోద వాసిత సుఖసమీరాప్యాయన
శరీరాయాసు లై యుండునంత. ౧౧౦

క. ఎడపక కూరిమితో నె
య్యెడఁ బుత్రికి నీడ యైన హిమశైలము కై
వడి బెడఁ గడరెడు పటికపు
గుడి బొడఁగని యక్కుమారకుఁ డటు చేరెన్. ౧౧౧

క. అంగణమున నభ్యంతర
సంగీతాకర్ణనమునఁ జలియింపక వే
డ్కం గసవు మేయకున్న తు
రంగంబులఁ జూచె నంతరంగం బలరన్. ౧౧౨

వ. చూచి తత్సంగీత ప్రసంగసాంగత్యకారణం బగు జాణం జూతము
ర మ్మని యిష్టసఖుం డైన మధుకరుం గూడి తద్ద్వారంబుఁ దూఱి.

సీ. చిన్ని చన్నులమీఁదఁ జేర్చినవీణియ
చేదోడుగా శ్రుతిస్థితులఁ దీర్చి
సరిగమపధను లన్న సప్తస్వరంబుల
గమకంబు లయవిభేదముల నెఱపి

నాదామృతంబున నవిచినక్రియఁ
దంత్రిఁ బెనఁగొని నఖకాంతి గొనలుసాఁగ
రాగకదంబంబు రంజిల్లఁ జేయుచు
నాలతి వీనుల కమృత మొసఁగ
గానరసవశమునఁ గనుఁగవ మోడ్చుచు
బోటిఁగూడి వాణిబోటిఁ బోలె
గారిఁ బాడుచున్న కన్యకారత్నంబుఁ
జూచె నచట బాలఖేచరుండు. ౧౧౪

వ. అంతఁ దదీయలావణ్యమధుమత్తనయనమధుకరుం డై మధుకరు
నితో ని ట్లనియె. ౧౧౫

క. వనితారత్నము నవయౌ
వనయై పొదరింట నున్నవనలక్ష్మి క్రియన్
దొన నున్నమరునిబాణం
బన నున్నది యిచట మోహనాకృతితోడన్. ౧౧౬

సీ. ఇది దేవకామిని యేని నింద్రుని వేయుఁగ
న్నులు సఫలము లగుట యున్నె
యిది నాగకన్యక యేనిఁ బాతాళంబు
సోముఁడు లేఁ డని సొన్న మగునె
యిది ఖేచరాంగన యేని మాజాతికిఁ
బ్రభ యెక్కు చెలికునఁ బందుగాదె
యిది సిద్ధబాలిక యేని లోకంబులో
సిద్ధకులంబు ప్రసిద్ధిఁ గనదె
యిది వనాంతలక్ష్మి[1] యేని వనం బెల్లఁ
బల్లవింపకున్నె యెల్లయపుడు
నిది సుధాంశురేఖ యేని యీగుడి నున్న
శిలలు చంద్రకాంతశిలలు గావె. ౧౧౭

---

1. వసంతలక్ష్మి.

క. పరసతులను దల్లులఁగాఁ
బరికించెడు నాకు దీనిపైఁ జిత్తం బే
నెరవునఁ దగిలెనొ యిది కృత
పరిణయ గాకుండఁబోలుఁ బరికింపఁగనా. ౧౧౮

వ. అని యంతకుమున్న నిజదర్శనంబునఁ జంద్రావలోకనంబునం గరంగు చంద్రకాంతంబు క్రియఁ జిత్తంబు గరంగి మేను ఘర్మజలంబులు మణిగణభూషణంబులుగా లజ్జారాగనిమగ్న యై కనుచేటంబున గాటం బగునారాటంబునఁ దుంటవిల్తుండు నానంబు వేఁటాడ[1] బోటి పూఁబోఁడ మాటు సొరం దలంచునెడ నంతానుగమ్యమానుం డగు మీనకేతనుని భాతి దన్గతి బాలలీలావతి నీ వెవ్వరిదాన వీగారీగేహంబున కనుఁగు దేరం గారణం బేమి నా నృపుడు విని చతురిక యను తన్నెచ్చెలి లేచి బాలికకుఁ బ్రౌఢత్వంబు గలదె యేను విన్నవించెద నవధరింపుఁడు. ౧౧౯

క. వసుమతిఁ బరఁగిన మిత్రా
వసుసోదరి సిద్ధవంశవరుఁ డగు విశ్వా
వసుసుత మలయవతి విభా
వసునిభుఁడగువసుని వేఁడవచ్చిన దిటకన్. ౧౨౦

వ. అనిన నృపమాళుండు నామాట తప్పనిది కన్యక యనుట వింటి వే యనుడు నమ్మనుకరుండు దైవయోగమ్మున సమాన వయోరూపంబులు గలవధూవరు లిట్లు గూడుదురే యని- ౧౨౧

క. వనరుహగర్భుని నేరమి
వనరూపసువస్తుయోగ మగపడదు జగం
బున మీబోంట్లకు నగపడుఁ
గనకము రత్నమ్ముఁ గూడుకైవడి నోకబోన్. ౧౨౨

వ. అని చతురికం జూచి నిజసఖుని దెసం జూచి. ౧౨౩

1. తుంటవిల్తుచే మానవంబు పేటెత్త. చి. మా.

క. జీమూతకేతుసుతుఁ డరి
జీమూతసమీరణుండు చిత్తజనిభుఁ డౌ
జీమూతవాహుఁ డితఁడు
జీమూతస్థిరుఁడు ఖచరశేఖరుఁడు సుమీ. ౧౨౮

క. అనవుడు నది మలయవతిం
గనుఁగొని యిది గౌరికరుణఁ గలిగెం జెలియా
మును పెందు మితఁడు రూపసి
యనఘుఁడు వరియింపు మితని నతిమోదమునన్. ౧౨౯

ఉ. నావుడుఁ గన్యకామణి మనంబునఁ గూరిమి నాటుకొల్ప నా
భావజుబాణము ల్మిగులఁ బజ్జఁ జరించినఁ దత్పరాగమో
నావిలసిల్లి లేఁజెమట నవ్యముగాఁ గుచసీమఁ దోఁప ల
జ్జానతాస్య యై నిజవయస్యకు నుత్తర మీక యుండినన్.

వ. చతురిక మఱియు నొత్తి పలుకునప్పుడు. ౧౩౦

సీ. జనని పుత్తెంచిన సఖి వచ్చి పిల్చిన
నిఁక నుండరా దని యిచ్చఁ దలఁచి
పోఁబునఁ బ్రియుఁ డెట పోవునో యని నిల్చి
తడసినఁ గోపించుఁ దల్లి యనుచుఁ
గదలి వేదన మదిఁ బొదలఁగా నేటికి
నెదురీఁదుచాట్పున నింటి కేగి
బలవంత మైన యావలవంత మదిలోన
వేఁగుచు నొకచోట వెచ్చనూర్చు
చున్నఁ జూచిచెలియలొయ్యనఁజనుదెంచి
హృదయతాపమెఱిఁగి మదిఁగలంగి
చంద్రకాంతవేది శయ్యాతలంబుపైఁ
జేర్చి శిశిరవిధులు సేయునపుడు. ౧౩౧

క. పుష్పొడియుఁ బువ్వుఁ దేనెయుఁ
గప్పురమును జందనంబుఁ గలసిన పన్నీ
రప్పాలఁతుకపైఁ జిలికిన
నిప్పుపయిం జిలికినట్టి నెయ్యిం బోలెన్. ౧౨౯

సీ. కుప్పలు గొనఁజల్లుపుష్పొడియొసపుగాఁ
బొరిఁబొరివిరహాగ్నిఁ బొగులుఁజొచ్చె[1]
ఘనసారమిళితచందనపంక మురమునఁ
దొడిఁదొడి నెఱసులు విడిచి చిటిలె
సెజ్జపైఁ బఱచిన చెంగల్వరేకులు
స్రుక్కమై సోఁకినఁ జుర్రుమయ్యె
విసనకఱ్ఱలు చేసి విసరుచో నాపుఁ
గదళీదళంబులు గ్రాఁగి ముణిఁగె
మోవికెంపు డిందె ముక్తియంబులు గందెఁ
గంకణముల లక్క కరఁగిపాఱెఁ
జలువమందు లెల్లఁ జెలువ మందఁగఁ జేయు
నెడఁదమదనతాప మినుమడించె. ౧౩౦

క. కలకలఁ బలికెడు చిలుకల
కలకలములుఁ గోకిలముల కలరవములు నా
కులపఱుప నళికులంబులు
నులుకఁగ నయనముల జలము లొలికెం జెలికిన్. ౧౩౧

వ. ఇట్లు పెచ్చగిల్లిన[2] పచ్చవిల్తువెచ్చ నిచ్చ నచ్చెలిం జూచి కలంగి ప్రబలదర్పితుం డగు నాదర్పకుని దూఱం దలంచి చతుర యైన చతురిక యి ట్లనియె. ౧౩౨

1. విరవిర విరహాగ్ని విరయఁజొచ్చె. 2. పెచ్చగిల్లిన-పెచ్చు పెరఁగిన.

మ. అళులారా యలికుంతలం జెలిమితో నానంద మందింపుఁడీ
చిలుకా చిల్కలకొల్కి నేపక సఖిస్నేహంబు వాటింపుమీ
వలరాజా వలవంతి మాన్పుము పికద్వంద్వంబ యీద్వంద్వముం
గలయం గోరుము మారుతా మరలుమీ కన్నంత నిక్కన్నియన్.

వ. అనునప్పు డక్కుమార ఖేచరున కైన యత్తాపమునకుం దాప యగు నా నిఖేచరుం డాదిత్యుండు కాంతి సడలినట్టు దిరిగి చని ఘనపుష్ప రాశితల్పంబునం దనమేను సేర్చిన. ౧౩౫

క. జలనిధి వెలువడి యెఱ్ఱఁగ
బొడమెను కిరణములు శిఖలపోలికి నిగుడం
గడఁగి యుడురాజు విరహుల
బడబానలు మనఁగ నుదయపర్వతి మెక్కెన్ ౧౩౬

గీ. అంత జగమునిండ నచ్చెవెన్నెల పర్వ
నంపులోని వేఁడిఁ గంది కుంది
కాఁగఁ బెట్టినయుదకంబులో పల నున్న
మీనునోలె బాల మిడుకఁ జొచ్చె. ౧౩౭

వ. ఇట్లధికవిరహతాపంబునం బరపురం బొక్కుచున్న కన్నియం జూచి కళవళించి చెలులు మెత్తన నెత్తుకొని చని గుజునెందపందిరిక్రింద నరవిందతల్పంబుపై నిడి పైనం జేమి దలంచునో యని దానిమేని కట్టావులం గ్రాఁగిన తమ్మి సవరించుకొనుచు. ౧౩౮

క. తను వంట నోడి వనజా
ననకును జేమంతిపువ్వునం గొని పన్నీ
రెనయ మెయిఁ బూయుచోఁ గ్రాఁ
గినపెనమున నొలుకు నూనె క్రియఁ జుయికొట్టెన్.[1] ౧౩౯

1. చుంయనియెన్ - చుయుకంటెన్.

క. అస్తోకంబుగ నత్తా
శిస్తని కుచమండలమున లలనలచే ని
న్యస్త మగుచందనము సన
కస్తూరీ లేపనంబు కైనడిఁ దోఁచెన్. ౧౮౦

వ. అవి యన్నియుం జూచి దక్షిణ కౌన్నెలి నాసుగిక న్యాయనిష్ఠురో
క్తులఁ జంద్రు నుద్దేశించి. ౧౮౧

క. ఉడురాజ నీవు పొడిచిన
జడనిధి యుడుకెక్కి యెక్కసంబునఁ బొంగెన్
బడబాగ్ని మీఱి నావుడుఁ
బడఁతుక నీవేఁడిఁ జిమిడిపడ కెట్లుండున్. ౧౮౨

క. హరిణాక్షి చూడ్కిఁ గన్నుల
సిరిగోల్పడి యిట్టి నిన్నుఁ జేరిన నీ వీ
తరుణిఁ దెగఁజూడఁ బోలుదు
పరికింపఁగ నెపుడుఁ బక్షపాతివి గావే. ౧౮౩

మ అమృతాంభోనిధి జన్మభూమి సురభూజైరావతశ్రీసుధా
ప్రముఖంబు ల్తగు తోడఁబుట్టుగు లుమాప్రాణేశుజూటంబు గే
హము బింబం బమృతం బనంగ జగదాహ్లాదంబుగా నిన్నుఁ జూ
తుము నీవేఁడిమి కాలకూటమునకుం దోఁబుట్టు వయ్యెంగదా.[1]

గీ. నాఁడు నేఁడు నీకు వాఁడుఁదోఁబుట్టువు
లేదె కరుణ లేదు లేశ మైనఁ
బొలఁతి మొగముతోడి పొత్తైనఁ బరికించి
చల్లసేయుమయ్య చందమామ. ౧౮౪

వ. అని వేఁడుకొని మలయవతిం జూచి. ౧౮౫

1. దోఁబుట్టువౌటంజూమీ - వౌటంగదా.

సీ. వనిత నీకన్ను లొయ్యన విచ్చి చూడవే
మారుబాణము లరుదేరనోడు
సబల మావీనుల కమృతంబు చిలుకఁగాఁ
బలుకవే చిలుకలు పలుకనోడుఁ
గోమలీ నీదు ముంగురులు పాటింపవే
తేఁటిదాఁటులు కొంత దాఁటనోడు
ధవళాక్షి నీముఖదర్పణం బెత్తవే
సోముఁడు నీదెసఁ జూడనోడుఁ

బాడఁతి మమ్మిఁ దగినపనిఁ బంపఁజీరవే
కోకిలంబు లిచటఁ గూయనోడు
మగువ చల్ల నూర్పు నిగిడింపవే యిందు
మలయమారుతంబు మలయనోడు. ౧౪౭

వ. అని ధైర్యంబు పట్టుకొల్పిన నమ్ముద్దియ తనవేదన దీఱ దెలం
గు చెప్పంబూని వ్రీడావశంబున నోడి మారుప్రేరణం దవులు
కొని చెలిం జూచి. ౧౪౮

క. ప్రథమమువనుండి చిత్త
వ్యథ యెఱుఁగుదు ప్రాణసఖివి వలనైనమనో
రథ మొనగూర్పక యీమ
న్మథుబారికిఁ ద్రోవ నీకు న్యాయం బగునే. ౧౪౯

క. సఖిపణికిఁ దోడుపడి యో
చతురిక నెను నెంట ముందు చల్లుచు నన్నుఁ
బతిమాలించెద వకటా
హితులుం బగవారిఁ గూడి రే మనవచ్చుఁ. ౧౫౦

వ. అనిన నోయమ్మ నీ నెమ్మనంబున నింత యుమ్మలికం బేల నమ్ము
మతనిం దెచ్చెద నూఱడు మని చతురిక మనోహారిక యను

సఖిం జూచి యీచేడియ గౌరీధామంబున జీమూతకేతు కుమారు సుకుమారుం జూచి వలచినయది యని మనరాజున కెఱింగించుట విచారం బగునే. ౧౫౧

క. చెప్పినఁ బతి గోపించును
జెప్పకయుండినను బాల చిక్కఁడు మనసుం
దప్పులు దొలఁగునుపాయము
చొప్పడు నేదేని బ్రదుకఁ[1] జూడఁగ వలయున్. ౧౫౨

క. అని తలపోయుచు నుండఁగ
వనజంబులు వెలయఁ గుముదవనములు పొలుపుం
గనుకని చీఁకటి పొలియఁగఁ
దనరుచి దివిఁగలయఁ బొలయఁ దపనుఁడు పొడిచెన్.[2]

సీ. ఆవేళఁ జతురిక యనునన్నుఁ బ్రాణంబు
నిలుపంగఁబూని యా నెలఁత వేసి
యిష్టునిఁ గూర్చెద నేతెమ్ము గౌరిసి
వాసమ్ముకడ కని యానగొలిపి
కొని చని మాధవీకుంజంబులోపలఁ
జల్లని పల్లవశయ్య నునిచి
నగవకు జీమూతవాహనుం దెచ్చెద
నని నాలుగడుగులు నడచునంత
వెడఁగ మదనుచేత హృదయసంతాపంబు
పొదలఁబువ్వుఁబొదల మీఁదఁబూని
సంగడీనిఁ గూడి యంగనఁ దలఁచుచుఁ
బలవరించు నతనిపలుకు వినియె. ౧౫౪

1. చొప్పడు నేదేని బ్రదుకఁ చి. మూ. తప్పదు యేవనిష్టైనను ముప్పవుమనకేమిష్టైన మోసమువచ్చున్. 2. క. మనసిజునియేపు జాఱఁగఁ....తనరుచి దివిగలయ బాలతపనుఁడు పొడిచెన్.

వ. అది యెట్లన్నను. ౧౫౫

ఉ. మారుని మోహనాస్త్రము, సమస్తవిలాసవిహారభూమి, శృం
గారరసంబు తేట, తొలుకారు మెఱుంగులపుట్టినిల్లు, సం
సారసుఖంబు లేమొలక, చక్కఁదనంబులప్రోక కాఁకబం
గారము చేగ, యాతరుణి కన్నులపండువ గాఁడె చూచినన్. ౧౫౬

క. నెఱిచెడి యింటికిఁ జనునా
తెఱి మొగమున కెగయు తేఁటిదాఁటునకై తాఁ
జెఱికనుఁ బెడమఱి చూచినఁ
జూఱుకొనినా నెఱనునాఁటెఁజూ పెనుదూపై.[1] ౧౫౭

వ. తన్మూలంబుగా మన్మథుండు ప్రాణవిరహితుండయ్యె నని తద
నంతరంబ.[2] ౧౫౮

క. మదనుని యోనష్టులు నా
హృదయాగ్నిసి భస్మమయ్యె నిదిమొదలుగ నీ
పదునాలుగులోకములును
బ్రదుకుఁ గదా నీనిచేతిబాధకు నెలిమై. ౧౫౯

క. మధుకర సన్ముఖపంకజ
మధుకరభావమున మిగుల మత్తిల్లి సుధా
మధుర మగు నానధూమణి
యధరము గవిచూడఁ గలుగునా యిఁకనాకున్. ౧౬౦

వ. అట్టిపోటికి నూటములేక మదిం గంది కుంది బ్రతుకకంటెఁ బ్రా
ణంబులు దొఱంగుట మే లనిన మధుకరుం డాకుమారకంఠీరవ
యింతలో ధీరత్వంబు విడుతురే నాపుడు నభిమానించి. ౧౬౧

1. నె, నకనాటంజూపె మన్మసంజడమూహై. ఉఱికినఁ బెడమరిచూచిన, నెఱసకిఁ జేరిననాగనె 2. తన్మూలంబునాఁ బెడమఱిచూచిన మన్మథుండు తెగఁజూచుట లోకోపకారంబయ్యె.

క. పూచినరసాలభూజముఁ
జూచితిఁ జంద్రాతపమ్ముఁ జొచ్చితి నిన్నన్
నీచేతికదళిదళముల
వీచోపులగాలినుంటి వీఁగుడఁ గానే. ౧౬౩

వ. అనునెడం జతురిక డగ్గఱి తనచెలి వల పెఱింగింపం బూని.

క. వీరుఁడవు మేరుభూధర
ధీరుఁడ వత్యంతదానదీక్షాజితమం
దారుఁడవు భూరికరుణో
దారుఁడ వయితేని బాల దయఁ జూడుమిఁకన్. ౧౬౪

వ. అని మఱియును.[1] ౧౬౫

క. మలయాచలసానువుపై
మలయుచుఁ జనుదేర గౌరిమందిరమున ని
ర్మలయశుఁడ వైన నిను మా
మలయపతికన్య చూచె మానముదూలన్. ౧౬౬

క. అది మొదలుగ మరునమ్ములఁ
జెదరినధైర్యమునఁ జేయి చెక్కిట నిడి స
మ్మదముడిగి మనము నీపై
గదియించును జూడ్కి బాష్పకణములుదొరఁగన్. ౧౬౭

క. భావజనిభుఁ డగు నాతని
భావంబునఁ గూర్చి నిలిపి పరిరంభణ సం
భావన సుఖ మొనగూర్చెడు
దైవము నాపాలఁ గలుగదా యని తలఁచున్. ౧౬౮

1. ఈక్రిందివి దశావస్థలకందములు.

క. అనిమేషంబునఁ బ్రియునిం
గనుఁగొనఁగాఁగోరుకన్నుఁగవ కడ్డము వ
చ్చినఁ దనుఁ గోపించు నొకో
యని కన్నులఁ జేర నిద్ర యలుకుచునుండున్. ౧౬౯

క. విను గడు సన్నం బగునీ
మనముఁ బ్రవేశింప నిదియ మత మగు నని డ
స్సెనొ కాక యనఁగ నంగన
తనతనువునఁ దనువు లేక తనువైయుండున్. ౧౭౦

క. సారసములు నారసములు
హారంబులు కంటకప్రహారంబులు క
ర్పూరము విషపూరము శృం
గారము బంగార మయ్యెఁ గామినిమదికిన్. ౧౭౧

క. నేనుం దానును నొక్కటి
గా నుండఁగ నొరునిఁ దగిలెఁగా యనుచు నుదా
సీనంబు వీఁకోలుగ
మానినికిన్ లజ్జ దలఁగె మరు జేటమునన్. ౧౭౨

క. పలికెఁ బొడసూపెఁ బ్రియుఁడదె
పిలిచె ననుం గీరచంద్రపికములయెడ వా
గ్విలసనరవములుఁ బలుకులు
మొఱ తేరఁగ సంభ్రమించు మ్రొక్కును లేచున్. ౧౭౩

క. మోహామున మన్మథానల
దాహాముపై నిల్వఁగలేక తనప్రాణంబుల్
దేహమునఁ గలుగుటకు సం
దేహముగాఁ జెయ్వులుడిగి దృష్టి మొగుడ్చున్. ౧౭౪

క. సతి విడిచిన ప్రాణంబులు
పతి నిలుపఁగ నుండె నేఁగఁ బాడియె యతఁడీ
యతివ డిగవిడిచి తలఁగిన
సతి వేగమ తలఁగి పోవ నని యున్న వనా. ౧౭౫

క. ఖేచరవంశవిభూషణ
యేచోట వసింప లేక యెవ్వేఁబయున న్నా
నాచెలిప్రాణంబులు నినుఁ
జూచిన తావునన యెదురుచూచుచు నుండున్.[1] ౧౭౬

మ. అని చెప్పంగ లతాగృహంబుకడఁ బ్రాణాధీశుచే నేఁడు మ
న్నన లే దింకిట నెన్నిజన్మములకై నన్ భర్త జీమూతవా
హనుఁ డౌఁగాత మటంచుఁ దీఁగెయురిలో నాభాలకంఠంబుఁ దూ
ర్చిన లోకాంబిక యైన యంబిక కృపం జేసస్తి తా నిట్లనున్.

క. హృద్యాకారిణి యీమల
యోద్యోగం బుడుగు బాలుఁ డుత్తముఁడు యతో
విద్యోతితుఁ డన్నికాయును
విద్యాధరచక్రవర్తి విభుఁ డౌనీకున్. ౧౭౭

వ. అనిన ననుమానించు నెడ నచ్చటురికయు వియన్నగరమాగం
డునుం బఱతెంచి కంఠంబున నున్న లతాపాశం బూడ్చి భుజలు
తాపాశంబిడి యింత తెంపు సేయుదురే యే మిందె వచ్చుచున్న
వార మని బుజ్జగించిన నుజ్జీవిను వగు నజ్జోటిలజ్జామజ్జదవనతా
ననాబ్జ యై పులకించి గురుని యనుమతి లేమిం గొందలపను నెడ
మనోహారిణి యనుసఖి వచ్చి గౌరీపరిసాదవిభవం బిట్టిదిగదే యని.

[1] మతి. గోచరముగు నావుదేం గొంతుచునుండుదన్.

గీ. అమ్మ నీవు గోరినట్లు మీతండ్రియు
నితని కిచ్చెద నని యెఱుఁగఁ జెప్పె
మిముఁ బెండ్లి సేయ మిత్రావసువునకు
నానతిచ్చె నటకు నరుగుదెమ్మ. ౧౮౦

గీ. అన్నమాటఁ బొంగి కన్నులఁ బ్రియునికిఁ
గన్నె మ్రొక్కి యేఁగె నన్నకడకుఁ
జిత్తముల్లసిల్ల జీమూతవాహనుం
డాప్తగురులకడకు నరుగుదెంచె. ౧౮౧

వ. తదనంతరంబున మిత్రావసుండు జీమూతకేతుం డున్నకడకు వచ్చి యస్వాభూవసుల పరస్పరానురాగం బెఱుకపడం జెప్పి ప్రార్థించి తదనుమతి వివాహవేళ నిశ్చయించి నానానగరనివాసు లైన కిన్నరకింపురుష గరుడగంధర్వ సిద్ధసాధ్య విద్యాధరులం గూర్చి యుభయపక్షంబులుగా నేర్చి సకలశృంగారాభిరామంబుగా నొనర్చిన కళ్యాణమండపంబున నున్నసురేంద్రాదిసురులు వధూవరులం జూచి సదృశకులవయోరూపలావణ్యంబులు గల మిథునంబుం గూర్చుటకుం బితామహునిం గొనియాడుచుండ. ౧౮౨

సీ. అప్సరస్స్త్రీలు కళ్యాణగానంబులు
తెఱఁగొప్పఁ బాడఁగా దివ్యమునులు
ప్రకటించి మంగళాష్టకములు చదువంగ
రత్నములం దలఁ బ్రాలుగాఁగ[1]
నగ్ని దేవుండు ప్రత్యక్షమై సాక్షిగాఁ
దగ బ్రహ్మమునులు మంత్రములు సెప్ప
నిర్జరకాంతలు నివ్వాళులిడఁ[2] గల్ప
వృక్షంబు లొగిఁ బుష్పవృష్టి గురియ

1. చేతనంబ్రాలుగాఁగ. 2. వాసుకిసుతులు నివాళింపఁగా. నిర్జరకాంతలు నివళింపఁగా.

సురలు పరిణమింప సురదుందుభులు మ్రోయ
నారదుండు దీవెనలుగఁ బాడ
విశ్వమెల్లఁ బొగడ విశ్వావసునికూఁతుఁ
బరిణయించె ఖచరవరసుతుండు. ౧౮౩

గీ. పరిణయోత్సవంబు జరిపి సిద్ధవిభుండు
గౌరవమున నెల్లవారి ననిపె
స్త్రీసమేతుఁడైన జీమూతవాహనుఁడు
గురుపదాంబుజములు గోరి చనియె. ౧౮౪

క. జనకుని యనుమతిఁ గతిపయ
దినములు రతితంత్రగతులఁ దేలుచు నసితా
జనతానురాగుఁడై చం
దనగిరిపై నతఁడు మనము దనియ సుఖించెన్. ౧౮౫

ఉ. అంతట నొక్కనాఁడు ప్రణయాన్వితుఁడై తమబావఁ గూడి ప
ర్యంతవనాంతభూమిఁ గలయం జరియించుచు వింతకాంతి న
త్యంతసముజ్జ్వలం బయిన యస్థిసమూహముఁ గాంచి పర్వత
ప్రాంతమున న్నగధ్న నిభం బని యేమిది బావ నానృపున్.

వ. అతం డి ట్లనియె. ౧౮౬

క. పక్షీంద్రుఁడు పక్షానిల
విక్షిప్తం బైన జలధి వేఁటాడి మహా
చక్షుశ్శ్రవముల నిత్యము
భక్షించుచునుండుఁ దొంటిపగ మొదలాఱన్. ౧౮౭

క. ఆగరుడికి నెఱచి మహా
నాగేంద్రుఁడు వచ్చి యనుదినము నొకపాము
న్నీగుంటికడకు నేసై
వేగమె పుత్తెంతు నింక వేఁటాడకుమీ. ౧౮౮

ఉ. మత్సరపక్షపాతహతిఁ దోయధి పాయలుగాఁగ వచ్చు నీ
యార్భాట మెల్లెడ న్విని భయంబున నందు భుజంగమాంగనా
గర్భము లెల్ల నూడిపడఁగా నిది నీధనహాని[1] గావున
న్నిర్భయవృత్తినుండఁ గరుణింపుము నీకుఁ బ్రణామనమోస్తికిన్.

మ. అని ప్రార్థించి యహీంద్రుఁ డేఁగి దినమర్యాదన్ ఘటిం బంపఁగా
వినతాపుత్త్రుఁడుఁ బెంచు నుండు నని భావింప న్నతాసంఖ్యముల్
విను మూతెల్పు తదద్రికూటము జగద్విఖ్యాత మీతాఙ్క్రి వ
స్త్రన మిచ్చో మననంబున న్నిలువ యుక్తంబౌనె లోకోత్తమా.

గీ. అనుచు దానవరాజుఁ డగువానిమది నొండు
పుట్టకుండ మరలి పోవ మనుచుఁ
బిలుచునంతఁ దంద్రి పిలువఁ బుత్తెంచినఁ
బాపపోయె సిస్థపతిసుతుండు. ౧౯౨

గీ. అంత నక్కుమారుఁ డహిరాజు మది దూఱి
గరుడువలన నురగమరణములకు
నూఱుమయ్యె దాన నేలికతన మెద్ది
యేమి పెక్కితన మదేటితగవు.[2] ౧౯౩

క. అకటా నాగేంద్రుఁడు ప్రసు
కృక జిహ్వాలు రెండువేలు గలుగఁగ నొకనా
లుకనైనఁ దన్నుఁ దిని స
ర్పకులము రక్షింపు మనుచుఁ బలుకం దగదే. ౧౯౪

సీ. అని కరుణాకరుం డైయేఁగుచో నొక్క
వృద్ధకామిని పుత్రు వెనుకఁ దగిలి
హాశంఖచూడ వంశాధార యోయన్న
నీచిన్నిమోమెందుఁ జూచుదాన

1. నిర్వహాని. 2. ప్రదుకు.

పక్షినాయకుబారిఁ బడఁద్రోచి యే నిప్డు
నిలుతుఁ బ్రాణంబుతో నీవు సను.గ
బంధువు లందఱుఁ బగఱ కొప్పించిరి
యింకిట నీకు విక్రయాన్ని గడ్స్య
యనుచుఁ బలవరింపఁ గనుఁగొని యది చూసి
జననిఁగా నెఱింగి మనుసుఁబూని
వీనిఁ గాచువాఁడ నెఱవన నోయమ్మ
యనిన గరుఁడుఁ డనుచు నబల వెగడి. ౧౯౫

క. పైచీరఁ గొడుకుఁ గప్పినఁ
జూచి యతం డేను వినతసుతుఁడఁ గాసే
ఖేచరకులజుఁడ నీసుతుఁ
గాచెద వెగ డుడుగు మన్న గుడనికిఁ బ్లైక. ౧౯౬

వ. అనిన వెగ డుడిగి యప్పడది యిమ్మాట యింక నొకమాటాడుఁ
డనిన నతండు నవ్వి. ౧౯౭

క. నేలయు నుదకముఁ దేజము
గాలియు నాకసము నెఱుఁగఁ గాచితి నాక్తో
కో లిదె రెం డాడఁగ నా
నాలుక మిూఁకలము నాగి నాలుక లున్నే? ౧౯౮

ఉ. మేరువు సంచలించిన సమీరుఁడు నిల్చిన భూమి గ్రుంగినం
దారక లెల్ల డుల్లిన సుధాకరుఁ డగ్నికణంబు లొల్కిన
న్వారిధు లింకిన న్నభము వ్రాలిన భానుఁడు నల్లనైన నం
భోరుహసూతి దప్పినను బొంకను నే మునుపాడి క్రమ్మఱన్.

ఉ. నాపుడు నాగకాంత కరుణాకర యోఖచరేంద్ర నాసుతుం
గావఁగఁ బూని వచ్చితివి కన్నతనూజునికంటె నీయెడన్
భావము సార్ద్రమైన యది పన్నగవైరికి నిమ్న నిచ్చి యే
త్రోవల నేఁగుదుర్ బ్రదుకు త్రోవ విచారము లేదు నా కికన్

గీ. అన్న నీకు నతిచిరాయువు గావుత
మన్న శంఖచూడుఁ డతనిఁ జూచి
కరముఁ జోద్యమంది కరములు మొగిడించి
విన్న(దనము లేక విన్నవించె. ౨౦౧

క. వసుధఁ గొఱగాని కడుఁ గా
లసులము పులుకాసిపుష్వులము¹ మాకై నీ
యసువులఁ బగఱకు నొసఁగుట
కసవునకై రత్న మమ్మఁ గడఁగుట గాదే. ౨౦౨

శా. సంసారాటవిలో సలంగఁ గావు మత్స్యామాన్యముల్ వ్యర్థముల్
హింసామూలము లైన జంతువు లసంఖ్యేయంబు లోక్షేత్రలో
త్రింసా నీకెనర్హ్యైనవారు గలరే ధర్మాధికు ల్వెంచలో
హంసానీకము లేదుగాక బకభేకౌఘంబు లేకుండునే. ౨౦౩

క. మావంటివారి నూర్వురఁ
గావఁగఁ జాలుదువు నీ వొకనిఁ గాచుటకున్
జీవం బిచ్చిన నార్తుల
కే వినవున బ్రదుకవచ్చు నెడగైన యెడన్. ౨౦౪

క. మానులమువారు విడిచిరి
నీ కీకృప సేయునేల నీచుట్టము నే
శోకంబునఁ జావనుండఁగ
నీ కాంతను మునుపలిఁ గాన్ప మింటియు చాలున్. ౨౦౫

చ. అనవుడు ఖేచరేంద్ర సుతుఁ డచ్చెరువంది ఫణీంద్రనందనా
నిను మిది యేల నాపనికి విఘ్నము చేసెద వింతకాల మీ
వనమున నస్థి వేడను నవాసిశము ల్మాదిఁ గుందుచుండు నేఁ
డనఘ పరోపకారమయుం బిటు గల్గిన నుబ్బ వచ్చితిన్. ౨౦౬

1. కుటిలప్రచారులము.

చ. తనయులు భార్య లన్నలును దమ్ములుఁ జుట్టలు సంగడీండ్రు యా
వనము ధనంబు నంచు మది వారక ప్రాణములైన నిచ్చి తా
ననదను నార్తు దీను శరణాగతుఁ[1] గావనివాఁ డజాగళ
స్తన మని యండ్రు వానికి యశంబును ధర్మము నెల్ల చేకుఱున్.

ఉ. లావు భయార్తరక్షణము లాభము పుణ్యము దేహశుద్ధి స
ద్భావము భూషణం బెఱుక ధర్మముఁ సత్కృప ప్రాభవంబు సం
భావన పాడి సత్యపరిపాలన మే లుపకార మెయ్యెడన్
భావన కీర్తి యాయువు శుభంబు నిజాప్తులు ధాత్రిలోఁ బలన్.[2]

క. జాణ “లసి త్యాని శరీ
రాణి” యనుచుఁ దెలిసి చెప్పరా[3] భువి నా[illegible]
ప్రాణంబు లిచ్చి యార్తు
త్రాణం బొనరింపవలయు ధర్మజ్ఞులకున్.[4] ౨౦౯

గీ. నీవు లేవేని నొరులకుఁ గావవశమె
ధన్య నీవు బ్రదికిన నీతల్లి బ్రదుకు
నదియ కారణముగ నైరి కష్టపడుచు
నీవు గోరిన యట్ల యీ నెలఁతఁ గాతు. ౨౧౦

గీ. అనుచు వధ్యచిహ్నమైన రక్తాంశుక
మడిగి మ్రొక్కినంత నతని నిల్పి
యేల ఖేచరేంద్ర యీదివ్యదేహంబుఁ
బాముకొఱకు విడువఁ బాడియగునె. ౨౧౧

క. క్షోణీమండలమునఁ గల
ప్రాణుల కెడరైన నష్టపడుచుఁ దదీయ
త్రాణం బొనరించుచు నీ
ప్రాణంబులతోడఁ గీర్తిఁ బడయందగదే. ౨౧౨

1. ననద ననాథు నార్తు శరణాగతు. 2. దా వపకీర్తి యశంబు నిజాప్తులు హీనజంతుపుల్. 3. యుండరా. 4. తత్త్వజ్ఞులకున్.

గీ. శంఖధవళ మైన శంఖపాలకులంబు
శంఖచూడు చేతఁ జాలఁ గందె
ననఁగ మీఁదఁ బుట్టు నపకీర్తి నాకది
చావు గాదె బ్రదుకుత్రోవ యేది. ౨౧౩

వ. కావున నన్ను మన్నించెదవేని నీ తెంపు మాని మరలు మని పునః
పునః ప్రణామంబు లాచరించి యాతని వేఁడికొని తల్లిం జూచి
యోయమ్మ నెమ్మనంబున బమ్మరింపకుము నాకెన్నిజన్మంబుల
నైన నీవ జననివి గమ్మని మ్రొక్కి వీడుకొని దేవతాప్రణామో
న్ముఖుండై యని యాహాంత. ౨౧౪

క. గోకర్ణ రాజకంకణు
గోకర్ణనివాసుఁ జూపగుణగోకర్ణా
గోకర్ణశాయిమిత్రుని
గోకర్ణేశ్వరునిఁ జూచుకోరికి నేఁగెన్. ౨౧౫

సీ. అట ఖేచరాత్మజుఁ డార్తునిఁ గాచుట
చేకూరు టెట్లని చింతనొంది
యర్ణవతీరగోకర్ణంబునకు వాఁడు
చని వచ్చునంతకుఁ జనఁ దలంచి
యుత్తవా రిచ్చిన యరుణాంశుకంబులు
వధ్యచిహ్నమునకు వలనుగాఁగఁ
బూఁకించి చని వధ్యశిలయెక్కి మదిఁజొక్కి[1]
గారుడాగమనంబుఁ గోరుచుండి

తల్లి కనకవతియుఁ దండ్రి ఖేచరపతి
కాంత మలయవతియు గాఁగ నాకు
నీపరోపకార మెల్లజన్మంబులఁ
గలుగ వలయు ననుచుఁ దలఁచునపుడు. ౨౧౬

1. వడిఁబొంగి.

మ. గిరు లల్లాడఁగ నర్కుతేపు దొలఁగం గీర్ణంబులై మింటిపైఁ
దరువుల్ గ్రద్దలభంగి నాడఁగ సముద్రం బెల్ల ఘూర్ణిల్లఁగాఁ
హరిదంతంబులు పక్షకాంతి నవసంధ్యాలీలఁ గీలింపఁగా
గరుడుం డార్చుచు వచ్చె నచ్చటికి నాకారంబు ఘోరంబుగన్.

ఉ. వచ్చి యతండు నుగ్రముస వ్రయ్యలు వాఱఁగఁ దన్ని ముక్కునన్
గ్రుచ్చి వియత్పథంబునకుఁ గొంచుఁ జనంగఁ గిరీటరత్నముల్
చెచ్చెర మాంసఖండముల చెల్వున భూమిఁ బడంగ నిచ్చలో
మెచ్చి కుమారకుండు ధృతిమీఱుచు మే లొనఁగూడె నా కనన్.

ఉ. అంబరసీమనుండి మలయాద్రి శిలాస్థలి వ్రాలి వేడ్కచి
త్తంబున మాంసఖండములు దన్పుము గ్రమ్మఁగఁ ద్రెంచి మ్రింగఁగా
నంబరచారినందనుఁడు హస్తరసంబున మేను నిమరంగ న
త్రాంబుజ ముల్లసిల్లఁ బులకాంకితుఁడై విహగేంద్రుఁ జూచినన్.

వ. అంతఁ బక్షీంద్రుండు. ౨౧౯

ఉ. వేదన మేను స్రుక్క దరవిందముఖాంతిఁ దొఱంగ దానవం
బాదరణంబు నాయెడ మహాఘన మైనది యంతరంగ మా
మోదతరంగితంబు సిటమూత్రివిలాసము దివ్య మిట్టి కా
కోదరజాతి లేదు సుగుణోత్తమ యెవ్వఁడ వీవు నాప్రభుఁడన్. ౨౨౦

ఉ. ఎవ్వఁడ నైన నేమి[1] మఱి నిన్ను విచారము లేల నీకు నేం
డెవ్వఁడు భక్షణం బగు నహీశ్వరబంధువు[2]గాక యెవ్వఁడున్
మన్నము దప్ప దంగలుత మానవు గంటుల రక్తపూరముల్
గ్రొవ్విన మాంస మున్నయది కోర్కి భుజింపు భుజంగనాశకా.

క. అను నెడ నాగోత్తమ్మే
నునకుం బ్రణమిల్లి శంఖచూడుఁడు మఱుడం
జనుదెంచి వధ్యశిలమీఁ
ద నవం బగు రక్తబిందుతతిఁ జూడఁగాంచెన్. ౨౨౩

1. నైతినేమి. 2. నహీంద్రులఁ దిందువు.

గీ. కాంచి మున్నతండు వంచించి వచ్చుట
తెలిసి తన్నుఁ దాన తిట్టికొనుచుఁ
గులముఁ గావనైతి గురునాజ్ఞఁ దప్పితి
నన్నుఁ గాంచి యొకని మన్నిగొంటి. ౨౨౮

గీ. ఇట్టి కష్టజీవ మేటికి నాకని
వాఁ గనంగి యచటి కేఁగుదెంచి[1]
శోన కేంద్రపతనయుఁ జూచుచుఁ దలయూఁచి
భుజగనగరిఁ జూచి భుజగవరుఁడు. ౨౨౯

మ. వినతాసంభవ దీనరక్షణపరుఁ విద్యాధరేంద్రాత్మజుం
డిన ధన్యం బగునే సహింపు మకటా దృష్టింపవే పాములం
దినవే యాదవి మున్నెఱుంగవె భవద్భృత్యాత్ముఁడో రాజపం
పున నేవచ్చితి నాగపుత్రుఁడ ననుం బోనీక భక్షింపుమా.

వ. అనిన గరుడుండు పడియున్న యక్కుమారకుం జూచి నే నెఱుంగ
నైతి నీకీమహాపరాధోద్యోగం బేల యనవుడు నతం డేమని చెప్పుదు
నాయుష్యం బంతయు విఫలం బయ్యె. ౨౩౦

క. వికలము లగుప్రాణంబుల
నొకయుపకారంబు సేయనోపుదు నని కో
రిక మున నినుఁ గొలువఁగ వీఁ
డకటా యవసానమ్మరి యైచనుదెంచెన్ ౨౩౧

చ. అనునెడ శంఖచూడుఁడు రయంబున డగ్గఱి వచ్చి యెత్తి యో
ఘనకరుణార్ద్రమానస యకారణబాంధవ సత్యసంధ యీ
వినతసుతుండు నీ ననువివేకము లేక యహీంద్రుఁ డంచు నీ
సునఁ దెగటార్చె నొక్కొ యనుచుం దను వంటఁగఁ జేర్చి యేడ్వఁగన్.

1. వోఁ గనంగి యచటి కేఁగుదెంచి- వావఁదలచి యచటి క్రేవవచ్చి.

గీ. వధ్యచిహ్న మైనవసనంబుఁ జూచితి
నెఱుఁగనైతి నీతఁ డెవ్వఁ డనిన
వ్యోమచరవిభుండు జీమూతవాహనుం
డనుచు వెఱఁగుపడుచు నడలి గరుడి. ౨౩౦

క. మందరతటమున హిమవ
త్కందరముల మలయసీమఁ గైలాసమునన్
బృందారకసుందరు లా
నందంబునఁ బాడు ఖచరనందనుఁ డీతఁడే! ౨౩౧

క. కడుఁ బుణ్యుండగు నీతని
మడియించిన శోకవహ్ని మడియుట కంటెన్
సుడిగొని జడనిధి నుడికెడు
బడబాగ్నిం బడుదుఁ గడిఁదిపాపం బడఁగన్. ౨౩౨

సీ. అనుచు నంతికమున్న తనయుకిరీట
రత్నంబు కోడలియంకతలముమీఁదఁ
బడిన నాపడఁతుక పతిశేఖరం బని
బెగడుచు ముందటం బెట్టె నంతఁ
గాంతయుఁ దాను నిర్ఘాతపాతం బైన
తరువుకై వడిఁ గూలి తడసి తెలిసి
ఫణిఫణామణి యని భావించి సుతునిదిగాఁ
జూచి తన్స్మృతి గలుగు టెఱిఁగి
మూర్ఛనొందుచు శోకాగ్ని మునిఁగిమునిఁగి
యాలుఁగోడలుఁ దనతోడ నడలినడువ
మారుతప్రేరితం బగుపూరిబొమ్మ
భాతి నేతెంచె జీమూతకేతుఁ డటకు. ౨౩౩

వ. ఇట్లుచనుదెంచి యట గురుజనప్రాణభయాకులుం డై నెత్తుట జొత్తి
ల్లిన యురగ కుమారునిమీఁద నొరగిన కుమారుప్రోల ప్రాలి.

సీ. ఓయయ్య మాబావయును నీవు నాడుచు
నున్నార లని నమ్మి యుంటిఁగాక[1]
దవ్వొ గఁత్తునే[2] తడపిన రానైతిఁ
గులరత్న మా నిన్నుఁ గోలుపడితి
రాజ్యంబు విడిచి యరణ్యంబుఁ జేరియు
నీసేవ సౌఖ్యంబు నెగడఁగంటి
సద్భక్తిసేయ వే సరగున నోయన్న[3]
చెఱుగుఁబాముల కేల జీపమాయ

గరుడనఖముఖాగ్రఘాతంబునకుఁ జొరఁ
బూనె మెత్తనైన మేన దెట్లు
మాకు దిక్కుగలరె యోకరుణాకర
చీఁకుచేతికోల చిన్నికుఱ్ఱ[4]. ౨౩౫

వ. అని పలవరించుచు మేనంటి చూచుచుండఁ గనకవతియుం గనుఁ
గవ నశ్రుపూరంబు తోరంబుగాఁ బెదవులు దడుపుచు మొగము
వెలవెలం బుచ్చుచుఁ గోడలిం గూడి గోడాడుచు. ౨౩౬

సీ. ఓతండ్రి యందఱ నొక్కపెట్టునఁ జంపఁ
గడఁగితి వొకపాముఁ గావఁబూని
ధనకనకాదులు తనియ నిత్తురు గాక
ప్రాణంబు లొసఁగెదు ప్రభుఁడు గలఁడె
తనతల్లికడుపు చల్లన చేసికొన నోవి
శంఖచూడుఁడు నీకుఁ జావొనర్చెఁ
జీఁకువట్టినకోల యీకుమారుం డని
గరుడుని కేలొకో కరుణలేదు

1. మన్నారటంచు నే నుంటిఁగాక. 2. ధర్మైకనిరత. 3. సద్భక్తిసేయ వేసరితివో యోయన్న. 4. చెఱుకుచేతికోల చిన్నిబాల.

దైవమేల యిట్లు దలఁచె నే నెట్లోర్తు
నేమిసేయుదాన నెందుఁ జొత్తుఁ
బాసి యేఁగఁ దగునె మూసినముత్తైము
పంజరమ్ముచిలుక పసిఁడిబొమ్మ. ౨౩౭

క. మలయవతిమీఁదిప్రేమము
మలయించెనె దైవమిట్లు మ మ్మీడఁజేసెం
బలుకొకటి ప్రాఁతి చిలుకల
కొలికీ నా గంధమూమకూనా నీకున్. ౨౩౮

వ. అని విలాపింపంగఁ బ్రాణహానికి శంకించెద రని తన ప్రాణంబులు
చిక్కఁబట్టి యుల్లాస కనువిచ్చి జననీజనకులం జూచి. ౨౩౯

క. గుణులార మీరు నాకై
పురపురఁ బొక్కంగవలదు భువి "ధన్యస్య
త్వరితాగతి" యనుపలుకున
బరహిత మొనరింపఁ గంటి బ్రమి కెది గాదే. ౨౪౦

ఉ. అస్థిగృహంబు దేహము దురాశలఁ జిక్కులు వోనస్రుక్కి నో
గస్థితిఁ జిక్కి చచ్చు టధికం బగుమోసముగాక, దానిచే
నస్థిర మైనప్రాణమున నస్తువ[1] మిక్కిలిగా జగంబునన్
సుస్థిర మైనకీర్తిఁ గొన జూచిన లాభమునం గొఱంతయే. ౨౪౧

వ. కావున వగ పుడిగి నాగకుమారు నాకుమారునిగాఁ దలంచుకొ
నుం డని సాయాసకృతాంజలి యై యంత్యప్రణామం బొనరిం
చిన సవినయానతుం డై వినతాసుతుం డోకుమార చంద్రా
నాయజ్ఞాననిద్ర దొలంగె నీధైర్యసాహసపరోపకార గుణంబులం
బరిణమించితి నాకేమిహితం బొనరి మ్మనిన. ౨౪౨

1. అస్నువ. అద్భుత.

క. దయసేయుము పాములపై
భయభీతులఁగావు ధర్మపథమునఁ జను ని
శ్చయ మిది దురితము దీనను
లయ మగు నుదకమునఁ బడ్డలవణముభంగిన్. ౨౪౩

క. అని చెప్పి శంఖచూడా
వినుమా గురుజనులసేవ విడువకు మిఁక నీ
జనని కను బెగడకుండఁగఁ
జనుమీ యని పలికి హృదయజలజములోనన్. ౨౪౪

క. రుద్రుని దలఁచుచు గీర్తిప
ముద్రుండు పరోపకారమున నలసిన యా
ముద్ర తన మేనఁ దోఁపఁగ
నిద్రించినకరణి దీర్ఘనిద్రం జెందెన్. ౨౪౫

వ. అంతం దత్సహచరీసహితు లయిన జననీజనకులు తమ యుగోము ఖశిరోఘూరా హాహాకారమహారావంబులు మలయగహ్వరంబున నుపబృంహితంబులై దిక్కులు పిక్కటిల్ల బిట్టేడ్చుచు మూర్ఛిల్లుచు నుభయకృతోపచారంబులఁ దెలియుచు నలయుచుఁ బల
వరించుచు. ౨౪౬

గీ. పురము ధనము రాజ్యభోగంబు విడిచియు
మమ్ముఁ గలసి యిచట మాయనుజ్ఞ
నబలఁ గూడి పిదప నంగనఁ బాసి నేఁ
డొంటి నేఁగ నీకనుచిత మగునె. ౨౪౭

వ. అనవుడు ననుగమనోద్యోగ గావున మలయవతీకన్య ధైర్యం
బవలంబించి. ౨౪౮

క. ప్రాణము కొఱకై యితరుల
ప్రాణము దినుమండు వాఁడు ప్రాణము గావం
బ్రాణం బెడఁబాసిన నా
ప్రాణేశుం డిపుడు మనలఁ బాయుట యరిజే. -౨౪౯

క. మనకుండుట యిట్లెఱిఁగియు
మనకుండుట తగునె యితనిమార్గంబున నా
మనమరిగెడు గతిఁ గడచక
మన మరిగెడు తెఱఁగుఁ గనుఁడు మఱి నగ సేలా, -౨౫౦

గీ. అనిన శంఖచూడుఁ డంబుజావృల
కేన మూల గ్రైతి నితని గంట
నరుగువాఁడ నసిన నాదికారణ మేస
మున్ను సత్తు నసియెఁ బన్నగారి. -౨౫౧

గీ. నాఘృప మీా కింపెఱుసం[1]
జావం బని లేదు సుతునిజాడ నె యోగం
గావలయుం జితి వేగమె
కావింపుము శంఖచూడ కడుఁ బుణ్యా మగుణ్. -౨౫౨

గీ. అనుడు నభముఁ జూచి యమునివర్గములార
ఘనపరోపకారమునకు మెచ్చి
యమృత మైనఁ జల్లి యన్నప్రాణంబులు
గావరయ్య మమ్ముఁ బ్రోవరయ్య. -౨౫౩

వ. అని జననీజనకులు (క్రమంబున) వేఁడినఁ దక్షీణనోపాయం బె
ఱింగి విహాగేంద్రుం డింద్రుం బ్రార్థించి యమృతంబుం దెచ్చి
యిచ్చుట విపన్నంబు లగుపన్నగంబుల తోడ నిష్పన్నగకుమార
రక్షకుం గాచెద నని పూని. -౨౫౪

1. కిద్దబకుఁ.

ఉ. పోయెడు ప్రాణముల్ మగుడఁ బూనిక దప్పిన మేను వహ్నిలోఁ
ద్రోయుదు నెల్ల దేవతలఁ దోలుదు నాకముఁ బట్టి పాడుగాఁ
జేయుదు నష్టదిక్పతులఁ జెండుదు మేదినిఁ గ్రింద మీఁదుగా
వ్రేయుదు నీసిస్టి సమస్తసృష్టి వడిం గురియింతు నింతటన్.

క. అని గాసముఁ జెగసి యేఁగినఁ
దనయునిదెసఁ జూడ లేమిఁ దడయక ఫణిసం
దనుచేత ఖనరసతి చం
దన చితులోనరించు కొనియెఁ దత్పార్శ్వమునన్. ౨౫౬

వ. అంత సర్వాంగసతీసుంధనంబులు గైకొని మలయవతి పతిచితికిం
బ్రదక్షిణంబుగాఁ దిరుగుచు గౌరి నుద్దేశించి. ౨౫౭

క. ఓయంబికె యుగ్మముఁ దధి
కాయుష్ప విద్యాధరేంద్రుఁ డగుఁ బతి యనుచు
న్నాయుగ్గాంగం బిడితి
నీమాట తప్పె నింక సి న్నేమందున్. ౨౫౮

క. అని దూఱంగ ముందటఁ గాం
చనలతాంగి మెఱుఁగుదీఁగ చాడ్పునఁ గాత్యా
యని వచ్చి పుత్రిక నిలు
మని తాప్పదిమీఁదఁ జేసియమృతము చల్లెన్. ౨౫౯

క. చల్లిన సంజీవితుఁ డై
యుల్లస సుఖనిద్ర దెలియునవ్వున నతఁ డు
త్ఫుల్లముఖుం డై గజముఖు
తల్లికిఁ బ్రణమిల్లెఁ దల్లిదండ్రులుఁ దానున్. ౨౬౧

క. మగలకు మగఁ డగుదురునిం
దెగఁ జూచిన శివునిదిక్కు దృక్కుల నిడి యా
మగతనము సగముచేసిన
మగువా మాపాలఁ గలిగి మన్నించితివే. ౨౬౧

వ. అని యుండఁ దలు నానందంబున వందనంబొనర్చు మలయవతి కృతాంజలియై.

క. గరళము మ్రింగినపతికి
స్మరణము దప్పించి మోఱయు మంగళసూత్రా
భరణము గలదేవత వని
పరిచర్య యొనర్చినట్టిఫల మిటఁ గంటిన్. ౨౬౩

క. అని మ్రొక్కఁగ దివిఁ దూర్య
ధ్వను లొలయఁగ సకలదేవతలుఁ గొనియాడ
స్వనతానందనుకతమున
ననిమిషకుసుమములతోడ నమృతము గురిసెన్. ౨౬౪

క. ఆయమృతంబున నస్థిని
కాయము సప్రాణ మైనకాయంబుల న
త్యాయతఫణమణిరుచి సము
దాయము మెఱుఁగిడఁగ నెగసె దర్వీకరముల్. ౨౬౫

క. చెలులుం జుట్టలుఁ గలయం
జెలరేఁగి సుధాంబుపూర్తి చెలువునఁ బాముల్
చెలఁగుచు మలయాచలమున
సెలయేఱులభంగి జలధిఁ జేరఁగఁ బాఱెన్. ౨౬౬

గీ. అంత నమరసిద్ధయక్షగంధర్వులు
గొలువ గగనతలిని జలకమార్చి
సిరులు మిగుల గౌరి జీమూతవాహను
ఖచరచక్రవర్తిగా నొనర్చె. ౨౬౭

వ. అట్టియెడ సత్యంతసంతుష్టాంతరంగుం డై గరుత్మంతుండు చనుదెంచి నీకెద్దియిష్టంబు వేఁడు మనిన నక్కుమారుం డురగహారణంబు విడిచి స్వధర్మప్రతిజ్ఞుండవు గమ్మింతియ చాలు నీప్రసాదంబున నాకేమియుం గొఱంత లేదు. ౨౬౮

క. అనఘులఁ గాచితి నాఁడును
జనముల ప్రాణములు నిలిపె సర్వేశ్వరి యు
న్నన గలిగె నీవు మెచ్చిన
విను రాజ్యం బిచ్చెనేమి వేఁడెద నింకన్. ౨౬౯

చ. అని వినయోక్తిఁ బల్కి జగదంబికఁ గ్రమ్మఱఁ బ్రస్తుతించి య
జ్జననికి మ్రొక్కి యిష్టజనసంగతుఁడై చని తొల్లి యున్నకాం
చనపురిఁ జొచ్చి రాజ్యసుఖసంపదఁ దేలుచు నేలుచుండె స
న్మనితయుఁ దాను నాగ్రసుగసుందననందితచిత్తవృత్తి యై. ౨౭౦

వ. కావున నప్పుణ్యకీర్తిశాంతకాహాయం డెవ్వఁడు గలఁడు. ౨౭౧

గీ. వింటి మునిసిఁ దార్ప్రి కంటి మాతని నేఁడు
వింటి మున్ను బేతాళవిక్రమార్క
ననుసు సంభవించి దనుజేంద్ర విక్రమా
దిత్యుఁ డీతఁ డౌనొక్కొ తెలియ నుసియె. ౨౭౨

వ. నావుడు నావిక్రమసుం డాసనార్తిను నీ వడిగిననరం బిచ్చితిఁ బుణ్యా
త్ముఁడయ్యుం బ్రాంతకుఁ డీ సర్వాంశ వనిన నవ్వసుమతీవల్లభుండు
పూర్వ దేవుండప్ప సీ యట్టుంగ వే విక్రమార్కుండ నగుదు నాచరి
త్రంబు విను యట్టుంగకుండఁ గృప చేసితాంతుండవు గమ్మని
మ్రొక్కి యతనన్నుజ్ఞాతుండై యజ్ఞాతభావంబున మగిడి నిజపురం
బగు నుజ్జయినీపురంబునకుం జనుదెంచెం గావున. ౨౭౩

క. ఇట్టిగుణంబులు నీ కే
పట్టున సమకూరెఁ జెప్పవ చను మి
ట్టటును బౌరలకు మనవుడు
దిట్టతనం బుడిగి వసుమతీపతి మగిడెన్. ౨౭౪

## —: పండ్రెండవబొమ్మ కథ :—

వ. మఱియుం గొన్ని దినంబు లరిగిన ౨౭౫

క. కంబూపమగళు మృగమద
జంబాలీకృతమహావిషద్యుతిసదృక్
స్తంబేరమచర్మాంబరు
లంబోదరగురుఁ గృపావలంబునిఁ గొలుతున్. ౨౭౬

చ. అని మదిలోఁ దలంచుచు ధరాధిపుఁ డిష్ట జనోపవిష్టసహా
దినమున నెక్కఁ బూని యరుదేరఁగ నప్పటిబొమ్మ చూచి యో
జనవర విక్రమార్కుగతి సాహసదానగుణంబు లేక నీ
కెనయఁగ దేవతాసనము నెక్కఁగవచ్చునె[1] నిల్వు నావుడున్.

క. అతనికడ నట్టిసాహస
వితరణగుణ మెట్లు చెప్పె వివరింపు మనం
బతిగుణములు పండ్రెండవ
ప్రతిమ యెఱింగింప భోజపతి కిట్లనియెన్. ౨౭౮

మ. విను మావిక్రమభూవరుండు విమతోర్వీనాథసందోహని
ర్జనసంపన్నజయాభిరాముఁడు సదాచారప్రచారోచితా
త్మనయప్రాభవధర్మనందనుఁడు విశ్వత్రాణనాకేళిసం
జనితానందుఁడు సాగరాంతముగ నీక్ష్మామండలం బేలఁగన్.

గీ. అతనివీట నర్థపతి కెనయగు భద్ర
సేనుఁ డనఁగ నొక్కసెట్టి గలఁడు
వాని కొకఁడు గలిగె దానసుందరుఁడు పు
రందరుం డనంగ నందనుండు. ౨౮౦

1. యెత్తున నసురాపవంబు పెనఁ ద్రొక్కఁగ వచ్చునె.

క. ఆకోశము కడపటఁ బర
లోకమునకుఁ జనిన నర్థలోభ మడిగి సు
శ్లోకుంసు పురందరుఁ డీ
లోకము గొనియాడ దానలోలుం డయ్యెన్.[1]

క. అతని దనువ్యయముఁ గనుఁగొని
హీనులందఱు వచ్చి బుద్ధి యిది గా దుచిత
స్థితిననున్న మహాదార్యో
న్నతి దారిద్ర్యంబు వచ్చు నరపతి కైనన్.[2] ౨౮౨

గీ. ధనము గలుగువాఁడె ధన్యుండు మాన్యుండు
ధనముగలుగువాఁడె ఘనుఁడుజగతి
ధనము గలుగువాఁడె తగవులకాధ్యుండు
ధనముగలుగువాఁడె మనుజవిభుఁడు. ౨౮3

గీ. ధనము గలిగె నేసి ధర్మార్థకామమో
క్షములు నచట నచట జనుసవచ్చు
ధనముగలుగు వేళ జను లెల్లఁ దమవారు
ధనము లేనివానిమనికి చావు. ౨౮౪

మ. అని చెప్ప న్విని యఃస్పురందరుఁడు గర్వాక్రాంతుఁడై నవ్వి యి
ట్లనియెన్ దానము భోగముం దగవుఁ జేయం బాడి గాదేని యీ
ధన మేలా వఱి లోభ మేల సుఖికిన్ దారిద్ర్య మే మేలు నాఁ
జనదే మర్త్యుఁడు మంటిపాలయిన నేసౌఖ్యంబు భోగించెడున్.

క. మును దనకుం గానున్నది
పనివడి యఁగు నారికేళఫలరసముక్రియం
జనునున్నది చనుఁ గరిగ్ర
స్తున క్రమింగిన నెలఁగపండుగుంజును బోలెన్. ౨౮౫

1. క. ఆకాశసాగరాంతర శ్లోకుఁడు పురందరుండీ, లోకము గొనియాడ దానలోలుం డయ్యెన్, 2. సమున్నతి ధనమునఁ జొప్పడు హీనత దారిద్ర్యమునవచ్చు.

సీ. ఈపురి వెడలి యే నెల్లతీరంబులుఁ
దిరుగుచుఁ గేదారధరణి కేఁగి
మగిడి వచ్చుచు హేమమణిమయప్రాకార
రమ్యమహా మధురాపురంబుఁ జూచి
చని యొప్పిదం బెల్లఁ గనుఁగొని రే యొక్క
ద్విజునింటిపొంత నిద్రించునప్పు
డనద ననాథ నిరాధారఁ గావరే
యనుచు వీతెంచె నార్తారవంబు[3]

దాని కుల్కి మిగుల దయ గల్గియును లావు
లేమి యేమియు నన లేక యుండి
రేపకడన లేచి యాపురజనుల న
య్యబలవార్త దెలియ నడిగి వింటి. ౧౫౪

వ. ఎట్లనిన. ౧౫౫

క. చెల్వొనరెడు పురి చేరువ
బిల్వవనాంతమున రేయి భీమాకృతితో
నిల్వలనిభుఁ డొకదనుజుఁడు
చెల్వం బెనుకళలమొత్తి చెండుచు నుండున్. ౧౫౬

క. ఆపొలఁతుక రేయెల్లను
వాపోవుచునుండ నసుర వారింపంగా
నోపగు పతు లెవ్వరుఁ బృ
థ్వీపాలక యేను విన్నతెఱఁ గిది చుమ్మీ.[1] ౧౫౭

ఉ. నాపృథుఁ జోద్యమంది నరనాథుఁ డనాథఁ గృశాంగి నంగనం
గావఁ గడంగి హస్తమున ఖడ్గము తోడుగ నెట్టెఁ గూడి యా
త్రోవన యేఁగి దూరగతి దోఁపఁగ నల్లన నొక్కనాఁడు ల
క్ష్మీవిభవాఢ్య మహా మధురఁ జేరె నినుం డపరాద్రిఁ జేరఁగన్.

1. బృథ్వీపాలక దీనికతము దేవర యెఱుఁగుమా.

క. మలయుచు నెమ్మ్యోడఁ గలచుం
దెలివిపడ న్వెలిఁగి భువనదీపము చనిసక్
మలినాకృతితోఁ గాటుక
ముల్క[1] గ్రిదు స్న భము తిమిరమయ స్పై పొలిచెక్. ౨౯౯

గీ. అప్పు డధిపుఁ డాపురాంతికవసభూమి
యమున పగిదినున్న తమముఁ జూచి
వైశ్యతనయ నెఱవ నం దపు తెలుపుము
నచట నసురరాక యరయుచుండె. 300

గీ. వాలుఁగంటి మొల్ల వాలాయ మగునాఁ
వాలుగాఁగఁ జీకువాలు సాచి
వాలుపెటికికొనుచు వాలుమగం డేఁగె
వాలు దైత్యునుదుటి వ్రాలు సేయుకున. 30౧

క. ఈరీతిఁ గాచియుండఁగ
నారాక్షసుఁ డంత సంగనామణి ముప్తాం
గా రానము వినవచ్చిన
నారాజును నాలకించి యతిరభసముసక్. 30౨

క. నెఱవకు పఱవకు తరుణీ
మొఱ యాలించితి[2] నృపాలముఖ్యుఁడ సీక్తై
పఱతెంచితిఁ బరిపరిగాఁ
గఱకు టసురఁజెండి నైతుఁ[3]గా చెదనిన్నుక్. 303

వ. అని. 30౪

శా. ఓరీరాక్షస వట్టిగర్వమున నీ వుప్పొంగి దీనానన
న్నారీరత్నము నేల నొంచె దిట్టు లన్యాయంబు గావింతువే
యేరా చెప్పఁగనైన మున్నెఱుఁగవే యే విక్రమార్కుండ నీ
క్రూరత్వంబును దర్పము న్బలిమియు న్మాపార్చెద న్నిల్వుమా

1. కాటుకమలక = మసిమూకుఁడు. 2. మొఱగకు వచ్చితి. 3. టసురవిపుదెచెండి.

క. అనవుడు రోషంబున ని
ట్లను మాయాబలసమగ్రుఁ డగుమంనుభికి
న్మనుమఁడ నోరి నరాధమ
ఘనభుజదర్పుఁడఁ గఠోరకరుఁడం జుమ్మీ. ౩౦౬

క. ఆలమునఁ బంద[1]పగతుఁల
నాలం బొనరించినట్టు లాడెద విటు నా
పాలం బడితివి[2] నేఁడు నృ
పాలాధమ నిన్ను భూతబలి గావింతున్. ౩౦౭

క. నీకొలఁదివారియెముకలు
నాకోఱలసందిఁ జిక్కి నలుతునునీవే
లోకము సొచ్చిననైననుఁ
బోకార్చెద నిన్నుఁ బదరి[3]పోవక నిలుమా. ౩౦౮

వ. అనిన వీరరసభీషణంబు లగుభాషణంబుల విక్రమభూషణుండును దోర్దండమండితారాతిరాజమండలదండితప్రచండభుజాగ్రమండనాయమాన మండలాగ్రధరుం డగుడు నద్దండిమగ లొండొరులం దాఁకి పెనఁగి. ౩౦౯

క. మదకమలకరణి సింగపుఁ
గోదమల్లకియఁ బులులభంగి గురుపోతుల్ప్ర
ల్లదముల[4] శరభంబులగతిఁ
గదిసెర కదనమున కవని గ్రక్కదలంగన్. ౩౧౦

ఉ. బంధురవిక్రమస్ఫురితబాహులు దైత్యుఁడుఁ బార్థివుండుఁ గ్రో
ధాంధత మీఱి పోరిరి దశాననుఁడు గ్రఘునాయకుండు న
య్యంధకుఁడున్ హరుండు నరకాసురుఁడు న్నలినాక్షుఁడు న్జరా
సంధుఁడు వాయుసూనుఁడునుజంభుఁడునింద్రుఁడుఁ బోరుకైవడిన్

వ. ఇట్లు పోరు నెడఁ బ్రభాతం బైనఁ దత్కాలోచితంబుగ. ౩౧౨

---

1. అలమునఁబడిన. 2. నావాలునఁబడితివి. 3. బెదరి. 4. బెట్టిదమున.

క. క్రందఱి తన తేజమునఁ[1] బుఁ
రందరుదెసఁ దెలివిగలుగ రాత్రిం జనఁగన్
ప్రమదించె విక్రమార్కుఁడు
సుందరి ముఖపంకజమున సొంపు జనింపన్. ౩౧౩

గీ. మండలేశ్వరుండు మండలాగ్రంబున
దండి మించులఁ గలిగి దంష్ట్రిదైత్యుఁ
జెండి పాఱవైచి గండభేరుండనిభము
నుండెఁ గండ లుబ్బఁ గుంపుకొనఁగ.[2] ౩౧౪

గీ. దిశలఁ దెలివి గలిగె దివ్యతూర్యంబులు
చెలఁగె నారదుండు మలసి యాడె
నాకసమున నిల్చి యమరవర్గము జన
విభుని మీఁదఁ బుష్పవృష్టి గురిసె. ౩౧౫

గీ. నృపుఁడు సంతసిల్లి నీరజాసనఁ జూచి
పడఁతి యిట్లు కొట్టఁబడఁగ నీకు
నేమికతము దీని నెఱిఁగింపవచ్చునేఁ
జెప్పు మనిన వినతి చేసి పలికె. ౩౧౬

గీ. వసుమతీరమణ యవంతిదేశంబులో
ధర్మశర్మ యనఁగఁ దగినవిప్రు
భార్యఁ గాంతిమతి నకార్యంబు గావించి
కులము చెఱిచి మిగులఁ గుటిలనైతి.[3] ౩౧౭

ఉ. భవ్యుఁడు ధర్మశర్మ తనబాంధవవర్గము చెప్పఁగా మదీ
యవ్యభిచారము ల్గఱిఁగి యాత్మఁ గలంగియు, నింతి దా నహం
తవ్య[4] యటంచుఁ దెంపుడిగి దానవుచేతికశాహతి న్నరీ
రవ్యథఁ గుందుచుండు బహురాత్రులు నీవని శాప మిచ్చెనన్.

---

1. కెందలిరుతేజమునను. 2. పొందుకొనఁగ. 3. కులముచెడితి మిగులఁ గుటిలనైతి. 4. కామినీవహంతవ్య.

క. గడగడ వడఁకుచు మానము
సడలఁగ ధరఁ జాఁగి మ్రొక్కి శాపావధి యె
న్నఁడు నాకుఁ గలుగు ననుచుం
దడసోర్వమి విన్నవింప దయతో నతఁడున్. ౩౧౯

క. అసహాయశూరుఁ డగునొక
వసుధాపతి వచ్చి రేలు వగఁబెట్టెడున
య్యసురఁ బొరిగొన్న యప్పుడ
సెస నీశాపమున కెల్లవీడ్కోలనియెన్.[1] ౩౨౦

శా. ఆశాపంబున నీనిఁబారిఁ బడి దేహం బెల్ల మ్రందంగ న
య్యాశాబంధము పేర్మిఁ బ్రాణములఁ బాయంజాల కే నుండఁగా
నీ శస్త్రప్రభ నాతమం బడఁపి మన్నించెం గృపం జూడు భూ
మీశాధీశ్వర! నీకు మే లొకటి యే నిచ్చోటఁ గావించెదన్.

సీ. ఇక్కడి గుడితూర్పు దిక్కునఁ బక్కెచె[2]
ట్టున్నది దానికి నుత్తరమునఁ
[3]బరు నేఁడు దవ్వున బరివెంక పడుమటి
నెలవునఁ దొమ్మిది నిధులమీఁటి
దనుజుఁడు దాఁచిన ధనము పెక్కున్నది
కైకొమ్ము నామీఁదఁ గరుణసేయు
చనియెద నని మ్రొక్కి వనిత యేఁగిన రాజు
నెఱఁగంది యక్కడ వెదకి కాంచి

దీనుఁ డైనభద్రసేనతనూజున
కిచ్చి వేడ్క మగిడి వచ్చెఁ బురికి
నిట్టిగుణము లేక యిది యెక్కవచ్చునే
కొమ్ము చాలు నింక భోజరాజ. ౩౨౨

1. వెసనీపాపమున కదియెవీడ్కోలరయన్. 2. పరిచిచెట్టు- (బరివెంకకుఁ బక్కె-నామాంతరము. వరికె వృక్షవిశేషము.) 3. పరుపుదవ్వున-

క. అనవుడు నంతను నంతను
వినవింపగు నతని తెంపు విని సభ యెల్లన్
మన మలరఁగ నవమానం
బును[1] సిగ్గును ముడిపడంగ భోజుఁడు మెచ్చెన్. 3-౨౩

ఉ. అక్షీణప్రతిపక్షభావసముద్రగాటోపజాగ్రన్నవో
రక్షోనాయకపక్షతక్షణవిహారక్షిప్తకాక్షేయకుం
గుక్షిన్యస్తసమస్తలోకభరణక్షుణ్ణాత్మయాత్రాన్నప్రతి
ప్రక్షేపోచితు వాహనీకృతమహాపక్షీశు లక్ష్మీశ్వరున్. 3-౨౪

శా. ఉల్లాసోద్ధతచండతాండవవిహారోత్తుంగరంగజ్జటా
వల్లీమండలమల్లికాకుసుమభావప్రాప్తబాలేందుసం
ఫుల్లేందీవర రేణుసంగకబరీభూతాభ్రకూలంకషా
కల్లోలోపరిబిందుహారాక్తికమయూకల్పోత్తమాంగున్ శివున్.

మాలిని. ధరణిధరవిభూషా ధర్మనిర్మాణతోషా
సరసిజభవసేవ్యా సంతతాత్మీయభావ్యా
నిరుపమనిజలీలా నిత్యకళ్యాణశీలా
పురహరహరిరూపా భుక్తిముక్తిస్వరూపా. 3-౨౫

గద్యము. ఇది రాయగజగంధవారణ వైరిమండలిక భేక ఫణీంద్ర వీరఘో
ట్టవిభాళాదిబిరుద ప్రకటచారిత్ర కళింగదేశ సింహాసనాధామత్యాగ
నాగార్జున కర్ణాటద్రవిళాంధ్రమహారాష్ట్ర భూపాలరూప నూపుర
సుందర చరణారవింద సనవ్రోలిపురవరాధీశ్వర వెలనాటిపృథ్వీ
శ్వర రాజ్యసముద్ధరణ శ్రీగోవిందయామాత్య పుత్రహారీతస
గోత్రపవిత్ర సకలసుకవిమిత్ర కసవరాజతనూజ గోపరాజవిరచి
తంబైన సింహాసనద్వాత్రింశిక యను కావ్యంబునందు విక్రమా
ర్క మహౌదార్యంబును జీమూతవాహనోపాఖ్యానంబును సాహ
సాంకునిసాహసౌదార్యంబులు నునన్నది పంచమాశ్వాసము.

ప్రథమభాగము సంపూర్ణము.